# మొల్ల రామాయణము
# హరికథానువాదము



అనువాదకులు, రచయిత :

తాళ్ళూరు శంకరయ్య భాగవతార్,

ఆకాశవాణి హరికథా కథకులు

# స్వపరిచయము

సీ. ధవుని పోరిక దల్చిక వినినేరిమి గెల్చి మీరిన జాణ నెల్లూరు సీమ
కళలకు పుట్టిల్లు కవిగాయకుల కాట పట్టు వేంకటగిరి పట్టణమున
కనతి దూరంబున 'అమ్మపాళెం' బు గ్రామంబున యా దనాన్వయమునందు
జనియించినాడనా జనకుండు తాళ్ళూరు నరసయార్యుడు, తల్లిపరమపూజ్యు.

తే. గీ. రాలు వేంకటమాంబ శ్రీరమణు దివ్య, గాథలన్ హరికథలుగా బాడగల్గువాడ
కథకుడను గాయకుడను సత్కవిని, శంకరార్య నాముఁడ సంఘసేవా నిరతుడ.

తొలి మాట:

ఈ గ్రంథము ధర్మ ప్రచారమున కెంతయును తోడ్పడగలదను పూర్తి నమ్మకముతో మొల్లరామాయణ ప్రబంధమును హరికథగా అనువందించితిని. కేవలము హరికథకులకే గాక, జనసామాన్యమునకందరికీ చదువదగినదియే. మొల్లకవిత్వమునకే మాత్రము భంగము రానీయక యాథాతథముగనే యుంచి, పాటల, మంజరుల, పద్యముల గూర్చితిని, అంతయునూ మొల్ల ప్రతిభయే గాని నాయది యొకించుకయును లేదని మనవి చేయుచున్నాను.

## మొల్ల ప్రశంస

**మోహన కళ్యాణి – ఆది. రామధ్యానము**

ప. రామానను బ్రోవరా, శ్రీ రఘురామ, నను బ్రోవరా.....శ్రీ ॥రామా॥

అ.ప. కామారినుత గుణధామా, కోమల మేఘశ్యామా, యాశ్రిత
జనకామా, వేడెద రఘురామానను బ్రోవరా...... శ్రీరఘు ॥రామా॥

కం. మొల్లన్, నవకవితాసుమ, వల్లిక్ సాహిత్య కనకవల్లిన్, మృదువా
గ్వల్లిన్, కిసలయ సౌరభ మల్లిన్ నాహృదయమందు మానకనెంతున్.

కం. చల్లని పన్నీటిన్నబలె, ఝల్లను హిమధారలట్లు చెలు విడుభళిరా!
మొల్లనకవిత జల్లుల నెల్లరిహృదయములు పల్లవింపక యున్నే!

ఆ.వె. పంచదార గూర్చి, పాలు మీగడజేర్చి, జుంటి తేనె గల్పి జున్ను నింపి
పనసతొన లిమిడ్చి పరిపక్వ మొనరించి, చెఱకు రసము జేర్చి సిద్ధపరచి.

ఆవె. నవ్య సుధలతోటి నాజూకుగా మొల్ల – వ్రాసియిచ్చెమనకుకు రాముచరిత మద్ది
మద్ది దానియందు మంజర్లు పాటలు, మధుర మొప్ప వ్రాతుఁ మఱియు నేను.

తే.గీ. కలిగెనామది యందు నా కాశవాణి, కడప కేంద్రాన హరికథగా వచించి
నప్పటియు నుండిమొల్లరామాయణంబు, పూర్తిగా హరికథన్జేయబూనుకొంటి.

కం. సంగీతము సాహిత్యము లంగములైబరగు హరికథా సుథలహరిన్, పొంగించి,
భక్త తతికిడు దుం, గరుణామూర్తి రాముతోరంపుకృపన్.

కం. వనితా లోకమునకుతల మానికమై నుదుట తిలకమై, కుమ్మరజా
తిని దివ్య తారయై నిలి, చెను స్థిరముగ నారిపోక దేదీప్యంబై

తే. గీ.మొల్ల రామాయణముకన్న యుల్లములను, పల్లవింపగఁ జేయు ప్రబంధ మొండు
లేదనుచు శిఎటగావచ్చు లేశమేని, కవుల తలమానికము మొల్లకల్లగాదు.

ఆ.వె. రసికురాలు మొల్ల రామాయణంబును, ఎల్లజనుల మనముల్లుల్లసిల్ల
కూర్చియుంచె పురుష కోటికే మాత్రము దీసి పోక మించి దీక్ష తోడ.

తే. ఎల్లరకు సంఘమందు ప్రత్యేకముగను, హరి కథకులకు ముఖ్యంబటంచునెంచి
పూను కొన్నాడ గూర్చగా నేను, నిందు మంజరులు పాటలన్మధుమధుర మొప్ప.

ఆ.వె. సంఘమునకు మంచి సమకూర్చి, శ్రీనాథు సేవ మానవులకు సేవజేసి
ధన్యులగుడు ఎల్ల దర్మంబులెఱింగించి, దాసులారా! హరి. దాసులార.

తేగీ. మనసునందు జనించిన మమతతోడ, పట్టగారాని యానంద పరత తోడ
వ్రాసినాడనీ గ్రంథము వన్నెకెక్కి, ప్రజలకిహపరసుఖముల బరగజేసి,
అవనినా చంద్రతారార్కమలరు గాత – శుభమస్తు.



తే. గీ. మధురసుధలొల్క మొల్ల రామాయణంబు
పాటలన్మంజరుల గూర్చి పాడియాడ
శంకరార్యభాగవతారు సరసుడదిగో
నల్లదే కనుడు వాని చాయా పటంబు

చ. సుమధుర గాయకోత్తముడు, సూరి జనాళిహితుండు, సాహితీ
సుమఘుమవల్లి సత్కవిత సుందరి కెంతొ ప్రియుండు, ఎల్లకా
లముల పరోపకారయభిలాషి, సుభాషి, కృపాంబురాసి, నీ
యమలుని శంకరార్యుని దయామతిగాచుత! శౌరి నిత్యమున్!

ఉ. గానకళా విశారదుని కమ్మని కంఠ నినాదశోభితున్
ఏనుగు పై పురోత్సవము నెంతయు గొప్పగగొన్న సత్కథా
మానితునార్య సన్నుతుని, మంచి జగంబున కెంచునుత్తముం
డైన మనీషి శంకరుని, యచ్యుతుడుడెల్లపు డేలుగావుతున్.

మంజాగాన ప్రియుడు – మాయ కతీతుండు భక్తవత్సలుండు భాగవతుల
పాలికల్పతరువు పాలించుగావుత! శంకరార్యు నెపుడు సకలసిరుల.

తే. గీ. తిరుమల నివాసలోకేశ – దీన పోష శ్రీశ జగదీశ! పరమేశ – చిద్విలాస
లలిత మృదుభాష లక్ష్మీశ – రహిత దోష విమల దరహాస ! కేల్మోడ్తు వేంకటేశ!

చ. నినుభజియించి, ఇర్వదియు నెన్మిది ఏండ్లుగ, నీ కటాక్ష వీ
క్షణ పరిపూర్ణతన్నెరసి, సమ్మతినిచ్చిని నంకితమ్ముగా
గొనుముదయామయా మిగుల కూరిమి రామచరిత్రమున్ను, రా
మునకిడియుండె! మొల్లకడు మోజుగ గూర్చితి పాటమంజరుల్.

ఉ. సార్థకమయ్యె నాభవము సల్పగ మానవదేశ, దైవ, సే
వార్థమికేమిగా వలయు, వ్రాసితి నాశయసిద్ధి, నందితిన్
ఆర్థిక సాయమందె పరమాత్ముని, తిర్మల వాసు శ్రీశు, ప్రీ
త్యర్థము నచ్చు నొత్తిడగనందరు నధ్యయ నంబొనర్పగన్.

తే. గీ. ధన్యతమమయ్యె నా జీవితమ్ము యింక చచ్చి యుద్ర్బుదుకుదీయిల శాశ్వతముగ
నినుడు శశి, తారకన్నేల నింగి, ఎంత కాలముండునో నేనంత కాలముండి.

ఆ. వె. పుట్టి పోవుచుండు – భువి నెన్నోజీవులు అందుమనుజజన్మమధిక మనిరి
ప్రాజ్ఞులైన వారు పాటింపు డెల్లరు, శంకరార్య మాట స్వర్ణబాట.

## అభినందనలు

కం. స్టూడెంట్సు ఆఫ్‌సెట్ ప్రెస్ పోడిమి ప్రింటొనరిచిడియె ముచ్చటగ ప్రతుల్
వేడుకఁయభినందనలే నిడెదఁ యవ్వారికిపుడు హృదయస్ఫూర్తిఁ

# కృతజ్ఞతాభినందనాభి వందనాశీస్సులు

మాన్యులు శ్రీ తి. తి. దే. కార్యనిర్వహణాధికారివారికి

సీ. తిరుమల తిరుపతి దేవాలయమ్ముల, కార్య నిర్వహణాధికారి ఘనుడు
ఆర్యమతుఁడు డాక్టర్ రౌదార్య గుణనిధి పి. కృష్ణయార్యుఁడు మిగుల గొప్ప
చదువరి ఐ.ఎ.యస్. సార్థక జన్ముండు, సర్వేశు భక్తుడు సౌమ్య హృదయు
దీపోత్తమిచ్చు నొత్తింపగ నార్థిక సాయమెంతొ యొనర్చె, సంతసమున

తే. గీ. కోరి నంతనె ధర్మ ప్రచారమునకు, తగిన ప్రోత్సాహమొసగి సప్తగిరి వాసు
డమ్మహాత్మున కాయురారోఽగ్యభాగ్యములనుదయనిడి నిరతంబు బ్రోచుగాత!

మాన్యులు శ్రీ తి. తి. ప్రచురణ శాఖ సంపాదకుల వారికి

సీ. తిరుమల తిరుపతి దేవాలయమ్ముల ప్రచురణ శాఖ సంపాదకులుగ
తగు సలహానిడి దారి జూపించె మాన్యుండు (N.S.) ఎన్. ఎస్. రామమూర్తిగారు
ఈఁపొత్తమచ్చు వేయింపంగ మార్గంబు నడిగిన వెంటనే తడవులేక
ఆర్థిక సాయంబునందగధర్మ ప్రచారమునకు నెంతో సాయమొసఁగె
సరసుడున్నహృదయుడు సౌజన్య వరుఁడు, నయిన యిమ్మహనీయునకనవరతము
సప్త గిరివాసుడిచ్చుతఁ సకల సిరులఁ పూర్ణముగనాయురారోగ్యభోగములను.

కం. అని కరుణామయుడగు శ్రీ, శునకున్గేల్మోడ్చి, ఎల్ల సూరిజనులకు
న్ననయము వినయమ్మున వందనముల నిడు దున్కృతజ్ఞతాపరదాస్నే.

మిత్రులు మదీయ శ్రేయోభిలాషులు, మాన్యులు శ్రీ త్యాగమూర్తి శర్మగారికి అభినందనాభివందనమ్ములతో –

ఆ. వె. సరసచతురభాషి, సాహిత్యయభిలాషి మదనపురినివాసి – మాన్యరాశి
ప్రాస్యకలిలో వేషి, అవధాన పరితోషిత్యాగమూర్తి విమల – ధవళకీర్తి

ఉ. నాకు మహోపకారి, మదినమ్మిన మిత్రుడు, శ్రీ పురాణవం
శాంకురుడుత్తమోత్తముడు, సద్గుణవంతుడు, త్యాగమూర్తికే
జేకురనిష్టసిద్ధులను జేతులమోడ్చిన మస్కరింతుల
క్ష్మీకుచమండలాధిపుని శిష్టజనావను శ్రీనివాసునిన్

ఆ.వె. ఇంతకంటెనేమి యీలేను మిత్రమా! త్యాగమూర్తి కర్మరాగవర్మ
అందజేయుచుంటి నభివందనమ్ముల పేదకవిని గొనుము ప్రేమ తోడ.

అందరికి హృదయపూర్వకాభివందనములతో
తాళ్ళూరు శంకరయ్య, భాగవతార్,
అనువాదకుడు ( రచయిత)

శుభమస్తు
లోకాసమస్తాస్సుఖినోభవంతు
ఓం తత్ సత్

# విషయ సంగ్రహము

ఆదికావ్యము, రామాయణము, అదుండి సమస్త ధర్మము లావిర్భవించినవి. మానవుని ధర్మపథమున నడపుటకు రామాయణము దేదీప్యమానమౌ వెల్గు నిడు దివ్యతార దివ్వె. ఇందు, సాంఘిక, నైతిక, ఆర్థిక, భక్తి, జ్ఞాన, వైరాగ్య విషయములెన్నియో గూడ నిగూఢములైయున్నవి. జ్ఞానము గలవాడు మానవుడు జ్ఞానహీనుడు దానవుడు. అజ్ఞానాంధకారమును రూపుమాపి, జ్ఞాన జ్యోతిని ప్రసాదించు దివ్య సాధనము రామాయణ పఠనము.

పఠనమే గాక మననము చాల ముఖ్యము. మననము మానవ కర్తవ్యము. గావుననే సనాతన ధర్మమాచరణీయము. అట్టి యాచరణీయమగు సనాతన ధర్మమును బోధించి మానవునికి అపార సౌఖ్యము నందించగల సాధనమగుటచే శ్రీ మద్రామాయణము ఆది కావ్యమైనది. ఇట్టి మహా కావ్య రచన మంత సులభముగాదు. గావుననే మహా ఋషి వలన వెలువడినది.

'నానృషేకురుతేకావ్యం' ఋషికాని వాడు కావ్యమొనర్ప జాలడు. అందులకే యట్టి వానిని ఈశ్వరుడనిరి, ఋషీశ్వరుడు, మునీశ్వరుడు, కవీశ్వరుడు, కోటీశ్వరుడు, ఈశ్వరాంశులు ''సాహిత్య రసాస్వేత్తి శంకరోనవినావినా'' సంగీత సాహిత్యము లలో సంగీత రసాస్వాదన శిశువు పశువు, ఫణి, స్థాణువు సైతము చేయగలుగునని, అనగా శిశువు కుమార స్వామి పశువు నందీశ్వరుడు పణి ఆదిశేషుడు అనిగూడ చెప్పవచ్చును. అయినను, సాహిత్య రసాస్వాదన, యొక్క శంకరునకే, అనగా ఈశ్వరునకే ననక తప్పదు. సాహిత్య మందరి కందుబాటులో నుండదు గాన ఇక ఈశ్వరాంశసంభూతుడగు వాల్మీకి మునీశ్వరునిచే సంస్కృతమున రచియింపబడి, శృతి, లయ రూపమగు సంగీతమున గానము చేయబడుటచే, సంగీత సాహిత్య మిళితమైనదని చెప్పక తప్పదు. అట్టి రామాయణమును, జగమంతయు పలు భాషలలో అనువందించుకొని ఆనందముతో చదువుకొని విని బ్రహ్మానందపరవశులగుచున్నారు.

తెలుగు లో ఎందరో, ఎన్నో పేర్లు బెట్టుకొని, రామాయణములెన్నో వ్రాసిరి. అందు కవి చమత్కారామకూరి మొల్ల నామధేయ ప్రణీతంబయిన మొల్ల రామాయణ పఠన మెల్లరి చదువరులయుల్లంబులం పల్లవింపజేయగలదనుటలో అతిశయో క్తించుకయున్లేదు. అట్టి కావ్యమును సంగీత రూపమున గానమొనర్చుకొనుటకు పాటలు, మంజరుల నూర్చు మహా భాగ్యము లభించినందులకెంతయో సంతోషించుచు, ఈ గ్రంథము ధర్మ ప్రచారమునకెంతయునుపకరించగలదని విశ్లేషించుచు, నా తుది సందేశముతో,

పుట్టి గిట్టుట సహజంబు పుడమిఁజీవి
జీవులకు నెల్లమనుజుడే శ్రేష్ఠ జీవి
జీవితము నంకితముదేశ సేవకొఱకు
జేయునెవ్వండునాతఁడే చెడని జీవి -యని తెల్పుచూ.

శ్రీరస్తు

# మొల్ల రామాయణము - హరికథానువాదము

''శిశుర్వేత్తి, పశుర్వేత్తి వేత్తిగానరసంఫణిః'', అని, యార్యులనానుడి. అనగా శిశువులు, పశువులు, ఫణులు సైతము గానరసాస్వాదనమున పరవసించుననను సామెత. సామెతయే కాదు మనకు ప్రత్యక్షానుభవము గూడను. పసిపాప (శిశువు) తల్లి బాడు జోల పాటవిని, ఏడ్పుమాని ఆనందముగా నిద్రించును. పసుల కాపరి పిల్లన గ్రోవి పాట విని పశువు పరవశముజెందును. సర్పము, మాంత్రికుని నాదస్వరము విని తలయూపి యొయ్యారముగా నాడును. గానమునకు పరవశులై రసజ్ఞులగు శ్రోతలు పరవశత్వమునందలలూపుట మనకు ప్రత్యక్షానుబవము. ప్రకృతియే గానమయము. జగన్నాటక సూత్రధారి శ్రీ గోపాలకృష్ణుని దివ్య మధుర మంజుల గానపరవశులై, గోపికలు తమ చేయు పనులు మాని, అర్ధరాత్రమున యమునాతటమునకు జేరిరని, గోవులు నెమరు పేయుట గూడమాని, కృష్ణుని వైపు చెవులు నిక్కబెట్టి పరవశించినవని, శ్రీ మద్భాగవత గ్రంథమునం జదువుచున్నాము. కుశలవులచే శ్రీమద్రామాయణమును శ్రీరామచంద్ర పరబ్రహ్మయెందుట గానవము జేయబడి, పరవశవెునర్చెనని, చదువుకొనుచున్నాము గదా? అట్టి రామాయణమును పలువురు పలు నామములతో రచనమొనర్చి, పురాణ రూపముననేగాక, యక్షగాన రూపమున ఆడి పాడి వినిపించుట, బ్రహ్మశ్రీ నుదజ్ఞానాది భట్టు నారాయణదాసవర్యులు, హరికథా పితామహులచే గానము చేయబడి, ''కథకవాచ స్పతి'' ''కవిశిరోమణి'' శ్రీ సీరిమి సుబ్రమణ్య భాగవతాదిగా'' పలువురు ప్రముఖ హరిదాస వర్యులచే 20వ శతాబ్దమున దేదీప్యమానమై, తెరమఋగగుచున్న నేటి రోజులలో హరికథోద్ధరణకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వారు ధర్మ ప్రచారార్థము చేయూత నొసంగి ప్రోత్సహించుచుండుట విదితమే. ప్రకృతియే ఓంకార గానోద్భవము.

శ్రీమద్రామాయణమును ప్రముఖ కవయిత్రి మొల్ల తన దుబాణిచే పురుష పుంగవుల కెంతయున్దీసి పోకతిమనోజ్ఞముగ మృధుమధురరీతిర్రచయించి నెల్లూరు మండలమున లేని కీర్తి నార్జించి, ఆదర్శమహిళగా చిరస్థాయిన్నిలిచి యుండుటయున్విదితమే. నేను ఏబది వర్షములుగ, రామాయణ, మహాభారత, భాగవతాది ఇతిహాసముల నుండి యనేక గాధల హరికథా గానమొనర్చుచు, తలవని తలంపుగా 1988లో 'ఆకాశవాణి కడప' కేంద్రములో 'ఆశ్చర్య చూడామణి' యనుపేర మొల్ల రామాయణము నందలి, సుందరకాండమున కొంత భాగము హరికథాగాన మొనర్చి, ఆ కథ చాలా బాగుగా రక్తి గట్టుటచే, మొల్ల రామాయణము పూర్తిగా పాటలు, మంజరులతో నింపిన, ధర్మప్రచారమునకు హరికథా రూపయున గానము జేయుటకు, బాగుండునని తలంచి, ఇప్పటికి 12 సంవత్సరముల నాడే పని పూర్తి చేసి, ముద్రణకార్థిక స్తోమత లేక పోవుటచే నిరుత్సాహమున నూరకుండి. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వారు గ్రంథముద్రణ కార్థిక సహాయము చేయుదురని విని కొత్యాభ సంపాదకుల రామమూర్తి వారి నర్థించగా శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు వారికి ధర ఖాస్తుబంపుకొమ్మని సలహానిచ్చిరి.

ఆ.వె

గ్రంథముద్రణ జరిగినచో ధర్మప్రచారమునకత్యంతోపయుక్తముగుటయే గాక, పూర్వగాథలుపురాణేతిహాసములు జీర్ణించిపోకుండ, పునరుద్ధరించ బడగలవని పూర్తినమ్మకమునూ, సర్వధర్మముల నెరింగించు నీగ్రంథము, ధర్మ ప్రచారమునకు శ్రీ తి.తి.దే. వారు దప్పమరెవ్వరు జాలరని, కవులను, గాయకులను పోషించు రాజులు, రారాజులెప్పుడో గతించిరిప్పుడెవ్వరులేరని, రాజు, మహారాజు, రారాజులకు రాజొక్క శ్రీనివాసమూర్తియేనని, గత27వ సంవత్సరముగ ప్రతి ఏటా శ్రీ వేంకటేశ్వర ఆర్షసదస్సులందు హరిథాగానము చేయుచు, అన్ని శక్తులుండియు ఆర్థికశక్తి లేక దైవోపహితుడనై కొన్ని దుష్ట శక్తుల అవరోధ దుష్ప్రభావమువలన శ్రీ తి.తి.దే. వారి హరిదాసుగా ఉద్యోగమునకు నోచుకొనలేక దూరమై పోయినందుకు చింతించుచూ.

కావ్యానువాదనమున్నైనను జగమునకుపకరించగలనను నమ్మకమంతో, శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వారు విరివిగా హరిదాసులనేర్పాటు చేసి, ఊరూరా, వాడవాడల, పల్లెపల్లెల ధర్మప్రచారవముగావింపనాశించి యర్థించుచూ.

దాసానుదాసుడు, అనువాదకర్త.
తాళ్లూరు. శంకరయ్య భాగవతార్
ఆకాశవాణి హరికథాకథకులు.

మోహన కల్యాణి - ఆదితాళం

పల్లవి. రామానను బ్రోవరా.. శ్రీ రఘురామానను బ్రోవరా.. రామా

అనుపల్లవి. కామాదినుత గుణధామా, కోమలమేను
శ్యామా, యాశ్రిత జనకామా, వేడెద రఘు.. రామా..

కం. మొల్లన్, నవకవితా సుమ
వల్లిన్, సాహిత్య కనకవల్లిన్, మృదువా
గ్వల్లిన్, కిసలయ సౌరభ
మల్లిన్, నాయుల్లమందుఁమానకనెంతున్.

కం. చల్లని పన్నీటిన్నబలె
ఝల్లను హిమదారలట్లు చెలువిడుభళిరా!
మొల్లనవ కవితజల్లులఁ
నెల్లరి హృదయములు పల్లవింపక యున్నే!

ఆ.వె. పంచదారఁగూర్చి - పాలు మీగడఁజేర్చి
జుంటె తేనె గల్పి - జున్ను నింపి
పనసతొనలిమిడ్చి - పరిపక్వమొనరించి
చెఱకు రసము జేర్చి - సిద్ధపరచి

ఆ.వె. నవ్యసుధలతోటి - నాజూకుగా మొల్ల
వ్రాసియిచ్చెమనకు - రాముఁచరిత
మద్ది, దానియందు - మంజర్లు, పాటలు
మధురమొప్ప వ్రాతుఁ - మరియు నేను

తే.గీ. కలిగెనా మదియందునా కాశవాణి
కడపకేంద్రాన హరికథగావచించి
నప్పటి యునుండి మొల్ల రామాయణంబు
పూర్తిగా హరికథస్జేయఁ బూనుకొంటి

కం. సంగీతము, సాహిత్యము
లంగములై బరుగు హరికథాసుధలహరిన్
పొంగించి భక్త వతతికిడు
దుంగరుణామూర్తి రాము తోరంపుకృపన్.

తే.గీ. ఎల్లరికిఁ సంఘమందు ప్రత్యేకముగను
హరికథకులకు ముఖ్యం బటుంచునెంచి
పూనుకొన్నాడఁ గూర్పగా నేను నిందు
మంజరులు, పాటలన్, మృదుమధురముగను.

ఆ.వె. సంఘమునకు మంచి సమకూర్చి, శ్రీనాథు
సేవ, మానవులకు సేవ జేసి
ధన్యులగుడు నెల్ల ధర్మమ్ము లెరిగించి
దాసులారా హరి - దాసులార!
మనసునందు జనించిన మమతతోడ
పట్టగా రాని యానంద పరతతోడ
వ్రాసినాడ నీ గ్రంథంబు వసున్నెకెక్కి
ప్రజలకిహపర సుఖముల బడయేజేసి
యవనినాచంద్రతారార్క మలరుణాతఁ!

# మొల్ల రామాయణము - బాలకాండము
# హరికథ

రామా, రామాయనుడీ శ్రీరామాయణ కథ వినుడీ ॥రామా॥
కామితార్థములగొనుడీ శీకాంతుని మదిఁమరువకుడీ శ్రీ రామా

రామ రామ శ్రీ రామారామా రామా శ్రీ రఘురామా
రామ రామ శ్రీ రామారామా రామా రవికుల సోమా.... రామ.

ఉ॥ శ్రీ మహిమాభిరాముడు, వశిష్ఠ మహాముని పూజితుండు, సు
త్రామవధూకళాభరణ రక్షకుడాశ్రిత పోషకుండు, దూ
ర్వామల సన్నిభాంగుడు, మహాగుణశాలి, దయాపరుండు, శ్రీ
రాముడు బ్రోచు భక్తతతి రంజిలునట్లుగ నెల్ల కాలమున్.

ఉ॥ శ్రీ నగమందిరుండమరసేవితుడర్ధ శశాంక మౌళి, స
న్మౌని మనఃపయోజదిననాయకుఁడబ్జభవామరేశ్వర
ధ్యానలసత్ప్రసన్ను, డతి ధన్యుడు, శేషవిభూషణుండు, వి
ద్యానిధి మల్లికార్జునుడు, తానిడుఁమాకు శుభంబులొప్పుగన్

ఉ॥ తెల్లనిపుండరీకముల తేజము మెచ్చని కన్నుదోయితో
నల్లని శక్రనీలరుచినవ్వెడు చక్కని దేహకాంతితో
నల్లన బిల్లగ్రోవికరమండలి సంజ్ఞల నింపుఁనింపగా
గొల్లతలన్ విరాళి దగఁగొల్చెడు కృష్ణుడుబ్రోచుగావుతన్

ఉ॥ మించి సమస్త లోకములు మిన్నకతాఁ దననేర్పు మీర, ని
ర్మించి, ప్రగల్భతన్నెరపి, మేలును, గీడును బ్రాణికోట్లు, సే
వించ, ఘటించుశాస్త్రములు, వేదములుంగొని యాడుచుండగా,
కాంచనగర్భుడిచ్చు నధికంబుగ నాయువు నీప్సితార్థముల్.

సీ॥ చంద్రఖండకలాపుఁజారువామనరూపు, కలితచంచలకర్ణుఁకమలవర్ణుఁ
మోదకోజ్వలబాహుఁమూషకోత్తమవాహుఁ భద్రేభవదనుఁసద్భక్తసదనుఁ
సమ్మునిస్తుత పాత్రుఁశైలరాడ్దౌహిత్రుఁ ననుదినామోదుఁవిద్యాప్రసాదుఁ
పరశువరాభ్యాసుఁబాశాంకుసోల్లాసుఁనురుతరఖ్యాత నాగోపవీతుఁ
తే.గీ. లోకవందిత గుణవంతునేకదంతుఁ నతుల హేరంబు సత్కారుణావలంబుఁస
విమల రవికోటితేజుల శ్రీవిఘ్నరాజుఁ ప్రథిత వాక్ప్రౌఢికై ఎపుడు
ప్రస్తుతింతుఁ

చ॥ కరిముఖుఁడుంగు మారుడుఁ వికారపుఁ జేతలఁముద్దుజూపుచు
న్గురువులు వారుచున్నరిగఁగుట్టలుదాటుచు, జన్నుదోయితో

శిరములు రాయుచుంగబరిఁజేర్చిన చంద్రుని బట్టి తీయఁగా
గరములఁ జాపఁనవ్వెడు జగమ్ముల తల్లి శుభంబు లీవుతన్

ఉ॥ సామజయుగ్మమింపలరఁ చల్లని నీరు పసిండి కుండలన్
వేమరు వంచివంచి, కడువేడుకతో నభిషిక్తఁజేయఁగా
దామరపువ్వు గద్దియముదంబున నుండెడి లోకమాత, మా
కా మునితల్లి సంపద నఖండముగా నిడు మాకు నెప్పుడున్

ఉ॥ మేలిమి మంచుకొండ నుపమింపగజాలిన యంచనెక్కి, వా
హ్యాళినటించి వచ్చు చతురాస్యునెదుర్కొని నవ్వుదేరగా
వాలికసోగకన్నుల నివాళి యొనర్చి ముదంబుఁగూర్చుని
ద్యాలయవాణి శబ్దములనర్థములున్సతతంబు మాకిడున్

సీ॥ సురసన్నుతజ్ఞానసువివేకి వాల్మీకి, నఖిలవేదాగమాభ్యాసుఁవ్యాసుఁ
ఘోరాంధకార ప్రభారవిఁభారవిఁ సత్కాంతి హిమకరశ్లాఘుమాఘుఁ
వివిధ కళాన్వీత విఖ్యాతిభవభూతిఁ ప్రకటకావ్యధురీణు, భట్టబాణుఁ
మానినీలోక సమ్మద ముద్రుఁ శివభద్రుఁ కవితారసోల్లాసుఁకాళిదాసుఁ

తే.గీ. స్తుత గుణోద్ధామునాచనసోముఁ భీముఁ నవ్యమంజుల వాగ్ధుర్యుఁ నన్నపార్యుఁ
రసికుడైనట్టి శ్రీనాథుఁరంగనాథుఁ దిక్కకవి రాజును నుతించి ధీనిమించి

కం॥ తొల్లిఁటి యిప్పటి సత్కవి, వల్లభులను రసిక వినుత వాగ్వైభవకళా
మల్లులకవితారచనల, బల్లిదులైనట్టి ఘనులఁభక్తిగదలతున్

కం॥ గురులింగజంగమార్చన, నరుఁడును శివభక్తిరతుడు, బాంధవ హితుడున్
గురుడాతుకూరికేసయ, వరపుత్రిని మొల్లయనగ వదలిన దానన్

సీ॥ దేశీయ పదములు, తెలుగులు, సాంస్కృతుల్, సంధులు ప్రాజ్ఞుల శబ్దవితతి
శయ్యలు, రీతులు, జాతుప్రబంధంబు లాయాసమాసంబులర్థములును
భావార్థములుఁగావ్య పరిపాకములు రసభావచమత్కృతుల్ పలుకుసరలి
బహు వర్ణములును విభక్తులు ధాతులలంకృతచ్ఛందో విలక్షణములు

తే.గీ. కావ్యసంపద క్రియలు నిఘంటువులును, క్రమములేవియునెఱఁగ విఖ్యాతగోప
వరపు శ్రీకంఠమల్లేశువరముచేత, నెరిగవ్వింంబుజెప్పఁగా నేర్చుకొంటి

కం॥ చెప్పుమని రామచంద్రుడు, చెప్పించిన పలుకు మీదఁజెప్పెదఁనేనె
ల్లప్పుడు నిహపరసాధన, మిప్పుణ్య చరిత్ర తప్పులెంచకుడు కవుల్.
వ. అని మరియును,

చ॥ వలిపెపు సన్నపయ్యెదను వాసిన గందపుఁ బూతతోడుతన్
కొలదిగ గానవచ్చు వలిగుబ్బచనుంగవ తీవినొప్పగా
తెలుగని చెప్పుచోటఁ కడుతేటలఁవాటలఁ క్రొత్త రీతులన్
బొలుపు వహింపకున్న మఱిపొందగునే పటహాది శబ్దముల్

కం॥ మునుసంస్కృతములఁతేటగఁ తెనిగించెడి చోట నేమి దెలియకయుండన్,
దనవిద్య మెఱయఁగ్రమ్మర, ఘనమగు సంస్కృతముఁజెప్పఁగా రుచియగునే?

ఆ.వె. తేనెసోఁక నోరు తీయనయగురీతి, తోడనర్థమెల్లదోచకుండ
గూఢశబ్దములను గూర్చిన కావ్యమ్ము, మూగ చెవిటి వారి ముచ్చటగును.

కం॥ కందున మాటలుఁ సామెతలందముగాఁ గూర్చి చెప్పునది తెలుగునకుం
పొందై, రుచియై, వీనుల, విందై మఱికానుపించు విబుధులపగిదిన్
వ. అని మఱియును

కం॥ ఆది రఘురాముచరితము, సాదరముగ విన్న, క్రొత్తయై, లక్షణ సం
పాదమ్మైపుణ్యస్థితి, వేదమ్మై తోచకున్న వెఱ్ఱినె చెప్పన్

ఉ॥ రాజిత కీర్తియైన రఘురాము చరిత్రము మున్గవీశ్వరుల్
తేజమెలర్పజెప్పిరని తెల్సియుఁ గ్రమ్మఱఁ జెప్పనేలనన్
బాజనకల్ప కంబగుచు, భక్తికిఁ ముక్తికిఁ మూలమైన యా
రాజును దైవమైన రఘురామునుతించినఁ దప్పుగల్గునే?

కం॥ వారాంగన శ్రీరాముని, పేరిడి రాచిలుకఁ బిలిచి పెంపువహించెన్
నేరుపుగల చందంబున, నారాముని వినుతి చేయనర్హముగాదే?

కం॥ నేరిచి పొగడిన వారిని, నేరకకొనియాడువారి నిజకృప మనుపం
కారణమగుటకు భక్తియె, కారణమగుగాని, చదువు కారణమగునే?

ఉ॥ సల్లలిత ప్రతాప గుణసాగరుఁడై విలసిల్లిధాత్రిపై
బల్లిదుడైన రామనరపాలకునిన్ స్తుతిజేయుజిహ్వకున్

చిల్లర రాజులోకమును జేకొని మెచ్చగనిచ్చ బుట్టునే?
అల్లముబెల్లమున్నినుచునప్పటికప్పటి కాసజేయునే?

వ. అని వితర్కించి, ముదంబున నిష్టదేవతా పార్థనంబును, బురా తన కవీంద్రస్తుతియునుంజేసి, నాచేయంబూనిన మొల్లరామాయణమునకు కథా విధానం బెట్టులనిన

సీ॥ సరయూనదీ తీరసతతసన్మంగళ, ప్రాభవోన్నత మహావైభవమ్ము
కనకగోపురహర్మ్యఘనకవాటోజ్వల, ప్రాకార గోపురశ్రీకరమ్ము
గజవాజి రథభటుగణికాత పత్ర చామరకేతుతోరణ మండితమ్ము
దరణీవధూటికా భరణ విభ్రమరేఖ దరిసించుమాణిక్య దర్పణమ్ము

తే.గీ. భానుకులదీపరాజన్యపట్టభద్ర, భాసినవరత్నఖచిత సింహాసనమ్ము
నాగనుతికెక్కు మహిమన నారతమ్ము, ధర్మనిలయమ్ము మహినయోధ్యాపురమ్ము

సీ. మదనాగయూధసమగ్ర దేశముగాని, కుటిలవర్తనశోషకులముగాదు
ఆహవోర్వీజయహరి నివాసముగాని, కీశసముత్కరాంచితముగాదు
సుందరస్యందన మందిరంబగుగాని, సంతతంబుజాళాశ్రయముగాదు
మోహనగణికాసమూహదేహముగాని, యూధికానికరసంయుతముగాదు

తే.గీ. సరసపుణ్య జననివాసమ్ముగాని, కఠిన నిర్దయ దైత్య సంఘమ్ముగాదు
కాదు కాదని కొనియాడగలిగినట్టి పురవరాగ్రము సాకేతపురవరమ్ము.

కం॥ ఇమ్ములనప్పు రివప్రము, కొమ్ములపై నుండి పురముకొమ్మలువేడ్కన్
దమ్ముల చుట్టము పదజల జమ్ములు బూజింతు దొగిన జస్రము ప్రీతిన్.

మంజరులు - మోహన

పరువై మురువున కల్పతరులు సురపురమున నింపై చెలగున్
పరువున మురుపై తురగమ్ములు చూపరులకీయోధ్యన్జెలగున్
అమరలోకమున చింతామణిదా -నమ్మున నెన్నిక కెక్కన్
గమననిదావమ్మున నయోధ్యలో - గజములు ఎన్నికకెక్కన్

అభేరి - ఆది

ప. కవిగురుబుధమిత్రాదుల్, సురపురి వివిధార్చనలను వెలయుదురెలమిన్। కవి

అ.ప. కవి గురుబుధ మిత్రాదులయోధ్యన్ - వివిధార్చనలను వెలయుదురెలమిన్

చ॥ అవికళభోగామ రాగ సంపద, నందునభోగులు భూసుతలీలన్
అవిరళ భోగానురాగ సంపద-లిందున భోగులు భూసుదలీలన్ - కవి.

సీ॥ ప్రకటానురాగ సంపన్నులౌదురుగాని, రమణీయరుక్మకారకులు గారు
శుభ పవిత్రోజ్వల సూత్రధారులుగాని, ఉక్కరి హాస్యనాటకులుగారు
తిలకించి చూడ సద్విజులౌదురేగాని, తలపంగపక్షి జాతములుగారు
ఉదయ సంధ్యాది విద్యుక్తకర్ములుగాని, చర్చింపగా నిశాచరులుగారు

తే.గీ॥ బాడబులుగాని యగ్ని రూపములుగారు, పండితులుగాని విజ్ఞుల పగిదిగారు
ధీవరులుగాని జాతి నిందితులు గారు పరమ పావనులాపురి ధరణిపతులు.

ఉ॥ రాజులుకాంతియందు, రతిరాజులు రూపమునందు, వాహినీ
రాజులు దానమందు, మృగరాజులు విక్రమకేళియందు, గో
రాజులు భోగమందు దినరాజులు సంతతతేజమందు, రా
రాజులు మానమందు నగరమ్మున రాజకుమారులందరున్.

సీ॥ తగదాన విఖ్యాతి ధరకుబేరులుగాని, సతతాంగకుష్ఠపీడితులు గారు
నిర్మల సత్యోక్తి ధర్మసూతులుగాని, చర్చింప నన్నృత భాషకులుగారు
ప్రకట విభూతి సౌభాగ్యరుద్రులుగాని, వసుధపై రోషమానసులుగారు
కమనీయగాంభీర్య ఘనసముద్రులుగాని, అతులితభంగ సంగతులుగారు

తే.గీ.వర్తకులుగాని పకులే వరుసగారు, భోగులేగాని పాములెప్పుడునుగారు
సరసులేగాని కొలకుల జాడగారు, వన్నెకెక్కిన యప్పుడి వైశ్యులెల్ల.

## మంజరులు - మోహన

పంటలు బండించుటలో రైతులు ప్రథమ స్థానమును గాంచి
పంటలపై పంటల బండించురు ప్రాముఖ్యమ్మును మించి.

కొదువలేక పండించి ధాన్యముల - గూరిచి ప్రజకందించి
ముదమొనరింతురు హాలికులున్నమ - భోగంబులద్యజియించి
అట్టికష్ట జీవులు భూప్రజలత్వల్ప సంతోషమతులు
జెట్టులు సామ్రాజ్య రక్షకులు, కులస్త్రీలు మహా పతివ్రతలు.

సీ॥ కలికి చూపుల చేడఁగరగింపనేర్తురు, బ్రహ్మచారులనైన బ్రాంతిగొల్పి.
మృదువచోరచనల వదలింపనేర్తురు, ఘనమునీంద్రులనైనఁ గచ్చడములు.
వలపులు పై జల్లినవలపింపనేర్తురు - సన్యాసులనునైనఁజలము పట్టి
సురతబంధంబుల జొక్కింపనేర్తురు, వ్రతములగైకొన్నయతులనైన.

తే,గీ. అచల మెక్కింపనేర్తురు ఔషధముల, మరులు కొల్పంగనేర్తురు మంత్రములను
ధనములంకింపనేర్తురు తక్కుజేసి, వాసికెక్కిన యప్పురి వారసతులు.

సీ॥ శారదగాయత్రి శాండిల్యగాలవ, కపిల కౌశిక కులఖ్యాతిగల్గి
మదన విష్వక్సేన మాధవ నారద, శుకవైజయంతి కార్జునులు గల్గి
చంద్రార్క గుహగిరిసంభవ జయవృష, కుంభబాణాదులు గొమరు మిగిలి
సుమన ఐరావత సురభి సక్రామృత పారిజాతముల సొంపారగల్గి

తే.గీ. బ్రహ్మనిలయమ్ము వైకుంఠపట్టణమ్ము, నాగకంకణు శైలమ్ము వాకపురము
లలిత గతిఁబోలి యే వేళదులనుదూగి, ఘన తనొప్పారనప్పురి వనములెల్ల.

చ॥ కనక విలాస కుంభములు గబ్బికుచంబులీలఁ చిత్రకే
తనములు పైట కొంగుల విధమ్మున గ్రాల, గవాక్షముల్ రహిన్
కనుగవయట్ల పొల్పె సగగా భువి భోగులు మెచ్చ భోగినీ
జనముల రీతి జెల్వమరు సౌధనికాయము పాయకప్పురిఁ

తే.గీ. మకరకచ్ఛప శంఖ పద్మములు గలిగి
ధనదునగరమ్ము పై కాలుద్రవ్వుచుండు
సరసమాధుర్య గాంభీర్య సరణి జేర్చి
గురుతుమీరినయప్పురి కొలకులెల్ల.

~~[illegible]~~

ధేనువొక్కటే యమృత ధారలందిచ్చు స్వర్గమ్మునందు
ధేనువులెన్నో యమృత ధారలందిచ్చు సాకేత మందు
సకల విభవములకుంబ్ర సిద్ధమై స్వర్గ లోకమునకెనయై
శ్రీకరమైవెలుగొందున యోధ్యయు చెలువంబునకున్ననియై.

వ॥ అట్టి మహాపట్టణంబున కధీశ్వరుండెట్టి వాఁడనగ.

సీ॥ తన కీర్తి కర్పూర తతిచేత వాసించె, పటుతరబ్రహ్మాండభాండమెల్లఁ

తన శౌర్యదీప్తిచే నినబింబమనయంబుఁ పగలెల్ల మాఁగుడువడఁగజేసెఁ
తనదానవిఖ్యాతి ననుదినంబును నర్థి దారిద్ర్యములవెళ్ల బారదరిమె
దన నీతి మహిమ చేజనలోకమంతయు దగిలి సంతతమును బొగడఁదనరె

తే.గీ. భళిరకొనియాడ పాత్రమైపరగినట్టి. వైరినృప జాల మేఘ సమీరిణుండు
నినకరాన్వయ పాదోధి వనజవైరి, నిశిత కాక్షేయక కరుండు దశరథుండు.

కాంభోజి - ఖండగతి

ప॥ పాలింపడవినీతి - పరులమన్ననజేసి, పాలించుసజ్జన ప్రతతిఁగౌరవముంచి

అ.ప॥ మేలెంచిమనుపడెన్నండేనిచోరులను - మేలెంచి మనుచునా - శ్రిత కోటి యోగ్యులను

మి. వెలిపింతెలుగడుయది. వీరుల పాడగన్నర్, వెలుచు న్ప్రొంకేయెడ.
వెడలెడునోయని మది. ॥పాలిం॥

చ॥ అరసిపోషించు విప్రాళినెల్లప్పుడుర్ అ. సరవిపోషింపడరిషడ్వర్గమెన్నడుర్॥అ॥
మీరిదరివచ్చు యర్థులగన్నదలకడు - మేరదప్పునొ ధర్మమెందునోయనిదలకు ॥మీ॥

మి. ధీరుండనఘుడు దాత్రీశుడు దశరథరే
డోరిమియహరహమున్-కోరి ప్రజాహితముర్ ॥పాలింప॥

సీ॥ కనగోరడొకనాడుకన్నులఁపరవధూ, లావణ్య సౌభాగ్య లక్షణములు
వినగోరడొకనాడు వీనులకింపుగాఁగొలుచువారల మీదికొండెములను
చిత్తంబువెడలించి జిహ్వాగ్రమునఁగోరిపలుకడు కాఠిన్య భాషణములు
తలపండించుకయ్యైన ధనకాంక్షనేవాడు బంధు మిత్రాశ్రితప్రతతి దెలుప

తే.గీ.సతత గాంభీర్య ధైర్యభూషణపరుండు, వాసికెక్కిన రాజన్యవర్తనుండు
సకల భూపాలజనసభా సన్నుతుండు, ధర్మతాత్పర్య భరితుండు దశరథుండు.

సీ॥ విరహాతిశయమున వృద్ధిఁ బొందగలేక, విషధరుండును కోఱవిషముఁబూనె
తాపంబుక్రొవ్వెంచి తరియింపనోపక, పలు మారుగడగండ్ల బడియెహరులు
కందర్పశరవృష్టి నందనోపకఘృష్టి, వనవాసమునగ్రుస్సి వనరు సూపె
దీపించివలపాపనోపక కూర్మంబు కుక్షిలోపలఁ తలఁ గ్రుక్కికొనియె

తే.గీ. కుంభినీకాంతతనుమీఁది కూర్మి విడిచి, ప్రకట రాజన్య మస్తకాభరణమకుటి
చారుమాణిక్యదీపిత చరణుడైన దశరథాధీశుభుజపీఠి డగిలినంత.

మంజరి - కన్నడ

ఆ రాజు రాజ్యమందలి వారెల్లరుఁ నిరత ధర్మరతులై
భూరి శ్రీ విభవంబుల దరిద్ర మెరుగరు సిరి సంయుతులై

వ. ఇట్టి మహౌదార్య సంపన్నుండును, మహైశ్వర్యధుర్యుండును నగు దశరథ మహారాజు సకల సామంత రాజలోక పూజ్య మానుండగుచుఁ బ్రాజ్యంబగు రాజ్యంబునేలుచు నొక్కనాడు.

మంజరులు - కన్నడ

పుత్రులు లేకనుపుణ్య లోకములఁ బొందజాలనని ఎంచి
మిత్రకులుఁడు దశరథుడు వశిష్ఠుని మించిన భక్తిన్గాంచి
మహనీయా! సంతానముగల్గెడి - మార్గమున్నదే నాకు
ఇహపరసుఖములజెందు నట్లానతిమ్ము నేడునే నీకు
కరముల మోడ్చి నమస్కరింతునన కనికరమునమౌని
సరిచింతింపకు పుత్రకామేష్టి - సల్పించెద భూజాని
అని ఋష్య శృంగమౌనిరావించి యతులిత సంతోషమున
జనసతి మునులుంబుత్రకామేష్టి సలుపునట్టి సమయమున

ఉ. రావణుచేతి బాధలు నిరంతరమున్నడి వేగిమూకలై
దేవతలెల్లగీష్పతికి డెల్లముగా నెరిగింప, వారిరా
జీవతనూజుడున్నెడకు శ్రీఘ్రమదోడ్కొని పోయిచెప్పనా
దేవుడు విష్ణు సన్నిధికి దిగ్గన జేకొని పోయి యచ్చటన్

వ. అప్పు రాణపురుషోత్తము గాంచి నమస్కరించి, ఇంద్రాది దేవతలంజూపి బ్రహ్మ ఇట్లనివిన్నవించె.

ఉ. రావణుడుగ్రుడై తన పరాక్రమశక్తిని వీరసంపదల్
వావిరి గొల్లలాడిత్రి దివంబును బాడుగ జేయనేడు. దే
వావళిదీనభావమున నక్కడ నుండగనోడి, భీతిచే
దేవరగానవచ్చెనిక దేవర చిత్తము వీరి భాగ్యముల్.

వ. అనివిన్నవించినవిని, వనరుహలోచనుండు దయామయ చిత్తుండై యనిమిష నాయకునింగూర్చి ఇట్లానతిచ్చె.

తే.గీ. వనజగర్భుని గూర్చిరావణుడుమున్ను
తపము జేసిన, వరమిచ్చుతఱిని, దనకు
నేరిచే చావులేకుండ గోరునాడు
నరుల, వానరులను జెప్పఁమఱచినాడు.

వ. అక్కారణంబునఁజేసి,

తే.గీ. వనరుగల్గెను మనకు రావణుని జంప
వినుడు నామాట మీరెల్లవేడ్క మీర
దశరథుండనురాజు సంతానకాంక్ష
నొనర జన్మంబుగావించుచున్నవాడు.

కం. ధరణీ పతియగు దశరథ
నరనాయకునింట బుట్టి, నరరూపమునన్
బెరిఁగెదనేనిక, మీరును
సురకంటకు మీద లావు జూపుటకొఱకై.

దర్బారు - ఆది

ప. పుట్టుడు కొందరు కపివంశంబున, పుట్టుడు భల్లుక కులమున గొందరు
అ.ప. పుట్టిపెరుగుడీ గురుబలయుతులై, బృందారకులారా భువి మీరలు।
పట్టి రావణుని కూల్తు పంక్తిరథు - పట్టినైపుట్టి ఎల్లరక్కసుల, మట్టుబెట్టి
ధరనిష్కంటకముగ మనుపుదు మీ వెతలన్నింటి దీర్చి

వ. అని కృపాధురీణుండైన నారాయణుండానతిచ్చిన విని వనజాసనాది దేవతానికరంబవ్వన జోదరుని పాదారవిందమ్ములకు వందనమ్ములాచరించి, నిజనివాసమ్ములకుంజని రయ్యవసరమ్మున,

సురటు - ఆది

ప. పుత్రకామేష్టి పరిపూర్ణంబై - పుట్టెనొక్క దివ్య పురుషుడగ్నిని ॥పు॥
అ.ప. పుత్తడిపాత్రన్పాయసాన్నమును బూని మేల్స్వర్ణమయదేహముతో ॥పు॥
అత్తరి గందర్వ వరులు బాడగ - అమరులు సుమవర్షంబును గురియగ

తత్తళాంగుతకతధిగిణతోమ్మని, తగనాడుచు నచ్చరలు మురియగా ॥పు॥

వ. ఇట్లా హోమాగ్నినండి నద్దివ్య పురుషుండు మంజువాక్యంబులఁ బ్రేమతో నాదశరథునకిట్లనియె.

కం. భూపాల నీదు భార్యల, కీపాయ సమారగింపనీమ్మా, తనయుల్
శ్రీపతి పుత్రసమానులు, రూపసులుదయింతురమితరూపస్ఫూర్తిన్

వ. అని తెల్పి, యాపాయసపాత్రంబుచేతికిచ్చిన

## మంజరులు – ఆనందభైరవి

పంచెదశరథుడు పాయసంబుఁతన భార్యలఁ బ్రేమన్పిల్చి,
మించి కౌసల్య, సుమిత్ర, కైకన్మించి యొక్కొకరినెంచి,
అంతనాపాయసాన్నమహిమన, య్యింతులు గర్భంబులను,
సంతసమున ధరియించి స్వాంతముల చింత విడిముదంబునను

వ. యొప్పారుచుండునంత

సీ. ధవళాక్షులను మాటతథ్యంబుగావింప, తెలుపెక్కి కన్నులు తేటలయ్యె
నీలకుంతలలనినెగడిన యామాట, నిలుపంగ నెఱులపై నలుపు జూపె
గురు కుచలను మాట సరవి భాషింపంగ, దోరమైకుచములనీరు బట్టె
మంజు భాషణులను మాటదప్పకయుండ, మెలతలపలుకులు మృదులమయ్యె

తే.గీ. కామినులటుంటనిక్కమై కాంతలందు, మీరమేలైనరుచులపై గోరికయ్యె
సవతి పోరనదమలోన సారెసారె, కోకిలింతలు వెట్టు చిట్టుములు బుట్టె

వ. మరియును

సీ. తనుమధ్యలనుమాటదప్పింపకాబోలుఁబోరలేకనడుములు పొదలజొచ్చె
కుచములు బంగారు కుండలోయనుమాట, కల్లగా నగ్రముల్ నల్లనయ్యె
చంద్రాస్యలనుమాట సందియమ్మగఁబోలు, గర్భ భారమ్ముల కాంతిదప్పె
పాటలాధరలన్న మాట దప్పింపంగ గాబోలు పెదవుల శోభదఱిగె

తే.గీ. అనుచుగనుగొన్నవారెల్ల నాడుచుండ, గట్టుచీరల బ్రేకంబుపుట్టుచుండు
నా సతుల జూచి యందరు నలరుచుండ, కాంతలకు నప్పుగర్భముల్గానుపించె.

వ. ఇట్లు దుర్భరంబైన గర్భంబులు ధరియించిన కౌసల్యాది కాంతా త్రయమును చైత్రమాసమ్మున శుక్లపక్షమ్మున నవమీ భాను వాసరమ్మునఁపునర్వసు నక్షత్రంబునఁ గర్కాటు లగ్నంబున, శ్రీరామ, భరత, లక్ష్మణ శత్రుఘ్ను లంగాంచినందదనంతరంబున దశరథుండు యధోచితకర్తవ్యంబులు జరిపి, యప్పుదిదినంబులు యరిష్టంబులేక ప్రతిదిన ప్రవర్ధమానమగుచున్న కుమార చతుష్టయంబునకు గాలోచితమ్ములగు చౌలోపనయనాది కృత్యములు గావించి, విద్యాప్రవీణులగునట్లులొనర్చి, గజాశ్వర ధారోహణంబులనేర్చి, ధనుర్వేద పారకులంగావించి, పెంచుచున్న సమయంబున

సీ. ఒకనాడు శుభగోష్ఠినుర్వీశ్వరుఁడుఁమంత్రి, హితపురోహితులను నెలమిఁజేరి
బంధువర్గము రాయబారులుఁజారులు, బరిచారకులు నెల్ల సరవిఁజేరి
గాయకులును, భృత్యగణములు మిత్రులు, సతులును సతులును
చక్కనలరి
సరసులు చతురులుఁ పరిహాసకులుఁ కళావంతులుఁ గడునొక్కవంకజేరి

తే.గీ. కొలువఁకొలువున్న యెడవచ్చి కుశికపుత్రుడర్థి దీవించి తావచ్చినట్టి కార్యమధిపునకుఁజెప్పఁ మదిలోన నాత్రపడుచు, వినయమోప్పారనిట్లని విన్నవించె,

వంజరులు - పూర్వీకల్యాణి

దనుజవర్గంబు తోడ(న్రాముడు, యనిఁ యొనర్పగాలేడు నా
మనవిని వినుమా! మునివరనేనే చనుదెంచెదనీ తోడు
అనవిని విశ్వామిత్రుడు చిఱునగవున నిట్లనె నోరాజా
అనను నీ చేతగాదనియసురులఁ హతమార్చను రవితేజా
ఘనభుజాబలులఁగర్వాటోపులఁ ఘనుడు రాముండుగాని
అనిఁబరిమార్పంగలవారలు నీయవనిలేరు భూజాని
అనుమానింపకు పంపుమా రామున భ్యుదయము సమకూరు
వినుసవనము నిర్విఘ్నముగా నెరవేరు నా కోర్కెదీరు.

వ. అని ప్రియోక్తులుపలుకుచున్న విశ్వామిత్రునకు మిత్రకులపవిత్రుండైన దశరథుండు మారాడనోడియప్పుడు

కం. మునినాథువెంటసుమిత్రా మునినలవడి వెట్టుచున్న మూర్ఖులపై, రా
మునిని, సౌమిత్రిని వెసనమ్మునితో నానందవార్థిమునగుచు జనియెన్

మ.కో.వారిదోడ్కొని కౌశికుండట వచ్చునయ్యెడ ఘోరకాం
తారమధ్యమునందు నొక్కతె దైత్యకామిని భీకరా
కారమొప్పగ నట్టహాస వికాసమేర్పడరాఁగనా
క్రూరరాక్షసిఁ జూచియమ్ముని కుంజరుండొగి రామునిన్

అఖేరి - ఆది

ప. వచ్చెను తాటకయదిగో రామా హెచ్చగునార్భాటాట్టహాసముల ॥వచ్చె॥
అ.ప. జెచ్చెరజంపుము స్త్రీయనితలపక-చేరువయయ్యెను తడవుజేయకుము ॥వచ్చె॥
మి. కచ్చియనూ్బని హెచ్చుగర్వమున, వచ్చి సవనమున్బాడుజేసి, తన
యిచ్చవచ్చినటు మునులనెల్ల కడుసేడ్పించుచుండు నను దినమును నదె ॥వచ్చె॥

వ.ఇట్లు జెప్పిన యాముని చంద్రుని పల్కులాలకించి, రామచంద్రుడు తనయంతరంగమ్మున నిట్లని వితర్కించె.

కం. ఈయాడుదానిజంపగ, నాయమ్మునకేమి గొప్పనగరేవీరుల్
ఛీయని రోయుచునమ్ముని, నాయకు భయమెత్తిగి తనమనమ్మున నలుకన్

కం. వ్రేటుగొని రామచంద్రుడు, సూటిగ, నొకదిట్టకోల సురలు నుతింపన్
ఘోటకసమవక్షస్థల, దాటక నత్యుగ్రలీలధరపై కూల్చెన్

వ. ఇట్లు దాటకం గీటడంచి-నయనంత నవమ్మునీంద్రుడు వేంటి సంతోషమ్మున రాముని గొని యాడుచు నక్రమంబుగ నిజాశ్రమంబున కేతెంచి, రామసౌమిత్రుల సాయమ్మున జన్నము స్జేయు సమయంబున

కం. ఆకాశవీధినెలకొని, రాకాసులు గురిసి రమిత రక్తము బలలం
బాకౌశికు యజ్ఞముపై, భీకరముగ మునిగణంబు భీతింబొందన్

మంజరులు - శ్రీరాగం

అంబరవీధిన్నిలిచి రక్తమాంసంబులు వడిఁగుఱిపించి

జంభవైరి శాత్రవులు కౌశికుని, జన్నముపాడొనరించి
కడువిజృంభింపగా రాముఁడు రక్కసుల పెక్కురంగూల్చి, త
మ్ముడు తానొకటై మునుల నెల్లర ప్రమోదవార్నిధిందేల్చి
ఎల్లరక్కసుల రామలక్ష్మణులు - ఏపడంపగామునులు
యుల్లంబులు పల్లవింప పూజలనొనరించి దశరథసుతుల

వ. కౌశికుఁడు జన్మంబు నిర్విఘ్నంబుగా పూర్తిగావించియున్న సమయంబున మిథిలాధీశుండగు జనకమహారాజు, భూసుతయగు సీతాదేవికి పరిణయంబొనర్ప స్వయంవరము చాటింపజేసిన, విశ్వామిత్రుడు రామలక్ష్మణులందోడ్కొని సంతసంబున

మంజరులు - కల్యాణి

పయనంబై చనునెడ శ్రీరాముని - పాదము సోకిన యంత
రయమున నొకశిల రమణియై భక్తి రాముపాదముల కంత
కరములనోమ్మిడ్చి శ్రీరామా! నీకరుణఁ నేధన్య నైతి
పరమపురుష నీమహిమ బొగడ బ్రహ్మాదులకైనన్ జగతి
తరమెయనుచు పదనైయొప్పిదమై కరగిన పుత్తడికరణిన్
బొరలుచు లావణ్యస్థితి గన్పట్టెడు పొలఁతిఁగాంచియచ్చెఱువున్
బొందుచున్న రఘురాము గాంచియమ్మునియనియెను శ్రీరామా
ఎందునెవ్వరికి కొదువుండునె నిన్నెఱిగిన తారకనామా
యని యక్కాంతామణి చరిత్రమంతయు రామునకున్జెప్పి
చనె మిథిలకు రఘురాముసౌమిత్రులను గొని సంతసమొప్పి

వ. యచ్చట

సీ. ద్రవిడకర్ణాటాంధ్ర, యవన, మహారాష్ట్ర, రాజకుమారులు తేజమలరఁ
పాండ్యఘూర్జర,లాట, బర్బర, మళయాళ, భూపనందనులు విస్ఫూర్తిమీఱఁ
గౌళ,కేరళ, సింధు, కాశ,కోసల సాళ్వ, ధరణీశపుత్రులు సిరివెలుంగఁ
మగధ,మత్స్యకళింగ, మాళవనేపాళ, నృపతనూభవులు నెన్నికకునెక్కఁ

తే.గీ. మఱియు,నుత్కలకొంకణ,మద్ర,పౌండ్ర,వత్స,గాంధార,సౌరాష్ట్ర,వంగభోజ,
రాజ్యములనొప్పుచున్న రాజసుతులు,వచ్చిరక్కామినీస్వయంవరమునకును

## కల్యాణి - ఆది

ప. వచ్చిరి కొందరు పల్లకీలమఱి - వచ్చిరి తేరులనందలంబులన్ వచ్చిరి.
అ.ప. వచ్చిరి మత్తగజేంద్రసంఘముల - వచ్చిరి తేజము మీరవాజులన్
మి. వచ్చిరి డోలికల్మఱికొందరు - హెచ్చిన కోరిక మీర యొంటెలన్
వచ్చిరి వందలు, వేలు, లక్షలును, వచ్చిరి కోట్ల జనంబులు మెచ్చుచు॥వ॥
వ. నట్టి సమయంబున

చ. గురుభుజశక్తిగల్గు పదికోట్ల జనంబులఁ బంప, వారు, నా
హరుని శరాసనంబుగొనియాడుచుఁబాడుచుఁగొంచువచ్చి, సు
స్థిరముగ వేది మధ్యమునఁజేర్చిన దానికి ధూపదీపముల్
విరులును గంధమక్షతలు వేడుక నిచ్చిరి చూడనొప్పుగన్ ॥వ॥

## మంజరులు - మోహన

అట్టి సమయమున జనక భూమీశుడనియె రాజకొమరులతో
జెట్టులున్న విల్లెక్కిడుడీ జగదేక సుందరీ మణితో
యుంకువగనిచ్చి పరిణయంబుజేయుదు ముందునకురండు
గొంకక మీసముగల మగధీరులు - జంకెదరేల వినుండు
లేరా మీలో మగవారలేమి? రాచకొమారులు గారా?
పౌరుంబులేదా? నా సుతతో - పరిణయంబుగాలేరా?

ఆ.వె. అనుచు బల్కుచున్నయవనీశతిలకుని, వాక్యములకు నుబ్బి వశమతీశ
సుతులు దాముదామె మదిలోనఁజెలగుచు, దగ్గరగబోయిధనువుజూచి

## కన్నడ - ఆది

ప. తల్లడమందిరి రాజకుమారులు, విల్లా?యిది పర్వతమా? యనిమది ॥త॥
అ.ప. బల్లిదులగు నృపనందనులెల్లరు, అల్లనల్లనన్దవ్వులన్నిచ్చి ॥త॥
మి. యుల్లంబుల ధైర్యంబు గోలువడి యురికిరి కొందరు మరి కొందరు వడి
చెల్లాచెదరై సందులగొందుల చేరిరి వింటితో పెనగి దూరముగ

సీ. గాలిదూలినరీతిగా నెత్తజాలక, తముదామె సిగ్గునఁదలలువంచి,
కౌగిలించిన లోనుగాక వెగ్గలమైన, భీతిచే మిక్కిలి బీరువోయి
కరములనందందక దలించి చూచిన కదలకయున్న చీకాకునొంది
పాషాణమున్నట్టి పగిదిమార్దవమేమిగానరాకుండిన గణవళించి,

తే.గీ. రాజసూనులు కొందరు తేజముడిగి, జగతి రాజుల మోసపుచ్చంగదలచి,
జనకుడీమాయగావించె జాలుననుచు, తలగిపోయిరి దవ్వగాంధనువు విడిచి

సీ. ఇదిపర్వతా కార్గమీ విల్లుకనువిచ్చి తేఱి చూడగరాదు దేవతలకు
నటుగాక మునుశేషకటుకుని ధనువంటి హరుడెగావలెగాక హరియుగాక
తక్కిన వారికి దరమెయీకోదండ మెత్తంగ దగుచేత యెట్లుగలుగు?
దీనిడగ్గఱనేల? దీనికోడగనేల? పరులచేనవ్వల బడగనేల?

తే.గీ. గురుతుజేసియుదమలావు కొలదిదావెం, తెలియవలెగాక యూరకతివురనేల? యొరుల సొమ్ములు దమకేల దొరకుననుచు, తలగిపోయిరి రాజనందనులు గనుచు

వ. అంత విశ్వామిత్రమునీంద్రుండు రామచంద్రుని ముఖావలోకనంబును జేసిన,

చ. కదలకుమీధరాతలమ, కాశ్వసి బట్టు, ఫణీంద్రభూవిషా
స్పదులను బట్టు, కూర్మమ, రసాతల భోగిధులీకులీశులన్
వదలక పట్టు, ఘృష్టి ధరణీపతి కచ్ఛప పోత్రి వర్గమున్
బొదవుచుఁబట్టు డీకరులు భూవరుడీశుని చాప మెక్కిడున్.

కం. ఉర్వీనందనకైరా, మోర్వీపతియెత్తు నిప్పడుగ్రుని చాపం
బుర్వింబట్టుడు దిగ్దంత్యుర్వీ ధరకిటి ఫణీంద్రులూఁ తగగకడిమిన్

వ. అనుచు లక్ష్మణుడు దెలుపుచున్న సమయమ్మున

మంజరులు - ఆఠాణా

ఇనవంశోద్భవుడైన రాఘవుడు - యెల్లనృపులు వెఱగొంది
తనువీక్షింపమునీశ్వరుండలర ధనువు తృటిని చేనంది
చివ్వన నెక్కిడి గుణము బట్టి యొక చిటికెలోన దునియంగ
నవ్వుచున్ వ్రేసె ఫెళఫెళార్భటుల నాధనువును విరుగంగ
భూరి ఘోషమున వార్నిధుల్ మ్రోయఁభూమీశులు సిగ్గువడఁ
నారీమణిజానకి విరిహారమునవ్వుచు రాముగళమున నిడఁ

వ. శ్రీరామచంద్రుని సత్త్వ సంపదకు మెచ్చి, సంతోషించి, జనక మహారాజు వివాహంబు జేయువాడై, రమ్మని దశరథేశ్వరుని పేరిట శుభలేఖలు

వ్రాయించి పంచిన దశరథ మహారాజును, నా శుభలేఖలంజదివించి, సంతోషంబున ఆనంద భాష్పమ్ములుగ్రమ్మ, దేవర మంత్రి ప్రవరుండగు సుమంత్రిని బిలిపించి, సుమంత్రీ! ఇపుడు మన మందరమును బయలుదేరి, మిథిలా పట్టణమునకుంబోయియట జనక మహారాజునింట మనరామలక్ష్మణుల భరతశత్రుఘ్నులకు వివాహమహోత్సవంబు జరుప వలయుగావున వశిష్ఠాదిద్విజవర్యులను, కౌసల్యాది వనితాజనంబులను, అరుంధతి మొదలుగా గల భూసురుల భార్యలను, మఱియు సకల బంధు జనంబును రావించి, బంగరుటందలంబుల నిడుకొని, తోడ్కొనిరమ్మని యంపిన, సుమంత్రుండును మహా ప్రసాదంబని తత్క్షణమునంతపురంబునకు బోయి, కౌసల్య, కైక, సుమిత్ర మొదలగు రాజకాంతలను, వశిష్ఠాది ద్విజవరిష్ఠులను, నరుంధతి మొదలుగా గల ముత్తైదువులను, మిగిలిన సకల జనమ్మును రావించి, యుక్త ప్రకారమ్ముగ కనకరథమ్ములపై నిడుకొని దశరథ మహారాజు కడకుంగొని వచ్చినయంత, దశరథుండు పుత్రద్వయసహితమ్ముగ రథమారోహించి, సమస్త సేవాసమన్వితుండగుచు, వాద్యఘోషంబులు దశదిశలు నిండ నడచుచున్న సమయమ్మున, నంతకు ముందే జనక భూపాలుండు దశరథ మహీపాలు నెదుర్కొని, తోడి తెచ్చియుడుకులు గడిగి, యర్ఘ్య పాణ్యాది విధులవిద్యుక్తంబుగంబూజించి, మానితంబుగ కానుకల నొసంగి సకల సంపత్సంపూర్ణంబైన నివేశముంగల్పించి, యందు పెండ్లి వారిని విడియించె. యంతనక్కడ, కనకనికరమైన పీఠమ్మున కూర్చున్న సమయమ్మున దేవా! శుభముహూర్తంబాసన్నంబగుచున్నది రమ్మని వశిష్ఠుండు సనుదేరనాతండునుసని, రామలక్ష్మణుల, భరత శత్రుఘ్నులకు మంగళస్నానంబులు జేయించి, నిర్మలాంబరాభరణమ్ములొసంగి, వేర్వేఱనొక్కముహూర్తమ్మున సీతాదేవి శ్రీరామచంద్రునకున్న తనకూతులగు మాండవ్యూర్మిళా శ్రుతకీర్తులను భరత, లక్ష్మణ శత్రుఘ్నులకునిచ్చి, వివాహముంజేసి, తన ప్రియతనయలకొక్కొక్కరైకు నూరేసి భద్రగజమ్ములను, వేయేసి తురంగంబులను, పదివేల దాసీ జనమ్ములను, లక్ష గోవులను నరణంబులిచ్చి దశరథాది రాజలోకమ్మునకు బహుమానమ్ముగా, నవరత్న, ఖచిత భూషణమ్ములను నొసంగి, సుగంధ ద్రవ్యములనర్పించి, పూజించి యంపె, నంత దశరథ మహారాజును మఱలియ యోధ్యా పట్టణంబునకు వచ్చుచుండగా మధ్యే మార్గంబున,

## మంజరులు - అఠాణా

పరశురాముడడ్డంబువచ్చి కో-పాటో పంబున రెచ్చి,
గరువేంబున నిట్లనియె రాముని - న్గాంచి దర్పంబు హెచ్చి,
ఏరా! రాముడవా? రాముడనే నిందుండగ మైమఱచి,
కారుసింగమున కూరిసింగమటు, కరకంతు విల్లు విఱిచి,
విల్లు వీగిచదియెంచెదవా ? నా విల్లెక్కు_వెట్టుమిపుడు,
కుఱ్ఱండవు నీకనుల దెఱపింతు క్రూరవిశిఖములనిపుడు,
రణ మొనరుప గలవా నాడో? నే-రామునొక్క_డుండగనె?,
గణుతింపగ మరియొక రాముడు నాకనుల ముందుండదగునె?.

వ. అనినిని రాముడిట్లనియె.

## ఖండగతి - శ్రీరాగం

ప॥ మనవినాలింపుమా - యనఘ విప్రోత్తమా! మన
చనునెమిమ్మెదురగా స్వామీదురమ్మున ॥మనవి॥

అ॥ అనఘుడవు పూజ్యుడవు నందునన్తాపసుడ
విన వంశజుండ, క్షత్రియుడద్విజభక్తుండ ॥మనవి॥

మి॥ అనకుమరమ్మనిన - న్ననికిన్ మ్మెక్కె_దగాను.
ఘనుడవు భూసురుడవుగాన మాకు పూజ్యుండవు

వ॥ అనిన విని పరశురాముడిట్లనియె.

ఉ॥ శస్త్రముఁదాల్చినందుగునె? సన్నుతికెక్కి_న బ్రాహ్మణుండనే
శాస్త్రముగాదు నాకెదిరి సంగర భూమిని నిల్చినంతనే
శాస్త్రము ఖంబులన్నృపులఁ జక్క_గ జేయుదు గాన నిప్పుడున్
శస్త్రము శాస్త్రముంగలవు సాహసవృత్తిని రమ్ము పోరగన్

వ॥ అనిన విని రాముండిట్లనియె.

## కన్నడ - ఆది

ప॥ వినుమా వంటి నృపాలురెవరైన; వీరత్వము జూపగా కయ్యమున ॥విను॥

అ.ప॥ నెనయౌగాక మహానుభావుడవు నిన్నాలంబున నెదురగాదగునె? ॥ని॥

చ॥ నెనయన్ధర్మమ్మ మాకు జూడఁమరి నీవే మన్ననుకోపింపరాను ॥నెన॥
అన్ఘూమంచిది గాదు మాకెపుడు - ఆహవమున నిన్నెదురుగా రాదు ॥విను॥

వ॥ అనిన విని యెంతయు సంతోషించి భార్గవరాముండా రఘురామునితో నిట్లనియె

ఆ.వె॥ శివుని చివుకు విల్లు శీఘ్రుంబెయానాడు, విరిచినాడ వనుచు విఱ్ఱవీగ
వలదునేడు నాకు వశమైన యీచాప మెక్కుబెట్టి తునియుమింతెచాలు.

ఉ॥ రాముడు గీముడంచును ధరాజనులెల్లనుతింప దిట్టవై
భీముని చాపమున్విఱిచి, ప్రే లెద వందులకేమిగాని, యీ
శ్రీ మహిళే శుకార్ముకముఁ జేకొని యెక్కిడుదేని, నేఁడు నీ
నీతోమరి పోరు సల్పి పడద్రోతు రణస్థలి నీ శరీరముఙ్

చ॥ అని తన చేతి విల్లు నృపులందరుఁ జూడగ నంది యీాయ నా
ధనువును కూడి తేజముఁ ప్రతాపము రామునిజెందె నంతనే
జన వరుడాశరాసనముఁజక్కగ నెక్కిడి వాడి బాణమం
దున నిడి యేది లక్ష్యమన త్రోవలు జూపిన ద్రుంచెగ్రక్కునన్

వ॥ ఇట్లు మహా ప్రతాపంబున చాపము ద్రుంచి, యనర్గళ ప్రతాపమ్మున
భార్గవ ద్గర్వంబు నిర్గర్వంబు గావించి, జయమ్ముగైకొన్న కుమారునిం
గౌగలించుకొని దశరథుండు కుమార చతుష్టయమ్ముతో యయోధ్యా
నగరమ్ము ప్రవేశించి సుఖోన్నతి రాజ్యంబు నేలుచున్న సమయంబున-

శా॥ పారావారగభీరికిఙ్ ద్యుతిలసత్పారారికిన్నిత్యవి
స్తారోదార విహారికిఙ్ సుజనరక్షా దక్ష దక్షారికిఙ్
సారాచారవి చారికిఙ్ మదరిపుక్ష్మాపాల సంహారికిఙ్
వీరా సాటి నృపాలకుల్, దశరథోర్వీనాథ జంభారికిఙ్

వ॥ అని కొనియాడదగిన నృపాలశేఖరుడు ధర్మ మార్గంబునొక్కండ యేని
దప్పకుండ రాజ్యంబుజేయుచుండె, ననుటు విని నారదుని వాల్మీక మహా
మునీశ్వరుండటు మీద కథా విధానం బెట్టిదియనియడుగుటయు.

క॥ జలజాక్ష భక్తవత్సల, జలజాసన వినుత పాద జలజాతసుధా
జలరాశి భవ్యమందిర. జలజాకరచారుహంస జానకి నాథా

గద్యము. ఇది శ్రీ గౌరీశ్వర వర ప్రసాద లబ్ధ గురుజంగమార్చన వినోద సూరిజన వినుత కవితా చమత్కాతుకూరికే సనశెట్టి తనయ మొల్ల నామధేయ విరచితంబైన శ్రీరామాయణ మహాకావ్యమునందు బాలకాండమున, హరికథాకేసరి, హరికథాసుధానిధి, సత్కథాధుర్య, గాన కళా ప్రపూర్ణ, ఇత్యాది బిరుదాంకితులు గజారోహణాది సమ్మానితులు, శ్రీ తాళ్ళూరు నరసయ్య, వెంకటాంబా ప్రథమ పుత్రులు ఆకాశవాణి హరికథా కథకులు, శంకరయ్య భాగవతార్చే, పాటలున్మంజరుల కూర్పుతోనేకాశ్వాసము.

సురటి - ఆది

ప॥ శ్రీరామా జయ సీతారామా శ్రీ రఘురామా మంగళం ॥శ్రీ॥

అ.ప॥ కామిక ఫలదాయక శుభదాయక - భూమిజ ప్రియ భూరితేజశ్రీ ॥రఘు॥

చ॥ నీ మంబున నీనా మభజనమ్ము, నేర్పు తోడ బేయువారికెల్లరి
సేమ మరసి కైవల్య మొసగు శ్రీ - రామ జయరామ రాక్షసభీమా ॥శ్రీ॥
మంగళం కోసలేంద్రాయ - మహనీయగుణాత్మనే,
చక్రవర్తి తనూజాయ, సార్వభౌమాయ మంగళం.

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం. న్యాయేన మార్గేణ మహీం మహీశా
గో బ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం. లోకా సమస్తా సుఖినో భవంతు.

కాలే వర్షతుపర్జన్యః పృథివీ సస్యశాలినీ,
దేశో యంక్షోభ రహితో, బ్రాహ్మణాస్సంతునిర్భయాః.

అపుత్రాపుత్రిణస్సంతు
పుత్రిణస్సంతు పౌత్రిణః
అధనాస్సధనాస్సంతు
దేవాంతు శరదాంశతం.

శుభమస్తు.

ఓం సర్వే జనా సుఖినో భవంతు, సమస్త సన్మంగళాని భవతు.

ఓం తత్సత్.

# మొల్ల రామాయణము-(హరికథ) అయోధ్యాకాండము

కం॥ కందర్ప రూప! ఖండిత, కందర్ప విరోధి చాపకరుణా ద్వీపా
వందిత శుభనామా! ముని సందోహస్తుత్య భూమ, జానకిరామా!

వ॥ శ్రీ నారద మునీశ్వరుండు వాల్మీకి మహామునికెఱిగించిన తెఱంగున్వినిపించెద నాకర్ణింపుము.

సీ. తనసుమంత్రాది ప్రధానులతో గూడి, సుఖ గోష్ఠినుండగ నఖిలజనుల
చక్క గారావించి, సమ్మోదంబున వంశ గురువుతో దశరథ దరణినాథు
డని యెనీ భూభారమంతయు నొక్కడ నేలితి జాలదె యేక హేళి
నటుగాక పగతురనవ లీల గెల్చితి, నిల్పితి ధర్మంబు నిష్ఠతోడ

తే.గీ. నింత జాలదెయాశకు నెంతకెంత, రామచంద్రుని ధరణికి రాజుగాగ.
మీరుసూడంగపట్టంబు భూరిమహిమ, గట్టవలయును మంచి లగ్నమున జెలగి.

తే.గీ. అనుచుగురునకు దెలపి తానతని సమ్మతమున సౌభాగ్య మంగళ ద్రవ్యసమితి
గూర్చుడనుచును మంత్రులకును నెఱుంగజెప్పి శృంగార మీపురి జేయుడని యె.
వ. అట్టి సమయంబున.

తే.గీ.పగలు ప్రాగ్భాగమున నుండి గగన వీధి, జరమదిక్కునకేగగా శ్రమముదోచి,
చెమటబట్టిన స్నానంబు చేయనరుగు కరణినపరాబ్ధిలో దినకరుడు గ్రుంకె.

కల్యాణి - ఆది

ప. మేలిమిసంధ్యారాగము, వ్రాలిన, చీకటియుగలసి వరుణుని వంకన్ ..మే..

అ.ప. నీలముకెంపును నతికిన, పోలికఁజూపట్టెనటున భోమణి తలఁగన్ ..మే..

త్రి.శ్ర.వారకకల్పద్రుమమున, గోరకములు బుట్టినట్లు, గురుతర కాంతిన్
దారకములుదలసూపెన్చోరానీకమ్ము మిగుల స్రుక్కుచునుండన్ ..మే..

చతురశ్ర. కాఱుమొగులరీతి - గాటుకచందాన, నీటి భాతిన్నింద్ర నీలంబుల కరిణిన్
మాషరాశి పోల్కి మరి మరియపు దంధ, కారమనని యెల్లగలయంగ
బర్వె..కాఱు.. ॥మే॥

వ. అట్టిసమయంబున.

మి.చ.తలవరులన్ని జాధిపులదర్పకు నేర్పునకన్ను బ్రామి, య
త్తల దమపిన్న పాపలనుదారత నేర్పడ నిద్రబుచ్చి, ని
ర్మల కరకంకణావళులు రట్టుగదామటు మ్రోగనీక, వి
చ్చల విడిగా జరించి రొగి జారల తాంగెలు మధ్య రాత్రులన్ ..మే..

చ. సురతము లేకనుస్సురను బోటి, మగందుడికించు కాంతయున్
సరస మెఱుంగు చంద్రముఖి సావడి దంతయు, బేర కత్తెయున్
పరపురుషాభిలాషమును బాయని భామిని, పోరుకట్టునన్
బరcగిన భామలాది యుపభర్తల గూడి చరించిరత్తఱిన్.

ఉ. భానుసహస్ర సత్కిరణ పంక్తులనుద్భువమైన యాబృహ
ద్భానుని పెట్టి బెల్లు డకcబడ్డ సుధాంబుధి మీది మీగడల్
పూని సమీరుచే దెరలc పూర్వ దిశన్ గనుపట్టదానిపై
పేనమనంగ నొప్పె శశిబింబముతూరుపు కొండపై డగన్.

చ. కుముదములుంజకోరములు గోమలసస్యము చంద్రకాంతముల్
రమణcబెలంగc వెన్నెల తిరంబుగ, జేసి జగంబులుబ్బగా
కమలములన్ వియోగులధికంబుగ చోరులు, చక్రవాకముల్
రమణ బెలంగ వెన్నెల తిరంబుగcగాచె జగంబులుబ్బగన్.

యమునా కల్యాణి - ఆది

ప. నారదులై చెలగిరి మునివర్యులు-నాక మహీజములయ్యె భూజములు ॥నార॥

అ.ప. వారిజ వర్గము తెల్లసితవర్ణ-మయ్యె నాపండు వెన్నెలయందున్ ॥నారా॥

చరణం. శారదలాయిరి భామినీ మణులు - శంకరశైలములయ్యె గోత్రములు.. నా..
పారదమయ్యెన్నీరధులెల్లను, పన్నగ నాయకులయ్యె నాగములు ॥ నార॥

మంజరులు - కల్యాణి - ఆది

ప. కోరి కోరిచ కోర దంపతులు - గుంపులు గుంపులు కూడిదంతులన్ ॥కోరి॥

అ.ప. పేరినచంద్రికారసమునుస్వమిని -పేర్కొనిమార్కొనిపొట్టనిండుగా॥కోరి॥

చరణం. పారణమ్మొనొనరించివెన్నయల - బ్రాకుచు చంచుపుటంబులెత్తుచున్ ॥పార॥
బేరము వారుచునుండె మదినెంతో - ప్రేమ జనింప వధూటి కోటికిన్॥కోరి॥

మి. వెన్నెల దీగలన్ గొనలు వేడుక ముక్కల ద్రుంచి తెచ్చి. దా
రొక్కన్న ప్రియాంగ నాతతికిఁ గూరిమి నోరికినిచ్చి కేళికిన్
సన్నపు కంఠనాళముల సన్నలు జేసి సుఖించె నింపుగన్
తిన్నని చంద్రకాంతమరు తిన్నెల మీఁద, చకోరదయతుల్ ॥కోరి॥

తే.గీ. పాకశాసని సేవంతిబంతి దివికి, నెగురనైచినకైవడి నేమి సెప్పఁ
బాండువర్ణంబుతో పూర్వ భాగమందు, సొంపుమీఱంగవేగురుచుక్కవొడమె.

వ. అట్టి సమయంబున,

కన్నడ - ఆది

ప. రవియుదయింయించెను జనుడీ, పవలేటికి దినియలు తారకములు ॥రవి॥

అ.ప. కువలయమున శశియున్ తిమిరంబును,
జవమున జనునటుకోళ్ళున్మ్గా సెన్ ॥రవి॥

మి. వదలకపద్మరాగమణి వర్తునగ్రాలగ బట్టి నేర్పు పెం
పొదవగ తూర్పు కొండపయికొప్పుగఁ దెచ్చి జగద్గురుండు దాఁ
త్రి దశవరేణ్యుకట్టెదుర దే - కు నిల్పిన దర్పణంబునా
నుదయమునొందె భానుఁడు సముజ్వల కోక నద ప్రదీప్తులన్.

వ. ఆ రాత్రి రాజచంద్రశేఖరు చిత్తంబువచ్చునట్లుగా మెలంగి యాతండు తన్నుమెచ్చు టెరింగి, కైకయిట్లనియె.

ఆ.వె. వసుమతీ శనాకువరమిచ్చితప్పుటు, తగవుగాదు మీకుఁ దలపులోన
మఱచినారదేమొ? మన్నించిడొల్లింటి, యీవులీయవలయు నీక్షణంబు.

కం. జననాధ నా కుమారుని, వినుఁడీపట్టంబుగట్టి మేమేగమరా
మునిమునిగా ననుపుడు మఱి, వనమున బదునాలుగేండ్లువర్తింపంగన్.

వ. అని ప్రార్థించిన విని పార్థివేంద్రుండు డిల్లవడి తల్లడిల్లుచు, నుల్లంబుగలంగి ముసుంగిడియచ్చేడియ పలికిన పలుకులకు మారాడనోడిమిన్నన్ యపలికిన పలుకులకు మాఱాడకనోడి మిన్నకయున్న సమయంబున, సుమంత్రుండేతెంచి స్వామీ!

రామచంద్రునికి పట్టింబుగట్టుసుముహూర్తంబాసన్నంబయ్యెఁ గావున మిమ్ము నచ్చటికి విచ్చేయ నవధరింపుడని వశిష్ఠ భగవానుండు విన్నవించుమని పంపెనని చెప్పిన విని కైకయిట్లనియె.

మ. అనిలో మున్ను నృపాలు చిత్తమునకేనాహ్లాదమున్గూర్చి, నా
తనయున్ పట్టము గట్టి, రాఘవుని పద్నాల్గేండ్లు కాంతారమం
దునవర్తిల్లఁగ బంపగొన్న వరమున్ద్రోయంగఁ రాదెంతయు
న్వనసీమన్ మునివృత్తి నండు మనుడీ పైళంబయారామునిన్.

మంజరులు - కన్నడ

అని పల్కుకైక మాటలు వినినాయవనీశుడు దుఃఖముతో
మనమున నుండుటగనిచని వినిపించెను సుమంత్రి గురువునతో.

వ. విని వశిష్ఠాది ప్రముఖులును, సుమంత్రాది ప్రధాన జనంబులును, సైన్యంబులును పరివారంబులు విన్నయ్యైయున్న నాసన్న ఎఱింగి, రామచంద్రుండు రాజ చిహ్నాంబులు త్యజించి, జటా విభూతి వల్కాలంబులు దాల్చి, ధనుర్ధరుండై యున్నంత, లక్ష్మణుండు, భూపుత్రియును, దోడం జనుదేర (దల్లులకు నమస్కరించి, వశిష్ఠానుమతంబున, నాశీర్వచనంబులుగైకొని, యా స్థానంబు వెలువడి, యరణ్యంబునకరుగుచునప్పుడు, పురజనులందరును, బురపురం బొక్కుచు దశరథ మహారాజును దూషించుచు కైకను నిందించుచు, మూకలై శోకించుచుండనదియంతయువిని దశరథుండు పురోహితామాత్య బంధుజనంబులతో.

శ్రీ రామ చంద్రుండేగిన త్రోవంబుజన్నంత రాముండు దూరమ్మునం జనియె దశరదుండును మరలివచ్చి పుత్రశోకంబున నాకపురంబునకుం జనియెఁ తదనంతరంబచ,

ఆ.వె చనుచు రాఘవుండు స్వర్నదియొద్దన, గుహుని గాంచియతని గుర్తరించి,
తడయకోడ, బెట్టి దాటింపు డనవుడు, నట్లు చేయఁదలచి యాత్మలోన.

మంజరులు - వాం.తోడి

రామ పాదమ్ము సోకినంతనొకరాయియే రమణి యయ్యెన్
ఈ మహాత్ము పాదమ్ములు సోకిన నేమగునో నాపడవన్

గల రేణువులెల్లఁ కాంతలైనన్ గలనే నేను భరింప ?c
గలనే? ఏమగునోయని పదముల గడిగె శంక దొలగింప
పడవనెక్కించి రాములక్ష్మలc పడతివైదెహితోడc
గడపెఁగుహుడు రామ భజన జేయుచుc గంగానది నాయోడc.

వ॥ ఇట్లు శ్రీరామచంద్రుని శ్రీ పాదంబుల నీట గడిగి యోడపైనెక్కించి, యమ్మువ్వుర నవ్వలికి దాటించిన నాక్షణంబ,

ఉ॥ రాజకులావతంసుడగు రాముడు, తమ్ముడు, దానునా భర
ద్వాజ మహామునీంద్రుపదవారిజముల్ గని మ్రొక్క నాతఁడం
భోజహితాన్వయాబ్ధి పరిపూర్ణ సుధాకరుడైన రామునిం
బూజలొనర్చి కందఫలమూలములన్బరితృప్తు జేసినన్

వ॥ సంతసించుచు, నారాత్రి యచ్చటనివశించి, మరుసటి దినసూర్యోదయమ్మున,

ఆ.వె. ముదముతోడఁదమ్ముమునిభరద్వాజుండు, భక్తినను, పరామభద్రుఁడపుడు
చని యెభ్రాత్రుదార సహితుఁడై సమ్ముని కూటమునకుఁచిత్రకూటమునకు.

మ॥ ఘనుడా రాముడు చిత్రకూటమును పేడ్కంజేరి యున్నంతలో
నన దంతావళ వాజీరత్నరథ నానా యోధ సంఘంబుతో
దనమాత్యద్విజబంధువర్గములతోడన్ గూడి వాద్యంబులన్
చనుదెంచెన్భరతుండు రాముకడకున్ సద్భక్తి ఏ పారగన్

సీ॥ చనుదెంచి రాముని చరణంబులకు మ్రొక్కి, కైకేయి జేసిన కపటమునకు
నగరంబు విడిచియీపగిది ఘోరారణ్యమున కిట్టు రానేలమునులపగిదిc
నదిగాక మన తండ్రి యత్యంతమైనట్టి పుత్ర శోకంబునc బొక్కి పొక్కి
త్రిదశాలయమ్మునఁదేవేంద్రుc గనబోయెనని చెప్ప విని రాముఁడంతలోన

తే.గీ॥ భరతలక్ష్మణ శత్రుఘ్న ధరణి సుతలc గూడి దుఃఖించి దుఃఖించి కొంతపడికి
నాప్తవర్గంబుచే మానెనంతమీద, భరతుడిట్లనెc శ్రీరామ భద్రుతోడ.

తే.గీ॥ రాజులేకున్నచో మహిరాష్ట్రమందు, కార్యమెట్లౌను మీరెఱుగనిదిగలదె?
నేటిసమయాన బట్టంబునిలుపుకొనఁతిరిగివచ్చేయుడనుడు నా భరతుడోడ.

## మంజరులు - తోడి

జనకుండొసగిన యాజ్ఞ ప్రకారము - వనమున పదునాల్గేండ్లు
వినుమాతమ్ముడ యుండి వచ్చెదనుచనుమ మాని కడగండ్లు
నా మాటను వ్యతిరేకించవు నేనటకువచ్చునందనుక
భూమీ వలయము పరిపాలింపుము పోయిరమ్ము కాదనక

వ॥ అనిన విచారమానసుండై దుఃఖించుచు, రాముని రాకకై ప్రార్థించు భరతుని ప్రేమమీఱ లాలించుచూ.

## కల్యాణి - ఆది

ప॥ బజ్జగించె భరతుని శ్రీరాముడు - పోయి రాజ్యమ్ము నేలుకొమ్మనుచు ॥బు॥

అ.ప॥ ఇజ్జగమున నాదర్శప్రాయముగ, నెల్లరున్మ నలజూచి నడతురని

చ॥ సజ్జనాగ్రణివి తమ్ముడా నీవు - చాలు విచారింపకునీకండగ
ఒజ్జలున్మంత్రులెల్ల ప్రజలు నీ - పజ్జ చేరినిన్ననుసరింతురని ॥బు॥

వ॥ ఇట్లు భరతుని భరతాగ్రజుండనునయించి, నాకలోకవాటుంబగు చిత్రకూటుంబు కదలి, సౌమిత్రిఁ భూపుత్రినింగూడిపోవు నెడనటవీ మధ్యంబున, విరాధుండను దైత్యాధముండపచారమ్ముజేసి, దిగ్గన డగ్గఱి జగతీతనూజంగొని, గగన మార్గంబున కెగిరి పోవునెడ వాడిబాణంబున వానికంఠంబునుద్రుంచి, మఱల గరుడాస్త్రబుననొయ్యన జనకజనడించి భయంచు వాపి ప్రియంబు జూపి, యెయ్యనొయ్యన నయ్యెడనున్నయత్రి మహాముని యాశ్రమంబునకుంజన, ఘనంబుగ నాఘనుండు జేయు పూజలు గైకొని, రామచంద్రుడచ్చటి మునీంద్రులకు దైత్యులవలని భయము లేకుండనభయమిడి, మన్ననంగొన్ని దినంబులాయామునుల యాశ్రమంబుల నిలుచుచు వారలనుప శరభాది మృగోత్కర శరణ్యంబగు నరణ్యంబుఁ జొచ్చి పోయెనని చెప్పిన నారదమునిని వాల్మీకి మునీంద్రుడు మీది కథావిధానంబెట్టిదియని యడుగుటయు,

కం॥ జలజాక్ష! భక్తవత్సల! జలజాసన వినుతపాద! జలజాతసుధా
జలరాశి భవ్యమందిర! జలజాకరచారుహంస! జానకి నాథా.

గద్యము. ఇది శ్రీ గౌరీశ్వర వరప్రసాద లబ్ధ గురుజంగమార్చన వినోద సూరిజన వినుతకవి చమత్కారాతుకూరికేసన శెట్టి తనయ మొల్ల నామధేయ విరచితంబైన శ్రీరామాయణ మహాకావ్యమునందయోధ్యాకాండమున, హరికథా కేసరి, హరికథా సుధానిధి, సత్కథాధుర్య, గానకళా ప్రపూర్ణ, ఇత్యాది బిరుదాంకితులు, రామాయణ, మహాభారత, భాగవతాది హరికథాకథకులు, ఆకాశవాణి గాయకులు, 'గజారోహణాది' సమ్మానితులు, శ్రీ తాళ్లూరు నరసయ్య వెంకటాంబ ప్రథమ పుత్రులు శంకరయ్య భాగవతార్‌చే మంజరులు, పాటల కూర్పుతో సర్వమునేకాశ్వాసము.

మంగళము - సురటి ఆది

ప॥ రవికుల తిలకా, రఘు రామా... భవ భయ హరతారకనామా ॥రవి॥

అ.ప॥ భువిఁధర్మము నిలుపుటకై పుట్టిన, పురుషోత్మము, పావననామా ॥రవి॥
నవమేఘశ్యామా జనకామా, నారదాది సన్నుత గుణధామా ॥భు॥
శ్రీవిలసిత పద సీతారామా - శ్రీరామా మంగళ మరిభీమా. మంగళం శుభ మంగళం జయ మంగళం శుభ మంగళం ॥రవి॥

*- ఓం సర్వేజనా స్సుఖినోభవంతు ఓం తత్సత్*

కం॥ మునిదత్త ధనుర్వేదా! మునినాథ ప్రియసతీ సుపూజిత పాదా!
జనకార్చిత గుణధామా! జనకాది స్తవ్యనామ! జానకిరామా!

వ॥ శ్రీ నారదమునీశ్వరుండు వాల్మీకి మహామునికెఱిగించిన తెలుంగువినిపించెద

## మంజరులు

ఎందుకు వచ్చెనో పాదచారితన - మితడు పట్టభద్రుండు
ఇందువదన సుకుమారసుందరీ యింతికి దుర్దశమెందు
ఏలజేసెరతిరా జసమానులకిట్లు బ్రహ్మదేవుండు
అనుచు నాటవికులా మువ్వుర గనియంత రంగములదలచి
కనుదురమ్మహాత్ముల దైవంబుల కరణిజూచుచున్నిలిచి.

సీ॥ నడువనేరని కొమ్మయడుగులుపొక్కులై, శర్కరస్థలములఁ శ్రమముఁజెందెఁ
వీచిన చేతులువ్రేళ్ల నెత్తురుగ్రమ్మ, పొటమర్లుకెంపుల పోల్కినమరె
వడిగాలి సుడివడి వాడిన లేఁదీగ కైవడిమ్మృదు మేని చేవదరిగెఁ
పూర్ణ చంద్రునికాంతి పున్నమి వేకువఁగనుపట్టుగతి మోము కళలఁ విడిచెఁ

తే.గీ॥ ధవుని యడుగడ్డునకును కైదండగొనుచు, నెగడు దప్పిని నిట్టూర్పు లెగసి
చిగురు బెదవులెండగ నీడకు నుదలగొనుచు, వనమున్ భర్త వెంబడి జనెడివేళ

వ॥ ఇట్లా సీతయు, రాముండును, సత్యఋషిబోని సౌమిత్రియు, కతి ప్రయాణంబున పంచవటికింజని సంతోషభరితాంతరంగులై.

కం॥ అచ్చటి కొన్ని దినంబులు ముచ్చటపడి యుండదలచి మునిముఖ్యుల చే, మచ్చికతమ్ముడుఁదానును, గ్రచ్చఱనొక పర్ణశాలగావించితగఁ

ఆ.వె॥ అందురామచంద్రుడను జన్ముడును కొన్ని వాసరంబులున్న వేళ
వికృత వేషధారివేవేగనట చుప్పనాకయనెడి దైత్యనారియొర్తు

వ॥ రామునింగని కాపి - చతురస్ర

ప॥ వలచితినినునేనాసామీ, నను, గలియగనొకపరి రావేమీభళి ॥వల॥

అ.ప॥ అలచెంవలరాజు-కలచి నా మనము, పలుకరార సుధలూలుక నాసామి ॥వ॥

చ॥ ఒకపరి గనరా, వలదనకుమురా, సకినెరజాణర సామీ రారార ॥వల॥

వ॥ ప్రేమాభిమానంబగు మనంబునందనుగామించి రమ్మనిన, రామచంద్రుడు సౌమిత్రిని జూప నతండు మున్నునాయన్ననభిలషించుటన్గేసి, నాకు దోషంబుగాన నీవారాముని కడకు మఱలజనుమన్న నదియట్లు జేసిన రామచంద్రుడును దిరుగ లక్ష్మణునిఁ జూపిన గోపించి, యారాక్షసి మనుజేంద్రు సూనుల బండింప దలంచిన నెఱింగి భరతానుజుండు, దాని నాసికా కర్ణంబులు గోసివైచిన నది నెత్తురు జొత్తిల్ల పసిపాపయుంబోలె నేడ్చుచు, ఖరదూషణాది సోదరులకుఁ జెప్పిన వారు కనలి రాక్షణంబు.

కం॥ పదునాల్గువేల దైత్యులు, మదమున సోదరులు గొల్వ మండుచు శూరా
స్పదమగురథ నికరముతో, కదన మునకు రాముకడకు ఖరుడే తెంచెౕ

ఆ.వె॥ ఖరుడు వచ్చినట్టి కలకలంబాలించి, రాఘవుండు తనదు రమణి యొద్ద దొలఁగకుండననుజుఁదోడుగా కాపుంచి, చెదరకంతఁగలనికెదిరినిలిచె.

శా॥ ఆ వేళన్ఖరుడుగ్ర వృత్తి లయకాలాభీల ఘోరాకృతుల్
దైవారన్గజ వాజి సంఘములతో, దైత్యాళితో భూరి, రో
షావిర్భూత మనస్కుడై నడిచెగర్వారంభ సంరంభుడై
దేవ వ్రాతము భీతిబొంది కలఁగ తేజంబు సొంపారగ

వ॥ ఇట్లు ఖరుండు జనుదెంచి, భయంకరంబుగారణంబు జేయు సమయంబున,

మంజరులు - మోహన

రామచంద్రుడుర్ భయంకర రౌద్ర రసంబుకన్నులగప్పర్
భీమముగ నగ్నివర్షము కురియఁగ విచిత్ర శస్త్రములు గుప్పర్
నిర్జరులార్వగ రక్కసులందరి నేకవీరుడై పోరి
జర్జరీ భూత మొనరించెను కుంజర వాజులను రథాళి

రక్త వాహినిస్ద్రేల్చె రక్కసుల దిక్తటంబులదరంగ, భుజ
శక్తి మీర ఖరుఁ శిరము గూలదాశరథి హర్షముజెలంగ
ద్రుంచిన దూషణుడరుదెంచినతోడ్తోడనెవాని శిరంబుల్
ద్రుంచె త్రిశిరుండురాగ రౌద్రుడై - ద్రుంచెవాని త్రిశిరంబుల్

వ॥ ఇట్లు ఖరాది రాక్షసుల శిక్షించి, జయంబుఁగొని, ధనువెక్కుడించి, నుఱలిపర్ణశాలకేతెంచి, తమ్ముడును దానును సమ్మదంబునన్గలసియున్న సమయంబున.

చ॥ చలమునన్తశూర్పణఖ చయ్యనలంకకునేగి రావణుం
గొలువునగాంచి మ్రొక్కి, తనకున్నృప సూనులు జేసినట్టిచే
తలువిని వినిపించి, వారు తమ తండ్రియనుజ్ఞనువచ్చి, కానలో
పలదిరుగాడు చందములు బన్నుగ నేర్పడజెప్పి పిమ్మటన్

కం॥ ఆ రాము భార్య విభ్రమ, మేరాజతనూజలందు నెఱుఁగమువినుమీ
ధారుణిలోపల గామిను, లారమణికి సాటిబోలరఖినుతి జేయన్

యమునా కల్యాణి - ఆది

ప॥ కన్నులు కలువలో? కాముబాణములో? -కాదువర్ణింపగా! (యా కాంతామణికి!) .................. యాకాంతామణికి ॥కన్ను॥

అ.స. కిన్నెరపలుకులో, కీరమృదూక్తులో, యన్నుమిన్న నుడులమృతపు ఝురులోని? ॥క॥

మి॥ ఎన్న నమృతాంశు బింబమోమింతి చనులు పుత్తడి కలశములో?
పెన్నెరుల్ నీలములోయళి బారులో? పిఱుదులు పులినంబులో మరుగద్దియలో ॥క ॥

కలదో? లేదో? యని పల్కుదురితరులు మధ్యంబునుగన్న
బలిమో? కలిమో? యనుచున్పలుమరు-పల్కుదురు జంఘలెన్న

సీ॥ షట్పదంబులపైకి సంపెంగ పువ్వుల-జలజాతములపైకి చందమామ
కిసలయంబుల పైకి వెసగలకంఠముల్, సింధురమ్ములపైకి సింహములను

దొండపండులపైకి దొడ్డరాచిలుకల, నలరుతూడుల పైకి నంచగముల
పండువెన్నెలనిగ్గుపైకి చకోరముల్, బవనంబుమీదికి బాపదేని.

తే.గీ.మరుడువైరంబు జేసినమాడ్కి, నలక, నాసికాకరానన చరణస్వనములు
వరపయోధర మధ్యోష్ఠ వచనబాహు, గమన హాసాక్షులూర్వా
రురమణికమరె.

కం॥ బంగారు నీరు నిలువున, బొంగారుచునుండనజుడు పోసిన మాడ్కిన్
శృంగారమెల్ల నిలువున, బొంగారుచునుండు గరఁగి పోసిన మాడ్కిన్

## మంజరులు - కాపి

అట్టి వయోరూపంబులు కనుపట్టునట్టివనితారత్నం
బెట్టులైన నీకు స్సిద్ధించిన యట్టులైన నీవెంతన్
త్రిభువన విజయంబందినంత సంతృప్తిజెందెదవటున్నన్
శుభమశుభంబునెఱుంగకెంతయును సూనశరునిక్రొవ్విరులన్
బడియెంతయుకా మానురాగమున-పాయనితమకముమీరి
వడిగకొలువుఁ జాలించి పుష్పక విమానమెక్కి జనుదేరి

వ॥ మారీచుకడకుంజని, ప్రార్థించి నీవు కనకమృగమవై జనస్థానంబునకున్నని, దశరథ నందనుడగు శ్రీరాముండున్న పర్ణశాలకడఁబొడగట్టుమతండును నిన్నువెనుకొను, నీవు నతని నతి దూరంబుగాగొనిపోయి మాయంబైన, నేను రాముని భార్యను గొనివత్తుననిన విని, సమ్మతిలకమారుత్తరంబిచ్చిన రావణుండుగ్రుడ్డై మండిపడె, నతండాసన్నయెఱింగి కనకమృగ రూపంబును దాల్చె, నాక్షణంబున,

కం॥ ఒడలెల్లనుబంగారము, పోడవెల్లనురత్నసమితి బోలిన మెఱుపుల్
వడలెల్లనెరసి మెలగెడు, కడలెల్లవిలాసరేఖ కళలందొప్పెర్.

వ॥ ఇట్లుకనకపుమృగాకారంబుంగైకొని, పర్ణశాలకడకుంబోయి మెలంగు నప్పుడు, జానకి రామునీక్షించి,

## మధ్యమావతి - ఆది

ప॥ కనుమానాధాకాంచనమృగమదె. కనుపించెడు నాశ్రమ సమీపమున ॥క॥

అ॥ కనియును నెఱుగుము, వినియును నెరుగుము, కనులపండువుగ కనుపట్టెనదిగో ॥క॥

మి॥ చని వేగమెదానిబట్టి తెమ్ము, కనికరించి కడువేగమే బొమ్ము
మనమున గలనాకోర్కె దీర్చుమా, మనవి వినుమ నాథావేరమ్మా ॥క॥

వ॥ అనినేడుచున్న సమయమ్మున, సమీపంబునంగల మునులు, ఔరా! ఏమియద్భుతవము! విన్నదియుఁలేదు, కన్నదియులేదు, ఈ కనకమృగంబేమిజేయునో? యని, కనుగొన్న ముని జనంబులు మనంబులందలంకునెడ నామృగనేత్రయగు ధాత్రీ పుత్రి కోరిక మేరకు, సౌమిత్రింభూమిజకుందోడిడి, శ్రీరామచంద్రుడు దానివెనుకొని చనుచున్న యవసరమ్మున.

సీ॥ తనుబట్టనొయ్యన వెనువెంట జనుదెంచు, నిలరేని తలపుదా తెలిసి తెలిసి
చేరువ మెలగుచు బూరి మేయుచుడాసి, మెల్లన యంతంత మెలగి మెలగి
తననీడగనుగొని తానెదిగ్గనిదాటి, భయమున పరుగెత్తి పఱచి పఱచి
యెదురైన బోవక యెలయించి కనుగొన్న దొరవుల నొయ్యన నొరసి యొరసి

తే.గీ. చెవులనిక్కించి చూచుచు చెలగి చెలగి, పోవరాముడు దవ్వుగా
బోయిపోయి
ఎలమి మాయామృగంబని యెఱిగి మదిని, దీని జంపుదుగాకని తెగువచేసి

కం॥ ఏ చిన కినుకను బలునారాచము సంధించి డాసి రాఘవుడా మా
రీచుని దైత్యాధమునిల నీచుని గూలంగనే సెనిర్జరులలర౯

వ॥ వాడు నుంగూలు నవ్వేళ "హా లక్ష్మణా" యనురవంబుం జేసిన నాధ్వని విని జనక నందన మనంబున నులికి, లక్ష్మణునిం బిలిచి, మీయన్న ఏమికీడు వాటిల్లెనోగాన నిన్నుదలంచె. నీవు నుంబోయి మీ యన్నకుశల స్థితి దెలిసికొని రమ్మననతండుదలకక నామెతోనిట్లనియె.

ఉ॥ ఏమిటికింత భీతి మది నీవగదోచుట ఏమినీకు ? నో
భామిని, రామునందు నొక భావము చెందదు, చెందునేనియు౯
భూమివడంకదే? నభముభోరన మోయదె? వార్ధులింకవే?
తామరసాప్త సోమ గ్రహతారక లెల్లను నేలడుల్లవే ?

ఉ॥ అంతపనెయ్య నేని, దనుజాంతకునంతకు మస్త ధాంతకు౯

బంతముమీరగాఁ గలచి, పన్నగమర్త్య, సురేంద్రలోకముల్
బంతులుగట్టియూడ్చి రిపుభంజను రాముని గందకుండ, న
ర్పింతును నీకుదెచ్చి మది భీతిని బొందకు మమ్మ జానకీ!

వ॥ అని లక్ష్మణుండు బల్కినవిని, జనకరాజనందనగినిసి వినరాని మాటలఁ దూలనాడినఁమనం బునస్గందికుందుచు, శ్రీరాముండేగిన మార్గంబు నన్గనియె, నంతనక్కడ.

## మంజరులు - కన్నడ

చనుదెంచెన్సన్యాసి వేషమున - చయ్యన రావణుడంత
కని వినయంబున భక్తితో నమస్కారమొనరించెఁ సీత
ఆశీర్వాదము జేసి సీతనొయ్యన రథముననిడుకొనియెఁ
మోసముతో దశకంఠుడు వేగమె ముగుదనుగొని వేజనియెఁ
గగన వీథిఁ జనురథమున జానకి కంపమొంది దుఃఖించి
నగములార ఖగములార కావుడి మృగములార దయయుంచి,
నరులారా! పన్నగులారా! కిన్నరులారా, వానరులారా!
సురలారా! దిక్పతులారా! యోతరులారా! తాపసులారా!
నా మొర విని రక్షించుడినను, నా నామధేయంబు సీత!
రామునిల్లాలఁ జనకు కూతుదశరధు కోడల భూజాతఁ
అని విలపించిన యార్త నాదమును విని జటాయువను పక్షి
కని రావణుఁదాకెనుగ్రముగ నక్కరటి రక్కసియునొచ్చి
పటు బాణంబుల పక్షిరాజుపై బరపిన కడురోషించి,
రెక్కల ద్రుంపఁజటాయువు ధరబడి రీతిదొఱఁగియల్లాడఁ
అక్కమలనయన, నగలనన్నింటి యంబరముబించి తోడ
వనచరులొక్కెడ గుంపులుగ నుండ వారి ముందుబడవైచె
దనుజుడంతలో లంకకు గొని సీతన్దనయశోకవనిఁదాచె

## కన్నడ - ఆది

ప॥ సీతను దాచెన శోకవనంబున - శింశుపా వృక్షముక్రింద రావణుడు ॥సీత॥

అ.ప. నాతికి కావలి రాక్షసకాంతల-నందుకొందరిని బెట్టి ముదంబున ॥సీత॥

బ.	మాత జగంబుల కన్నింటికి భూ-జాతయని మదిని సుంతయునెఱుగక
పోతరించి దశకంఠుడు మదమున-బోయిరఘురామునే ముంచి తెచ్చి-॥సీత॥

ఉ॥	అత్తఱి రాఘవుండు, తనునాశలఁ బెట్టుచుఁ గొంచుపోవగా,
చిత్తమునొచ్చి యామృగముఁ శీఘ్రమునన్నుడనేసి, దానిమై
తిత్తినిదీసి వింటికొనఁదెచ్చెడివేళ బయో జమిత్ర వం
శోత్తముడుల్కగానబడెనొక్కెడ లక్ష్మణుడన్న దృష్టికిన్.

చ॥	పొడగని గుండె ఝల్లుమన, బుద్ధిఁ గలంగుచు రామచంద్రుడ
య్యెడగడునుగ్రుడై పలికె నీవిటు నా కడకేల వచ్చితి
క్కడ నిను బర్ణశాలకడ కావలియుంచిన చోటు నొంటిమై
పడతుకడించి రాదగునె? వన్యమృగోత్తర మధ్య సీమకున్

ఆ.వె. అనుచు బల్కుచున్న యన్న కుఁ బ్రణమిల్లి, వినయ వాక్యపణఁతిఁ విన్నవించెఁ
జనకుతనయ పల్కు చందంబు మొదలెత్తి లవము దప్పకుండ లక్ష్మణుండు

## మంజరులు - ధన్యాసి

చెప్పిన మాటలు వినిచిన్నబోయి జెచ్చెఱ శ్రీరాముండు
తప్పదనుచు విధిదాటనెవ్వరికి తరలె వెంటలక్ష్మణుడు
రాబయనంబైపర్ణగృహము మార్గమున దుర్నిమిత్తముల
నా భూజాతమగండు గనితనము, మనమ్మున జెందుచుదిగులు
పర్ణశాలఁ బరికించి సీత గనుపడమి కడుచిన్న బోయి, వి
వర్ణవదనుడై భాష్పములు జాలువారగా కన్నుదోయి.
అడుగఁ దొడగెఁ మఱి మఱి కన్పించిన యచటి వృక్షములనెల్ల
అడుగడుగున కనిపించిన మృగములనన్నిటి నావనమెల్ల

సీ॥	నీ దృగ్విలాసంబు నెఱిసభ్యసించెడు, గురుకుచగానవేహరిణవిభుడ!
నీ మంజులాలాప నిచయంబుగైగొన్న, సుకుమారిఁగాన వేపికకులేంద్ర!
నీ పక్షవిస్ఫూర్తి నెనయుధమ్మిల్లంబు, గలయింతి గానవేయశికులేశ!
నీ నిండు సత్కాంత నెమ్మోము గల యట్టి రుచిరాంగి గానవే రోహిణీశ!

తే.గీ. స్తనభరంబున నీ పోల్కదనరినట్టి, అతి వగానవె? చక్రవాకాధినాథ
నెఱయనిను బోటి నెన్నడ నేర్చినట్టి, రమణిగానవె! నీవు మరాళరాజ!

సీ॥ఘన సారభూజంబకానవే నీవంటి, గంధంబుగలయట్టి కరటియానc
కదళికాతరురాజ! కానవే నీయట్టి, మెఱుcగుపెందొడల మామీననేత్ర!
విలసిల్లు చంపక వృక్షంబకానవే, లలినీదుపుష్పవిలాసనాసc!
కమనీయ లత నీవుగానవే నీయట్టి, కరములశోభిల్లు కంబుకంఠి!

తే.గీ. క్రముకధరణీరుహాధీశ కానవయ్య, నీ ఫలస్ఫూర్తి కంఠంబు నీలవేణి?
గళికలను మించు నవకుండకానవమ్మ నీదు కోరిక నిభదంతనీరజాస్య?

సీ॥ వనజాస్య నినుగూడి వర్తించునతిఘోర వనములు శృంగార వనములగును
పడcతి నీతోగూడి పవళించు కర్కశ శయ్యలు పూవులశయ్యలగును.
కలకంఠి నీచేతికందమూలాది భోజనములు మధుర భోజనములగును
హరిమధ్యనిను గూడి చరియించునటువంటి తపములు సత్పుణ్య తపములగును.

తే.గీ.కెరలినీతోడగూడి భోగించునట్టి, భోగమంతయు దేవేంద్ర భోగమగును.
పడతి పొడగట్టగదెనాకు చూడవలయు, కన్నులకు గానబడవేమి కమలనయన?

వ॥ అని మఱియును.

## అఖేరి - ఖండగతి

ప॥ ఏ మృగంబునుగన్న - ఏణాక్షికానవే, ఏ పక్షిగనుగొన్నc ఎలనాగcగానవే ॥ఏ॥

అ.ప. ఏమ్రానుగనుగొన్నcవామాక్షిcగానవే, ఏ గట్టు పొడగన్నc నిభయానగానవే

మి. అనుచున్నపలుమారులు అడిగి యడిగి రాముడు, మనమున భీతిన్గొను, మఱిమఱి మూర్ఛంగను

వ॥ సీతావియోగంబునకుపలవించు చున్నయన్నంగని సౌమిత్రి.

## కన్నడ - ఆది

ప॥ అన్నావగవగనేలావినుమా, యన్నాదీనునికైవడి నీవిటు ॥అన్నా॥

అ.ప॥ అన్నా వనముల నరసికన్పడక యున్నెడవగవగనో సీతకుమా ॥యన్నా॥

మి॥ మానితగుణ సంపన్న నాయన్న, మనమున్నెడి వగవనేలనీవిటు?
కానన భూముల వెదకి జానకిని, కానకున్న యప్పుడువగవగనో ॥నన్నా॥

ఉ॥ వ్రచ్చెద నాగలోకమున వారలగుండెలు, నాకలోకమున్
గ్రొచ్చి యహీంద్ర వర్గమును గూల్చెద, గవ్వపు కొండకైవడిన్

ద్రచ్చెదమర్త్య లోకమును దారత సేగతినైన గ్రమ్మఱం
దెచ్చెద సీత నీక్షణమ దేవర చిత్తము మెచ్చునట్లుగః

వంజరులు - మోహన

చించెదఃదైత్య సంఘములనెల్ల, చిందరవందర జేతున్, బా
ధించెద బ్రహ్మను, లోక పాలకుల, ద్రెళ్లఁగఁభూమీస్థలముః
మించి శైలజాలమ్ముల గీటడగించెద కాంచెదసీతః
అంచిత సద్గుణజాల తల్లడిలకరయవలయు భూజాతర్.

కం॥ భూతలమునునాకసమును, పాతాళంబునునెమకియొబాధించియొనే
సీతను దెచ్చిన పిమ్మట, సీతమ్ముడననుచుమెచ్చునిఖిలోర్వీశా

వ॥ అనిపలుకుచున్న, తమ్మునిధైర్యాది గుణమ్ములకు సంతోషించుచు, జనస్థానంబువెడలి.
జనకనందనన్వేషించుచు, దక్షిణాభిముఖుండైచనుచు ముందట.

వంజరులు - ధన్యాసి

పక్షములు కాళ్లు దునిగియున్ననొక పక్షినిగని రాముండు,
రాక్షసమాయని శిక్షింపదలపఁరయమున పక్షీంద్రుండు,
నీ తండ్రికి మిత్రుడనోతండ్రీ నీకు దగునె నన్నేయఁ ?
సీతాధిప నా పేరు జటాయువు చిత్తమున నెఱుఁగుమయ్య!

కన్నడ - ఆది

ప॥ వినుమోరాఘువ పంక్తిరథుడు దోర్వీర్యము సంధిల్లంగా ॥వి॥

అ॥ప॥ జనక్ష్మాపతినందనంగొనుచు జనునెడస్వేచ్ఛంగనుచు ॥వి॥

చ॥ వనితామణికడు దీనయమ్యై పలుకు - వాక్యమ్ములనే నతి కుతుకమ్మున
వినిపోరాడగప్రాప్తమయ్యెనా కీవేషము తొలగెః భవపాశము ॥విను॥

వంజరులు - నాదనామక్రియ

అని సీత తెఱఁగు నెఱుక పరచినా - జననాయకురామునితో
చనెత నువు వీడి నా జటాయువును జనకుని వలె మోదముతో
గని రఘురాముడు దహన సంస్క్రియలగావించి తక్షణమ్ము
జనుచుఁ దక్షణాపథమున కబంధుగని యెచిత్ర రూపమ్ము

వాని వధియించి పోవుచు ముందటు వనితారత్నము శబరిఁ
గని యెకలు షాద్రి యశని పాతమనఁ ఘనముక్తి వధూకబరిఁ.

తే.గీ.ఇనకులాధీశ సుగ్రీవుడనెడివాడు, కపికులశ్రేష్ఠుడత్యంత ఘనుడు దలఁప
అతనితోపొత్తుగా వివుమన్ని పనులు, చక్కనౌటకు నాత్మఁనిస్సంశయమ్ము.

వ॥ అని చెప్పివీడ్కొల్పిన నవ్మనను జేంద్రనందనులటు మీద పంపాతటంబునకుంజనిరని చెప్ప నారదమునివర్యుని వాల్మీకి మునీశ్వరుండు మీది కథా విధానంబడుగుటయు,

కం॥ జలజాక్ష భక్తవత్సల, జలజాసన వినుత పాద, జలజాతసుధా
జలరాసి భవ్యమందిర, జలజాకర చారుహంస జానకి నాథా.

గద్యము : ఇది శ్రీ గౌరీశ్వర వర ప్రసాదలబ్ధ గురుజంగమార్చనవినోదసూరి జన వినుత, కవిచ కవి చమత్కాతుకూరిరికే సనశెట్టి తనయు వెల్ల నామధేయవిరచితంబైన శ్రీరామాయణమహాకా కావ్యమునందరణ్యా కాండమున 'శ్రీ హరికథా కేసరి', 'హరికథా సుధానిధి', 'సత్కాథా ధుర్య' గాన కళా ప్రపూర్ణ, పద్య పఠన ప్రవీణ, ఇత్యాది బిరుదాంకితులును, రామాయణ, మహా భారత, భాగవతాది హరికథా కథకులు. గజారోహణాది సమ్మానితులు, ఆకాశవాణి (ఆలిండియా రేడియో) గాయకులు, శ్రీ తాళ్ళూరు, నరసయ్య వేంకటాంబా, జ్యేష్ఠపుత్రులు శంకర్య భాగవతార్చే పాటల మంజరుల కూర్పుతో సర్వమునేకాశ్వాసము.

మంగళము సురటి - తిశ్ర

ప॥ మంగళమో రామ - జయ - మంగళము గుణాభిరామ ॥మం॥

అ॥ప॥ సంగరదానవ సముదయ - భంగాకరుణాంతరంగ ॥మం॥

చ॥ శబరి వినుత శుభ చరితా - సకల మౌనిజనసన్నుత
ఇభ రక్షణ శుభలక్షణ - హేసర్వ జగద్రక్ష ॥మం॥

*సర్వేజనా సుఖినోభవంతు ఓం తత్ సత్*

కం॥ పక్షీంద్ర వాహా గిరిజా త్ర్యక్ష మనోజ్ఞాతగేహా! యపహృత మోహా!
రాక్షస భీమా! మునిజన, సాక్షాత్కృత నైజధామ! జానకి రామా!

వ॥ నారద మునీశ్వరుండు వాల్మీకి మహా మునికెఱింగించిన తెఱ
గెఱింగించెదనా కర్ణింపుము.

సీ॥ పంపాతటమ్మున బాణాసనాయుధ పాణులైయున్న భూపాలసుతుల
కనుగొని భీతిల్లి కమలాప్తసూనుండు, వారి పంపున వీరువచ్చిరనుచు
కలగితా ఋష్య మూకంబున నుండంగ, వెఱచి మలయశైల విపినసీమ
కరిగి వారల రాక తెరగెల్లఁదెలిసి రాపవనాత్మజుని వేగబంపనతడు

తే॥గీ॥ వచ్చి రఘురాము శ్రీపాద వారిజముల కర్థి బ్రణమిల్లి మీరెవ్వరయ్య యిటకు
ఏమికతమునవచ్చితిరేమినామ, మనుచు నడిగిన సౌమిత్రి యతనికనియె.

మంజరులు - మోహన

దశరథుండనెడి రాజు తనయులము తరణి వంశజుల మేము.
దశరథు పంపున తపమాచరింప తరలి యిటు వచ్చినాము
రాముడతడు నే లక్ష్మణుండ శ్రీరాముఁతమ్ముం డసీతఁ
రామునిల్లాలిఁదుర్మార్గుండా లంకాపురాధినేత
అపహరించి గొంపోవ నాజాడ నరయుచు రాగా శబరి
కపిరాజును సుగ్రీవుని గనుడనగా వచ్చితిమీదారి

తే॥గీ॥ తలపనీరాజునకు నెందు ధాత్రిలోన
వినుమ సాధ్యంబులైనట్టి పనులు లేవు
సూర్య వంశోత్తముడు మహాశూరుడతడు
నీకు పేరేమి జెప్పుమా! మాకు నన్నఁ

తోడి - ఆది

ప॥ హనుమంతుడ నా పేరు వాయునం - దనుడనంజనాదేవి తనయుడను ॥హ॥
అ.ప. ఘనుడు వాయుదేవుని వరమున నిల - జనియించినాడ కేసరీ సుతుడ ॥హ॥
చ. అనయము నర్కజు మంత్రినైయుందు-నాతని కనుసన్నలలో మెలగుదు ॥అ॥
వినయమొప్ప జరియించు చుందునే-ననఘులార! దశరథ తనయులార॥బ॥

కొనివచ్చెద సుగ్రీవునిటకునే - గూరిమి మీకొనరింతుౙ
అనఘులారయని పల్కి యర్కజుని - వినయముమీరగదెచ్చెౙ
అగ్ని సాక్ష్యముగ రామలక్ష్మణులకర్కజు సఖ్యముగూర్చెన్
లగ్న మొనరించె సుగ్రీవుని మదిఁ రామలక్ష్మణులు మెచ్చౙ

వ॥ సుగ్రీవుడు శ్రీరామ చంద్రుని పగదీర్పగా భారంబు వహించి తనకు పగవాడైన వాలిని జంపింపగాదలంచి, వానితో తనకుగల్గిన పూర్వపు వైరంబు తెఱంగు శ్రీరామునకు దెలియ విన్నవించిన వాలి మహా సత్వశాలి యతడు రామునిచేతందెగుట తెల్లంబుగాదుందుభికళే బరంబును పది యోజనంబుల దూరమెగురజమ్ముటయు, సప్త తాళంబుల నొక్కబాణంబున దెగవేయుటను జూచి, సుగ్రీవుడు భయకంపిత హృదయుడై, రాఘవేశ్వరుల పాదారవిందము లకు వందనం బొనరించి, జనకునందనమున్ను జారవిడిచిన యాభరణంబుల మూట దెప్పించి చూపినంగని, మూర్ఛిల్లి గొబ్బునందెలిసి, యర్కకులేశ్వరుండైన శ్రీరామ చంద్రుడర్క సంభవుడగు సుగ్రీవునితో నిట్లనియె.

అఖేరి - ఆది

ప॥ పగనీకెక్కడి దింకౙ, నగచర, నగభేది సుతుని తెగ వ్రేతుగనుము-ప

అ.ప. జగములెదురైన జయమిదుదు, న్నీ పగతునాయస్త్రమునకు బలిచేసి ॥ప॥

జ. సుగుణుడ డగునిన్ను బాధ బెట్టిన, దుర్గుణునీ సోదరుడౌ వాలిని
పొగరడంచి చంపెద కిష్కింధా, నగరమునకునిన్ను రాజుజేసెద ॥ప॥

వ. ఇట్లు ప్రమాణ వచనంబుల నయ్యు చల చరాగ్రణి స్వాంతంబును సంతోషింపజేయ, నతండును, శ్రీరామచంద్రుని కార్యంబునకు సహాయుడై యుండనొడంబడి, యమ్మహానాయకుని యమమతంబున యుద్ధ సన్నద్ధుండై కిష్కింధా నగరమ్మున కుంజని, తద్వారంబుననిల్చి సింహనాదంబు జేసినంగనలి, యాదే వేంద్ర తనూజుడు సనుదెంచె. నంత నియ్యరువురు నుంగదసిబుజంబు లప్పళించుచు, గర్వాలాపములాడుచు నొండొరుమార్కొని,

కొండలు బెకలించి యొకరి నొక్కరు - గొట్టుకొని హుంకరించి
కండకావరముతోడ బోరిరుద్ధండ బలులగుచు మించి,
వాలాగ్రంబులమోదుకొనుచు వడిc పక్షములగఱచికొనుచు
కూలస్త్రేయచు నొక్కరి నొక్కరు, ఘోరముగc బొడుచుకొనుచు
కొండలు కొండలు దాకినట్లుకడుక్రొవ్వి నగజముల రీతిਿ
గుండెలదర గాత్రంబులుగ్రుక్కగc గ్రుద్దుకొనిపోరుచుండਿ

ఉ॥ సాలము పొంతనిల్చి, రఘుసత్తముడమ్మురి వోసి, శబ్ద వి
న్మూలముగాగ విల్లి విచి ముష్టియుc దృష్టి యు గూర్చి, గోత్ర భృ
త్కూలము వజ్రపాత హతిc గూలు విధంబున గూలనేసెన
వ్వాలి, ప్రతాపశాలిc మృదు వందన శీలిc సురాళి మెచ్చగਿ

వ. తదనంతరంబ

కం॥ తారాపతి శిక్షింపుచు, ధారాపతి ధవళకీర్తి దగునర్కజునిਿ
దారాదేవికి బురికా, తారార్కముగాగ రాజ తనయుడు నిల్పెਿ
కం॥ నిగ్రహముమా నిన్నృపతి శుభగ్రహ లగ్నంబునందు పట్టము గట్టెਿ,
కం॥ విగ్రహులరాజోగ్రహునా, సుగ్రీవుని హి మదామ సుగ్రీవుదగਿ.

వ. ఇట్లు సుగ్రీవుని కపిరాజ్య పట్టభద్రునింజేసి, వాలితనూసంభవుని అంగద కుమారుని యువరాజు పదంబున నిలిపెనంత వర్షాకాలముగడుచునంతదనుక శ్రీరాముని మాల్యవతంబుపై నుండ నియమించి, వారు సనిరయ్యవసరంబున,

సీ॥ బ్రహ్మాండమగలగపట పట ధ్వనులతో, నుఱుములంతంతంకునుఱు ముంచుండ,
కడు భయంకరముగా వడమ్రోగు మోతల, పిడుగులాడాడగు ఛిల్లుమనగ
క్రముకంబులంజేసి కణములతోగూడ, కరుడుగట్టిన వడగండ్లురాల
కొఱవిదయ్యంబులవెఱపించు తెఱగున, విద్యుత్ర్పకాశమువిస్తరిల్ల

తే.గీ. ముసుగువేసిన చందాన మొగులుగప్పి, మీఱి నలువెక్కి చీకట్లుగాఱుకొనగc
మించి కడవల నుదకంబు ముంచితెచ్చి, క్రుమ్మరించిన గతి వాన గురిసెనపుడు

## కల్యాణి - ఆది

ప॥ ఏఱులు కాల్వలు బారె సస్యములు-నిలనెంతో సమృద్ధిగ బండెఁ ॥ఏ॥

అ.ప. మీరి సురభులెల్లను బితికెపా - లేఱులుగా పాడి వృద్ధియైతగ ॥ఏ॥

చ. కోరినన్ని ఫలములనిడెతరువులు-కొల్లగమధువునుగూర్చె భ్రమరములు
తీరె ప్రాణులకు నాకలిదప్పులు-తేలె మోదమునజగములు హాయిగ ॥ఏ॥

వ. అంతవర్షాకాలమంతమ్ముగాగ నమ్మహీకాంతుడు ప్రేయసీ వియోగ పరితాపంబునబొరలుచు, నోర్వలేక విభ్రాంతస్వాంతుడైయుండ,

సీ॥ పలుమారునీ హస్త పల్లవంబుల చేత, నలివేణి నాతాపమార్పవేల?
నళినాక్షి పరిరంభణ క్రీడ దేల్చునీ, మది నొప్పినానొప్పి మాన్పవేల?
చెలియ యోష్ఠామృత సేవకై నీయల్క వడిదప్పి నాదప్పిగడపవేల?
భానుతాపానల పరితాపముడుపనీ తనువునీ తనువున బెనచవేల?

తే.గీ. యనుచుఁ సీతఁబిలుచు నందందబరికించు, దిక్కులాలకించు నిక్కిచూచు
దశరథాత్మజుండు తన్ను డామఫఱచుచు, బయలు కౌగలించు పలవరించు

వ. మఱియును.

ఉ॥ కూరలు నోటికిన్రుచులు గూడుట దప్పెను దుంపదూడులుఁ
గారముదోచె జిహ్వకును, కమ్మని తేనెలు చేదులయ్యె
గారయెచిత్తమంతయును, కంటికి నిద్ర రహింపదయ్యె, శృం
గారమెలర్ప సీతబొడగాన మిరామనృపాల మౌళికిఁ

ఉ॥ తాలిమిదూలిపోయి, పరితాపమునందిరుగాడు నొక్కచో
కాలునునిల్వద్రొక్క నధికారముజాలక యొప్పుచుంగడుం
జాలి వహించు చిత్తమున చంచలడంగను, భూమి పుత్రిపై
మేలిమి జేసి రాముడటుమిన్నక సేదురుగొన్నకైవడిఁ

వ. ఇట్లు విరహతాపంబున బొరలుచున్న సమయంబున కార్తిక మాసంబుసనుదెంచె. శ్రీరామచంద్రుడు బలంబులంగూర్చుకొనిరమ్మని సుగ్రీవు

పాలికి సౌమిత్రి ననుప, నారాముతమ్మునిఁగూడి ఇనజుండు తారాసమేతుండై చనుదెంచి రాఘవేశ్వరుల చరణారవిందములకు నమస్కరించి తన బలమ్ముల దోడుసూపందొడంగెనెట్లనిన, పదులును, నూరులును, వేలును, పదివేలును, లక్షలును, పది లక్షలును, కోట్లును, శతకోట్లును, నదుర్బుదంబులును, న్యర్బుదంబులును, ఖర్వంబులును, మహాఖర్వంబులును, పద్మంబులును, మహాపద్మంబులును, క్షోణులును, మహా క్షోణులును, శంఖంబులును, మహా శంఖంబులును, క్షితులును, మహా క్షితులును, క్షోభంబులును, మహా క్షోభంబులును, నిధులును, మహా నిధులును, సాగరంబులును, మహాసాగరంబులును, పరిమితంబులును, మహా పరిమితంబులును, ననంతంబులును, మహా ననంతమ్ములును, గడచి లెక్కకు మిక్కిలి నెక్కువచ్చె, డెబ్బది రెండు వెల్వులుగల కపి బలంబుల తోడ తోడు జూపినంజూచి. రాఘవేంద్రుడు సంతోషించి, సవితృనందను గౌరవించి, కౌగలించుకొని, సీతాన్వేషణము జేయగల వానరోత్తముల నధికబలయుతులనేర్పరచి, దిశలకుంబంపునపుడు, తూర్పునకు వైందుండును పశ్చిమంబునకు సుషేణుండును, నుత్తరంబునకు శతబలియు, నను వారలనేర్పరించి, వారికి తోడు గావానరవీరులను లక్షల సంఖ్యాకులనేర్పరంచి యిచ్చి, జానకియున్న చొప్పును దెలిసి యొక్కనెలలో రమ్మని యనిపి, హనుమంతుని బిలిచి, నీవు దక్షణంబున కుంబొవమ్మని, యనుపునపుడు, శ్రీరామ భూపాలుండు వాని విశ్వాసాదిగుణమ్ములకు మెచ్చినవాడై, దగ్గరగా బిలిచి, నీవు శౌర్యవంతుడవు హితుండవుఁగావున, నీ చేత మత్ప్రయోజనం బీడేరునని పలికి, తన చేతియంగుళీయకం బతని చేతికిచ్చి, యీ ముద్రిక జనకరాజనందనకు సమర్పించి, యాజానకి శిరోరత్నంబు నాకానవాలుగాదెమ్మని యనుప, నతండియ్యకొని మ్రొక్కిన నాతనికిందోడుగా నంగద జాంబవంతాదులం గూర్చియనిపె ననుటయు, విని నారదుని వాల్మీకి మునీశ్వరుండటు మీద కథా విధానం బెట్టిదియనియడుగుటయును,

కం॥ జలజాక్ష భక్తవత్సల, జలజాసన వినుత పాద, జలజాత సుధా
జలరాశి భవ్య మందిర, జలజాకర చారుహంస జానకిరామా

గద్యము. ఇది శ్రీ గౌరీశ్వర వరప్రసాదలబ్ధ గురుజంగమార్చన వినోద సూరి జనవినుత కవిచమత్తాతుకూరి కేసనశెట్టి తనయ మొల్ల నామధేయ విరచితంబైన, శ్రీరామాయణ మహాకావ్యంబు నందు కిష్కింధాకాండమున, 'హరికథాకేసరి', హరికథా సుధానిధి, సత్కథాధుర్య, గానకళా ప్రపూర్ణ, పద్య పఠనా ప్రవీణ, ఇత్యాది బిరుదాంకితులును, రామాయణ, మహాభారత, భాగవతచాది హరికథా కథకులు, గజారోహణా దిసమ్మానితులు, ఆకాశవాణి హరికథా కథకులు, శ్రీ తాళ్ళూరు, నరసార్య వెంకటాంబ ప్రథమ పుత్రులు శంకరయ్య భాగవతార్ చే పాటలు, మంజరులు కూర్పుతో సర్వము నేకాశ్వాసము.

మంగళం - సురటి - త్రిశ్రగతి

ప॥ మంగళహారతి గొనుమా - మారజనక శ్రీరామా ॥మం॥

అ.ప. సంగరదనుజ విరామా - సనకాది నుతస్తోమా ॥సం॥

చ. హంగుగ సుగ్రీవాంగద - ఆంజనేయకపివరులు, పొంగుచు జాంబవతాదులు, భూరి భక్తి గొలువగ నిదె ॥మంగ॥

*ఓం సర్వేజనా స్సుఖినోభవంతు ఓం తత్సత్.*

# మొల్ల రామాయణము-సుందర కాండము హరికథ

షణ్ముగ ప్రియ - ఆది

ప॥ గౌరీ నందన గజవదనా, కని-కరమున ననుగనుమా, యగజాననా॥గౌ॥

అ.ప. కోరినిన్ను నమ్మికొన్నవారికి - కొదువే ముండునురా... ఉండ్రాళ్లదేవరా.

మి. సారెకు నీభజమ్ము సల్పినిశ్చల మతి ధ్యానమ్మొనరించెడినా
దారికడ్డురాక సర్వశుభములద యనిడుమాషణ్ముఖ ప్రియ సోదర ॥గౌరీ॥

కల్యాణి - ఆది

ప॥ వాణీయలికులు,వేణీ,పల్లవపాణీ, యజురాణీ, దయగను మానను గీర్వాణి॥వాణీ॥

అ.ప. ఏణీలోచని, వీణాధారిణి, కవిజనపోషిణీ, కలుషవిదారిణి ॥వా॥

మి. నాణెంబుగ మృదు మధుర వాక్సుధల, నానాల్కనుజాల్వార నొలికించి
రాణయొప్పార జేయుమా సభల, శుకవాణీ, విరిబోణీ కల్యాణీ ॥వాణీ॥

కల్యాణి - ఆది

ప॥ అలికులవేణీ-యజురాణీ. అ.ప. పలుకుల శుకవాణి పల్లవ మృదుపాణి ॥య॥

మి. పులకరించి సమ్మోదమున లోక-ములు నాగానమునాలకించగా
నిలిచినానాల్క రాణివాసముగ - నీ కటాక్ష వీక్షణమునగను కల్యాణి ॥అలి॥

శ్రీరాగం - ఆది

ప॥ హరి దొరసానీ సిరిరాణీ పరమ పావనీ భక్తజనావనీ ॥హ॥

అ.ప. కామిత ఫలదాయనీ....కలుషా పహారిణీ ॥హరి॥

మి. నిరతమునీపద సేవజేయునా, దురితమ్ములదొలగించి సత్కృపా
పరతన్సర్వశుభమ్ములొసగి ఏమఱక గనుమశుభశ్రీరాగమున ॥హరి॥

కం॥ సూర్యకుల రత్న దీపా! సూర్య సహస్రప్రతాప-సుందర రూపా!
ఆర్యారాధితనామా! శౌర్యాధిక సుగుణ సీమ జానకి రామా.

## మంజరులు - కల్యాణి

రామునకుఁ మ్రొక్కి భక్తి యక్కపిరాజునాజ్ఞ వానరులు
రామునర్థాంగి సీతను వెదుకగ - రయమున దాటుచుడరులు
గిరులు వనములున్నదులను గడచుచు పరికింపుచుపురములను
తిరిగి తిరిగి యాశతోడ వడివడి - నరసి పెక్కు చోటులను
వెదకి వెదకి సీతజాడగానక వేగమున రాముకడకుఁ
ఎదలన్దిగులందుచు వచ్చిరితా - మేగిన త్రోవనెకడకు

వ. అట్టి సమయంబున యాంజనేయాంగద జాంబవంతులతోడి బయల్వెడలిన వానరులు, పలుచోట్ల సీతజాడ నరయుచు, కరి, శరభ, సింహ శార్దూలాది భయంకర మృగాళి గల్గియు న్బుణ్యాకరంబైన మహేంద్రశైలమ్ము న్గనుంగాని, సంపాతి యనెడి గ్రద్ద వలన సీతను రావణుండు గొని పోయి, లంకా నగరమ్మున యశోక వనంబున చెఱనిడిన సంగతి నెఱింగి, మహా నందమ్ము నొంది, యమ్మహేంద్ర పర్వతము నారోహించి, పురోభాగంబున.

కం. ఆ కపివీరులుగనుగొని, రాకాశ నదీ ప్రచుంబి తార్భటి భంగా
నీక మహాఘనరసభయ దాకార నటత్ప్రకా శునా జలధీశుఁ

## మంజరులు - మోహన

మును కొని తమ తమ బలముల నెల్లను - మనములనూహం జేసి
ఘనుడగు పావనినెల్ల వారలును, కన్గొని పల్కిరి డాసి
మాక సాధ్యమీ సంద్రము దాటుట, మారుతి నీకే దప్ప
శ్రీకర పావన మూర్తి నీ బలము చెప్ప తరముగా దప్ప.

వ. అని ఇట్లు ప్రార్థించిన తోడనే యుబ్బి, వారి వచనమ్ములకు సమ్మతించి, వాయుత నూజుండిట్లనియె.

ఉ. పావన మూర్తి, రామనరపాలకుపంపున నబ్ధిదాటెదన్
దేవ విరోధిదాగింలిన దేవిని జూచెద, కానకుండినన్
లావున గడ్డడో బెరికి, లంకయుదెచ్చెదనట్లు గానిచో
రావణుబట్టి తెచ్చెదను, రాముని సన్నిధికెన్నిరీతులన్.

వ. అని వారి మనంబులు సంతసిల్లునట్లుగా బిరుదులు వక్కాణించి, తండ్రియైన వాయుదేవునకును, త్రిమూర్త్యాత్మకుండైన లోక బాంధవునకును, నింద్రునకును, సముద్రునకును, నమస్కరించి, శ్రీరామ లక్ష్మణుల తన మనః పద్మంబుల నిడుకొని మ్రొక్కి బంధుమిత్రులంగౌగలించుకొని, వారిచే, దీవనలంది, గమనోన్ముఖుండై.

చ. మొగము బిగించి, పాదములు మొత్తముగా నటులూది త్రొక్కి, నీ
టుగమొగమెత్తి, భీకరతరోరరవంబున నార్చి, బాహుల
త్యగణిత లీల నుంచి, వలయంబుగ వాలముద్రిప్పి, ప్రేగునర్గ
నగముసగమ్ము క్రుంగ, కపినాథుడు నింగికి దాటె దివ్వనన్.

వ. ఇట్లు నింగికెగిరి పోవుచుండు సమయంబున పావనికి నడ్డంబుగా మానవ రూపంబున మైనాక పర్వతంబును, సురసయను నాగజననియు, ఛాయా గ్రాహిణియైన సింహికయునుుంగను పట్టిన నెల్లరన తిక్రమించి, సువేలా చలంబునకరిగి, నక్కడనలయిక దీర నొక్కయిక్కున నించుక సేపు విశ్రమించి యున్న సమయంబున.

ఉ. భేరికి సాటి యౌ దనుజ భీషణ భాషలు, భద్రనాగఘీం
కారనినాదముల్, హయనికాయవు హేషలు, కాహళధ్వనుల్,
వీర మృదంగనాదములు, విశ్వభయంకరలీల లంకలో.
బోరుకలంగగా, శ్వశనపుత్రుడు చాలగ నాలకించుచున్.

ఉ. కోటికి కోటులై పరగు కుంజరవర్గము, ఘోటకంబులున్
గోటికి నెక్కుడై పరగు గోత్ర సమానములౌ రథంబులున్
గోటికి హెచ్చులై పరగు ఘోరనిశాచరకోటి కోట్లతో
సాటికి నెక్కునప్పురము సాహసవంతుడుగాంచె ముందరన్.

వ. ఇట్లు లంకాపుట భేదనంబు నీక్షించి మనంబున.

మోహన ఆది

ప. ఘోరాకారులు, కామరూపులు మహా, క్రూరాత్ములత్యుగ్రులీ శూరుల హా

॥ఘోరా॥

అ.ప. వీరులంగన్ను బ్రామిపురి నిశోధించుటెట్లు లోకోక్కజానకినిటు

ఈమి. రూపంబున బోవగా గనిన, ఎగ్గువారేమి జేదురో నాకు. ఈ. నారీరత్నము
సీతనిందుగన, నాకెటు వీలగునోసిద్ధించునో ॥ ఘొ॥

వ. అని తలంచుచున్న యవసరంబున

మంజరులు - కాపి

గ్రుంకెలోకబాంధవుడు పడమటన్ గూండ్లకు పక్షులు జేరెన్
పొంకముడిగె తామరలు, కలువలున్, బూసెంతారకలు మీరెన్,
బింకము మీరగ జూపె కాంతి నళి బృందము గూర్కెతమంబే
వంకను బర్వెను జార చోరగమి వాలి చరింప ముదంబై.

వ. ఇట్లు నిశాసమయంబున తన మేంటిగాత్రంబణు మాత్రంబుగా గుదియించి, యగ్గిరి డిగ్గి, నల్లనల్లన పురద్వారంబు నొద్దకు జేరి, వానరకుల పుంగవుండు పురప్రవేశంబు జేసె.

ఉ. మేడలు, రచ్చ కొట్టములు, మిద్దెలు, మచ్చులు, నాటకూటముల్,
మాడువులంగళుల్, దనుజమందిరముల్, పురగోపురావళుల్
వాడలు దేవగేహములు, వప్రచయంబును, వేశ్య వాటికల్
గోడలు నాదిగాగ కపికుంజరుడప్పుడు జొచ్చి చూచుచున్.

కన్నడ -- రూపకము

ప. వెదుక జూచ్చె కపి వరుండు - విసుగక సందులు గొందులు. వె.
వెదకెను మరువులు తెరువులు - నిరువులు నంతః పురములు ॥ వెదు॥

అ. వెదకెను వాడలు - మేడలు, వీధులు, జొరరాని చోట్లు
వెదకెను పలు చోటులందు - వెఱపించుక లేకపురిన్ ॥వెదు॥
చరణము గాలిలీల శీతకరుని - గతిని ధూమ రేఖ రీతి.
కలయ తిరిగి యసురనిలయ, ములునెల్లను కానకిటుల

మి. తలపజొచ్చె మనమున నెం-తయు సందియమున కపి
కులుడు మహాబలు డినకుల తిలకుని రాముని భక్తుడు ॥వెదు॥

కం. మాయా బలుండు రాక్షస, నాయకుడట బట్టితెచ్చు నాడతని మహా
కాయమును గ్రాకృతి గని, తోయలి తన తనువు నెచట దొరగెనొ యకటా!

అటుగా కాతడు అన్య దేశమున, నవనిజనుంచెనో ఏమో?
ఘటు యంత్రస్థితి వార్థిమధ్యమున - కఠినత ద్రోచెనో ఏమో?
పటుబాహా బలశక్తి నుంచెనో, ప్రాగ్దేశంబున, మాయన్
చటులో గ్రాకృతి రాము బాణముల -శంకించి దరికి డాయన్.

వం. అని యీ గతి వితర్కించి

ఉ. ద్రుంతు విధాత జందెములు, ధూర్జటి శైలము వ్రత్తు, విష్ణుసే
వింతు, గ్రహంబులందిరుగ పేయుదు, పూర్ణపయోధులేడుగా
రింతు, నుడువ్రజంబులబోరిన్ గణియింతును భూతలంబు, వ్ర
క్కింతు, నహీంద్ర లోకమును గీడ్వదజేయుదు సాహసంబునన్.

ఉ. కొట్టుదునింద్రు, బావకుని గుండెలువ్రత్తు: కృతాంతుజెండుదున్
మట్టుదు దైత్యునిన్, వరుణు మానముగొందును, గాలిదూలగా
బట్టుదు, కిన్నరేశ్వరుని ప్రాణము కల్గుదుఁ శూలిదోలుదున్.
చట్టలు ద్రుంతురావణుని, సారసలోచనిఁ జూపకుండినన్.

అఠాణా - ఆది

ప. సాహసముననిటు జేయతేవతలు - చంద్రవదనఁ జూపించెదరుగాక ॥సా॥

అ.ప. బాహుబలమునకు నోడిసకలది. క్పాలకులు యప్పగించెదరుగాక ॥సా॥

మి. ఓహూ! మానుమంతా! యాగుమయా గ్రహమున నుత్సాహింపకుమనివై
దేహిప్రాణనాయకుండు రాముడు, తిరిగిరమ్మనుచు బలుకువోగాత!

వ. అనియనేక ప్రకారంబుల నాలోచించుచు, నొక్క గోపురం బారోహించె, నాసమయమ్మున.

కం. పావని గనుగొనెనప్పుడు, పావన విఖ్యాత సుగుణ భావోపేతన్
సేవితదనుజవ్రాతఙ, భూవనితా జాత నిత్య పూతస్మితన్.

వ. ఆరామంబు నారామంజూచి, శ్రీ రామ చంద్రుని దేవిని గాదలంపుచు, నగ్గోపురంబున నుండి డిగ్గి, సూక్ష్మరూపమ్ముగైకొని, శింశుపా వృక్షంబారోహించి యందు.

సీ. పతిబాసినట్టి యాపదకంటె పలుమారు, వివిధ మాయల చేత వేగి వేగి

వీర దానవ కోటి వికృత వేషంబుల గనుగొని చిత్తంబుగ్రా గికాగి
తనదిక్కులేమికై తల్లడిల్లుచు నాత్మ లోపల మిక్కిలి లోగి లోగి
కర్ణకఠోరమ్ముగా నాడు మాటల దోరగెడికన్నీట దోగిదోగి

ఆ.వె. రాముదలచుకొనుచు రాముని బేర్కొంచు, రామరామయను చురమణి
బలుక, కపివరుండు జూచి, కామినీరత్నంబు, సీతయనుచుఁబొంగెఁ చిత్తమందు.

వ. అట్టి సమయంబున రావణాసురుండు, సీతా పహృతహృదయుండై, పన్నీటి మజ్జనంబాడి, దివ్యాంబరంబులు గట్టుకొని, కర్పూర సమ్మిశితమైన శ్రీ గంధంబు నెఱపూత బూసి పారిజాతపుష్పంబులు ముడిచి, మవ్వంపు తావినివ్వటిల్లెడు జవ్వాదిమెత్తి, దశ శిరంబులందును, రత్న మకుటంబులు ధరియించి, మణిమండి తమ్ములగు, కుండలంబులు బూని, భాను ప్రభావిలసితంబులగు పతకంబులును, నవరత్న స్థగితంబగునొడ్డాణంబును నమరించి, చంద్రహాసహస్తుండై, కందర్ప విలాససుందరులగు కిన్నరకింపురుష, గంధర్వ అమరోరగసిద్ధ విద్యాధరాంగనలు భయపార్శ్వంబుల నాలవట్టంబులు వట్టి మౌక్తిక ఛత్రంబులును, దాలవృం తంబులును, వింజాససుందరులగు కిన్నరకిపురుష, గంధర్వ అమరోరగ సిద్ధ విద్యాధరాంగనలు భయపార్శ్వంబుల నాలవట్టంబులు వట్టి మౌక్తిక ఛత్రంబును, దాలవృంతంబులును, వింజామరంబులును ధరియించిరాగా, కొందరు కరదీపికా సహస్రంబులుగొని, ఖిఋందనేతేర, నశోకారామంబునకు న్ననుదెంచె నప్పుడు గంధవాతూలంబు నందూలుపుష్పలతంబోలెవడవడవడంకుచు, తనసుందరాంగంబులు, హస్తోరు. ప్రదేశంబుల మాటియు, గప్పియు, నడంచియు, నివురుగప్పిన నిప్పు చందంబున, ధూళి ధూపరంబగు రత్నంబుకైవడి, మేఘ చ్ఛన్నంబగు చంద్రబింబంబుడంబున, నిత్తడి బొదిగిన కుందనంపు శలాకలాగున మారు వడియున్న జానకినిగని,

శ్యామ - ఆది

ప. తోయజదళనయనా, వినుమువల రాయడు విరిశరముల వేయదొడఁగె. ॥తోయ॥

అ.ప. తోయదవీథిన మేయముగానుడు రాయడు వడగాయగదొడంగెనో ॥తో॥

మి॥ కోయిలలు కీరములు గూయగనళులే యెడన్బొచినను మ్రోయదొడగె
నాయెడ నీవు కృపారసముంచక నీయెడ నేచుటతగునె లలితాంగి. ॥తో॥

సీ॥ అమరేశ్వరుండు పాయనముగానిచ్చిన యంచిత చీనిచీనాంబరములును
దివిజాధి నాథుండు దినదినంబుననిచ్చు, పారిజాతోల్లసత్ప్రసనములును
దణిణా ధీశుండు తగకాన్కలంపిన, సురభికర్పూరాది పరిమళములు
పాతాళమున నుండి ఫణిసార్వభౌముండు, పుత్తెంచినటు వంటి
భూషణములు

తే॥ గలవు నా యింటనే ప్రొద్దుగడిమలేక, దేహపరితృప్తి గావించి, మోహమలర
కాముకేళి సుఖంబులంగలయుటొప్పు. విడువుమడియశరా భూవిభునిమీద

సీ॥ ఎవ్వాని వీటికి నేడు వారాసులు పెట్టని కోటలై పెచ్చుపెరుగు,
నెవ్వానిసేవింతురింద్రాది దేవతలను చరబలుల యియను దినంబు,
నెవ్వాని చెఱసాల నేప్రొద్దునుందురు, గంధర్వ, సురయక్ష, గరుడకాంత
లెవ్వాని భండార మిరవొందు విలుసిల్లు నవనిధానంబుల వివిధ భంగి

తే.గీ. సకలలోకంబులును మహోత్సాహవృత్తి, నెవ్వనికి చెల్లుపుష్పకమెక్కితిరుగ
నాకె తక్కంగ గలదె ఏ నాటినైన , మధ్భుజాశక్తి ప్రతి పోల్ప నద్భుతంబు,

సీ॥ శ్వసనుండు లోగిలి సమ్మార్జనము జేయ, నబ్ధి నాధుడు కలయంపిజల్ల
పావకుండరుదెంచి పాకంబులొనరింపc శమనుండు వెస పరిచర్య జేయ
పాకారికల్పక ప్రకరంబులర్పింపc దముజవరుండుకై డండ నిడగ
నరవాహనుండు నానగరి వెచ్చము పెట్ట, ఈశానుడువిభూతినెలమినీయ
సిద్ధ, కింపురుషాంగనల్, చేరి కొలువ వైభవంబున cజెలువొందువాడ తరుణి

ఉ. ఎత్తితి శంకరాచల మహీన బలమ్మున బంతిలాగునన్
మొత్తితి సర్వదిక్పతులc మూగిన గర్వమువిచ్చిపోయగా
నొత్తితి శత్రుభూపతుల నుగ్రరణంబునc భూమిద్రెళ్లగా
మొత్తితి భోగ కంతముల మోఘ జవంబున మేటి కీర్తులన్

తే.గీ. జడలు దాలిచి తపసుల చందముననను, తమ్ముడునుదాను ఘోర దుర్గమ్ములందు
కూరగాయలు కూడుగా గుడుచునట్టి, రాముడేరీతి లంకకు రాగలండు

మంజరులు – మోహిన

ఇంకగ జేయగలేరు సముద్రము – నీదగా నోపలేరు
పంకజముఖి దాటలేరు నరులెటువత్తురిటకు? రాలేరు
దానవు లెప్పుడుc పోరాటములో మానవులc గెలువగలరు
మానవు లెప్పుడు పోరాటములో దానవుల గెల్వలేరు

జగధీశుఁడు మానవుడననగరే? భుజశక్తిని నన్నెదురన్
నగధరుండో నగ భేదియొ కౌంతయు యగుదురు నాతో బోరన్

కం॥ నీకన్నుల సౌభాగ్యము, నీకుచములఁ గలుగు మేలు నీ ముఖ కాంతుల్
నీ కరముల లావణ్యము - నాకస్త్రీలందు లేవు నాకుంజూడన్

మ॥ సురకాంతల్ సరిరారు, యక్షసతులు న్నూటింపగా రారు,
కిన్నరభామల్సరిరారు సిద్ధవనితల్ న్యాయంబుగా బోల, రా
గరుడ స్త్రీల సమ్మానలెంతో చవుకల్, గంధర్వ లోలాక్షులున్
మరియేరీ నిను జెప్పి చెప్పతరుణుల్ మత్తే భకుంభస్తనీ.

మోహన ఆది

ప. ఒక సారి కన్నెత్తి చూడు - నామది నీతోకవగూడ గోరియల్లాడు న ॥న్నొక ॥

అ.ప శుకవాణి మృదుపాణి - సురుచిర బంబర వేణి, ఇకనేల? సరసాల నన్నేలవే
బాల ॥యొక్క॥

మి॥ మాటాడవేమెభామా! ఆపాటి మేముగామా! నీజోటికిసరిరామా, ఇంకేల
తడవులే లే ॥న్నొక॥

వ॥ తరుణీ! భయముడిగి మృదు మధుర వచనంబుల క్రీడాలంకారముగా
నాడుము.
బేడిసలనేలుకన్నుల నన్నొక సారి పరికింపుము, నాతో కాముకేళిన్సు పుమని,
నోటికి వచ్చిన మచ్చున ప్రేలుచున్న యానీచుని దుష్ట భాషణంబులకు
రోసి, తృణంబు చేపట్టి జనక భూపాలనందన యిట్లనియె

కం॥ పతిదైవముగా నెప్పుడు, మతి దలచుచునుండునట్టి మగువలఁజెరుపన్
ప్రతినగల యట్టి నీతో, ప్రతి వచనములాడుకంటె పాపము గలదే?

కం॥ పరదారాపేక్షకులగు, పురుషుల కాయువు నశించు, పుణ్యము జెడు, స
త్పురుషులు దూషింపగ తుది, నరకమునన్బడుదురనెడి న్యాయము వినవే?.

మంజరులు - శ్రీరాగం

తన సాహసంబుతానేగొనియాడు నతడు కడుహీనుండు,
నిను నీవే బొగడుకొంటి విననగునేనీ ప్రతాపమెుండు,
నీతి విరహితంబగు నీ భాషల నెంతయును గట్టిపెట్టి,
జాతి, నీతి నెరిగి మసలుకొనుమా! సత్క్రమమార్గము బట్టి

ఉ॥ సంగరరంగమందు కడు శౌర్యమునర్ రఘురాముతోడ, మా
తంగ, తురంగ, సద్భట, శతాంగ బలంబుల గూడి నీవు, పో
రంగను నోపకిప్పుడు, విరాధి ఖరాదుల పాటుఁ జూచియున్.
దొంగితినన్నుదెచ్చితివి, తుచ్ఛపు పల్కులు వల్క బాడియే.

సీ॥ కూకటి ముడికి నైకురులు గూడనినాడె, బెదరక తాటక పీచమడఁచె
గాధేయుడొనరించు క్రతువును రక్షింప, పెక్కంద్రదైత్యులనుక్కడంచెఁ
నవనిపై విలసిల్లునఖిల రాజన్యులు, ప్రేలజూపగలేని విల్లు విరిచెఁ
ఘోరాటవులలోనగ్రుమ్మరునప్పుడు, ఖరదూషణాది రాక్షసులఁజంపె

తేగీ అట్టి రామునకీవరయంగనెంత, లంకయననెంత? దనుజుల పొంకమెంత?
నీ వనగ నెంత నీలావు చేవయెంత? చెప్పనేటికి నీవె చూచెదవు గాక

శా॥ ఆరూఢ ప్రతిమానవిక్రమ కళాహంకార తేజోనిధిన్
శ్రీరామున్సుగుణాభిరాముఁదెగడన్జేకొన్న నిన్నాజిలో
దారన్దొంగిలితంచు నిష్ఠురగతిన్ దండించి, ఖండంప, ము
న్నీరెట్లైనను దాటివచ్చునలుకన్నేడెల్లి శాంతిపుమా

మోహన - ఆది

ప॥ వీరాలాపము లాడగానేల, వినుమా విశ్వప్రకాశంబుగనీ ॥వీ॥

అ.ప. పారావారముగట్టి రాఘవుడు , మీరన్గోపస్ఫూర్తి దీపింప
ఘోరాజినిన్నాసికల్మి కోటీరయుక్తముగ క్రూరాస్త్రంబుల
శిరములన్దునిమి భూతములకు నా హారమున్జేయు నిన్ను రావణా ॥వీ॥

వ. అనితన్ను జీరికిన్గొనక వీరాలాపంబులాడ, నారావణుండొడుపు దప్పిన
కాలాహి చందంబున నుగ్రుండై నుండిపడి యిట్లనియె.

మంజరులు - అఠాణా

ఆటుదిగాయనికూరిమిజూచిన - యలిగినన్నిట్లు లాడెన్
మాటాడకుండ నాలుకగోసిన, మానుకొనునోరు మూయున్
కుయ్యాడకనా ముందర బెదరక - కయ్యమునకు కాల్దువ్వెన్
దయ్యాలకు బలివెట్టెదన్నటికి, వ్రయ్యలుగానిది నొవ్వన్

కాకున్న దీని బల్మి నిపైకొని కాంక్ష దీరమరుకేళిన్
చేకొనకవిడిచిపెట్టినగనునే? ఛీ నవ్వుగాక హేళిన్

శా. భీమాటోప భుజప్రతాపమహిమన్ భీమాచలంబెత్తి,
సుత్రామాద్యష్టదిగీశసైన్యముల సంగ్రామంబులో నోర్చి, యు
ద్ధామ ప్రౌఢి చెలంగుచుండెడు కళాధాముండనా ముందటన్
రామున్నీమునిగొప్ప జెప్పఁనగరా? రాకేందుబింబాననా

సీ. అఖిలలోకముల నాయాజ్ఞ నిల్పితి నేక హేలను పుష్పకంబెక్కి తిరిగి
వేల్పుమూకల చేత వెట్టి జేయించితి దితి వంశవల్లభుల్ నుతులు జేయ
గణములతో గూడ కైలాస మెత్తితి, బటువైన పూవుల బంతి పగిది
వన జగర్భుని చేతవరములు గైకొంటి, దండిగానత్యుగ్రతపముసల్పి

తే.గీ. చెఱలు వట్టితి గంధర్వ సిద్ధసాధ్య, భుజగ సురయక్షకిన్నర ముఖ్య
సతుల ఇట్టి సామర్థ్య మెవరికేనాడు గలదు? మహిని నాకొక్కనికె గాక
మంజువాణి

తే॥ నాకునెదిరింప నొక పేదనరునినొడ్డి, వెఱవకీరితి దుర్భాషలఱచు దీని
జిహ్వ మొదలంటు బట్టియీ శితకఠారధార దునుమాడి ధారుణి భారవైతు

వ. అని చంద్రహాసంబు జంకించి, లేవనుంకించు తఱికొందరు
ప్రియసుందరులడ్డంబు సొచ్చి

## యమునా కల్యాణి - ఆది

ప. సురవరుడో? ధనంజయుడో? సూర్యకుమారుడో యాతుధానుడో ॥సు॥

అ.ప. శరవిభుండో? గాడ్పో... పుర, శాసనమిత్రుడో భోగి భోగుడో

మి. గురుభుజశక్తి గైకొనుచు, కోపము జూపcగc నీకు నెంతయు
త్తరుణిపయింబ్రతాపమున, దారుణకృత్యము సేయబూనగా ॥సుర॥

కం. ఏటికి మీరిటు గినియగ, గాటపు జంకెనయె జాలుగరవాలునకీ
యాటది యర్హమె? మమునీపాటికి మన్నించి కావుమా యిక చాలున్

వ. అనిశాంత వచనంబుల ప్రియంబు జెప్పిన, నప్పంకరుహాక్షుల విన్నపాలు మన్నించి, రాక్షస చక్రవర్తి వైదేహికి కావలియున్న ఏకజటా, ద్వి జటా, త్రిజటా, దుర్ముఖి, వాయుముఖి, శూర్పణఖలాదిగా గల దైత్యకామినుల వంక గనుంగొని

కం. గడువిచ్చితినిరుమాసము, లోడబరపుడునేర్చినట్లు లోడబడకున్నన్
గడికండలుగా గోసుక పడతులు భక్షింపుడింతి పలలంబంతన్

వ. అని, కోషారుణిత నేత్రుండై యతి భీషణాకారంబుదాల్చి పలికిన,

కం. తనపతి నిందించుటకును, దన ప్రియములు జెప్పఁవినక తక్కిన మీదన్
తనుజంపుడన్నమాటకు, నినకుల వల్లభునిదేవి ఏ డ్చెన్ బెలుచన్

సీ. జానకి శోకింప సాధ్యకిన్నర యక్షగరుడోరగా మరకాంతలెల్ల
వెంటనే శోకింప విని గంధవహు పుత్రుడాత్మలో చింతించియాగ్రహమున
నీ దుష్ట దైత్యుపై నిప్పుడేలంఘించి , చెండాడనా చేత జిక్కనేని?
కార్యంబులెస్సగుఁగాక సత్వము దూలి, బలువీడి వీనిచే బడితినేని

తే.గీ. సీతఁగానంగ లేక కృశించి రామ, భద్రుడడగిన, సీతయు, బ్రాణమెడయు,
లక్ష్మణుండును కూడనాలస్యము డిగి, తెగును నట్లైన కార్యంబు తెఱగుదప్పు

చ. అనిపవనాత్మజుండు, దివిజారి పయిందెగ వేళగాదు, భూ
తనయకు నాదురాక, వసుధావరుమేలు నెరుంగజెప్పి, మీ
దనుమతిఁజూతమంచు, నుచితస్థితి నూరకయుండె నప్పుడా
దనుజ విభుండు వోయెఁనిజధామముజేరఁ సతీసమేతుడై

వ. అప్పుడు యామినీ చరకామినులు రావణానుమతవుమ్మైన, ననేక విధమ్ములగు మధురాలాపంబు మిథిలాధీశు కుమారింగురించి, బోధించి, కార్యంబు సాధింప నోపక యలసి యుండుటంజూచి, యొక్కింత సేపు నిద్రించుచుండ మేల్కొని త్రిజటయను నిశాచరి యిట్లనియె.

హిం - దోడి - ఆది

అ. కలగంటినివ్వేనుడమ్మలారలం, కాపురమీయబ్ధిలో గలిసినటు ||కల||

అ.ప. కలలో దానవ నాథు బలము సంగరమునన్గూలిపోయినయటునే ||కల||

మి. కలనన్దశకంఠుడు గూలినయటు - గజముపై రాముడెక్కి వచ్చినటు ||కలన||
కలగంటి సీతన్గొనిపోయిన, చెలువున రక్కసి కాంతలారనే ||కల||

కం. శుద్ధాత్ముఁడైన రాముడు, శుద్ధాత్మపుదేవిఁగాన శుభ సూచకముల్
శుద్ధములు దోచుచున్నవి. సిద్ధంబీ మాట వేద సిద్ధాంతముగాన్

కం. కావున నిక్కోమలి యెడ కావలియున్నట్టి మీరు కఠినోక్తులుగా
సేవియు నాడకుడికనీ, దేవియ రక్షింప మనకు దిక్కగుమీదన్

ఆ.వె. అనుచుదనుజ కాంతలంతంత నెడబాసి, నిదుర బోయినంత నదరి సీత
తనకు దిక్కులేమి దలపోసి దుఃఖింప పవనసుతుడు మనుజ భాషఁ బలికె.

క. ఉన్నాడు లెస్స రాఘవు డున్నాడిదె కపుల గూడియురుగతి రాసై
యున్నాడు నిన్ను గొనిపో నున్నాడిది నిజమునమ్ము మూర్వీతనయా.

సీ. ఆ మాటలాలించి, భూమి జదనలోన, వెఱగంది శింశుపా వృక్షమరసి
చూడంగ నప్పుడు సూక్ష్మ రూపంబున, నొడిక మైశాఖలనడుమనున్న
కపికుమారునిరూపమపు రూపముగ జేసి స్వాంతంబులోన హర్షంబునొంది
దనుజమాయలచే తఁదఱచు వేగుటఁ జేసి, మాఱాడనేరక యూరకున్న

తే. భావమూహించి తన్నునాదేవియాత్మ నమ్మకుండుట తెలిసి యా కొమ్మమీది
నుండి క్రిందికి లంఘించి, నిండు భక్తి మ్రొక్కి నిలుచుండికరములుమోడ్చి పలికె

ఉ. తమ్ముని గూడి పుణ్యగుణధాముడు రాముడు వచ్చి మాల్యవం
తమ్మున సైన్య సంఘము ముదంబున గొల్వగ నుండి, భూమిపై
మిమ్ములఁజూచి, రండనుచు మేటికపీంద్రుల బుచ్చి, యందు మొ
త్తమ్ముగ మమ్ముగొందరను దక్షిణ భాగము జూడబంపుచున్

మంజరులు - కన్నడ

అంగన బొడగని నీయుంగర మీయంగలవాడనటంచు
యుంగరమంపెను శ్రీరఘుపుంగవుడుర్విజయిదిగో యనుచు
ఇచ్చిన న్గూచి సీతరాము ధరణీశ్వరు ముద్రిక యనుచు
మెచ్చియాత్మలోనెరిఁగి యెవండవో జెచ్చెరన్దెలుపుమనుచు
ఏల వచ్చితివో? ఎవరంపిరో నిను ఎల్ల వివరముగ జెప్పు
జాలినన్విశ్వ సించెద నిన్నున్నాగిక వలదో యప్పా.

వ.	అనిన నాంజనేయుండు

ఉ.	రాముని దాగురించి, నిను రావణుడెత్తుక వచ్చువేళ, నీ
హేమ విభూషణా వళుల నేర్పడ ఋష్యమహాద్రి పైచినన్
మేమవి దీసి దాచితిమి, మీపతి యచ్చటి కేగుదేరఁగా
దామరసాప్త నందనుడు తానవి జూపినఁ జూచి మెచ్చుచున్

సీ.	అర్క సంభవునకు నభయంబు దయచేసి దుందుభి కాయంబు దూలఁదన్ని
ఏడుతాడుల సర్వ మేకమ్ముగా ద్రుంచి, వాలినద్భుత శక్తిఁగూలనేసి
సుగ్రీవునకు దార సుదతిగా నిప్పించి , యంగదుఁయువరాజనంగ నిలిపి
వారలతోడను వానర సైన్యంబు, లెన్నని గొలువంగ నేగుదెంచి

తే.గీ.	మాల్యవంతంబునందుండి మనుజవిభుడు, నిన్ను వెదుకంగ నందర నన్నిదిశల
బనుచునప్పుడు దక్షిణ భాగమరయ, నంగదునితోడ కొందరమరుగు దేర.

తే.గీ.	వారి పంపుననవలీల వార్థి దాటి, వచ్చి సకలంబుజూచి యీ వంక గంటి
రావణుడు వచ్చి నిన్నునుగ్రంబుగాగ, బలుకునప్పుడు నున్నాడఁ బాదపమున

వ.	ఇవ్విధంబున బలుకుచుండినను నమ్మిక యుతనింగనుంగొని రాముడేరీతివాడో? యతని చందం బెరింగింపుమనవుడా వాయునందనుడు రఘునందనునకు వందనంబాచరించి భూమి నందనకిట్లనుచున్నాడు.

సి.	నీలమేఘచ్ఛాయబోలు దేహమువాడు, ధవళాబ్జ పత్ర నేత్రములవాడు
కంబుసన్నిభమైన కంఠంబు గలవాడు బాగైన యట్టి గుల్భముల వాడు
తిన్ననై కన్పట్టు దీర్ఘ బాహుల వాడు, ఘనమైన దుందుభిస్వనము వాడు.
పద్మరేఖలు గల్గు పదయుగంబుల వాడు, చక్కని పీన వక్షంబు వాడు

తే.గీ.	కపటమెఱుఁగని సత్య వాక్యముల వాడు, రమణి రాముండు శుభ లక్షణముల వాడు
ఇన్ని గుణములు రూపింప నెసఁగువాడు, వరుస సౌమిత్రి బంగారు వన్నెవాడు.

తే.గీ.	ఉరుత రాటవిలో నమహోగ్రతపము, వాయు దేవుని గురియించి వరుస జేసి
అంజనాదేవి గనియెనన్నర్థితోడఁనర్కజుని మంత్రి హనుమంతుడంద్రునన్ను.

వ.	అని ఇట్లు తాత్పర్యంబున బట్టునట్లుగా విన్నవించి, దేవీ! నీదేవుండయిన శ్రీరాముండు నా చేతికిచ్చియంపిననూత్న రత్నాంగుళీయకంబు నీకు సమర్పించితి

నింక నాకు రిక్త హస్తంబులడో జనుట దూతలకుచితమైన కార్యంబు గాదుగాననిన్నుదర్శించినందులకు శ్రీరామునకు నమ్మికబుట్టునట్లుగా, నీ శిరో రత్నంబుదయచేయ వలయుననుటయు నాకు శేశయన యిట్లనియె.

కం. నానాథుక్షేమమంతయు ధీవిధి నీచేత వింటి, దెలియగనైతిన్
నీ నిజ రూపము జూడకఁ నే నా రత్నంబునమ్మి నీకీనుజుమీ

వ. అనుటయు, నా హనుమంతుండు

కం. చుక్కలు తలపూవులుగా నక్కజముగ మేనుబెంచి, యంబర వీధిన్
నెక్కసమై చూపట్టిన, నక్కోమలి ముదమునందె నాత్మ స్థితికిన్

వంజరులు - శ్రీరాగం

చుక్కలు తలుపూవులుగా గదినికి యక్కజముగమేన్వెంచెఁ
వెక్కసమై చూపట్టుముదమందె నక్కోమలి మదినెంతన్
ఇటుల మహోన్నత రూపంబు జూపి ఎప్పటి యట్టుల మరలన్
చటులగతిఁదొంటి కూపము దాలిచి సమీర తనయుడు భక్తిన్
అంజలి ఘటియించిన జానకి యత్యంతముదంబునఁ మెచ్చి
రంజిత మౌతన శిరో రత్నమును రమణి మారుతికినిచ్చి

చ. రవికుల వార్ధి చంద్రుడగు రాముని సేమము చాల వింటి, నా
వివిధములైన పాట్లు పృథివీ పతికిన్దగజెప్పగల్గె, నే
డవిరళ భంగి నీ వలన నచ్చుగ, నే నుపకారమేమియున్
దవిలి యొనర్పలేను వసుధాస్థలి వర్థిలు బ్రహ్మ కల్పముల్

వ. ఇట్లు దీవించిమఱియును.

కం. ఏయెడ జూచినఁధరణీ, నాయకు శ్రీపాదయుగము నాచిత్తములో
బాయదని విన్నవింపుము, వాయు తనూజుండపుణ్యవంతుడదెలియన్

తే.గీ. ఇపుడు రావణుడరుదెంచి, కపటు బుద్ధి, గర్వమున జేసి నన్నెన్ని కాఱులాడె
నన్నియును నీవు చెవులార విన్నతెఱగు, పతికి దయబుట్టగా విన్నపంబు జేయు

సీ. నిడుదపున్నెఱివేణి జడలుగా సవరించి, మలిన చీనాంబరం బొలియగట్టి
భూమీరజంబు విభూతి పూతగ బూసి, తన దివ్యమూర్తి చిత్తమున నిల్పి
నిరశన స్థితి తోడ నిల్చి భూశయ్యను, బవళించి నిదురయేర్పడగ విడిచి

తారక బ్రహ్మమంత్రంబు పఠించుచు, కఠిన రాక్షసిదుర్భ్రగములలోన

తే.గీ. సహిత లంకా నగర ద్వీపగహనసీమ, తపము జేయుచునున్నాను తన్ను గూర్చి
నాకు ప్రత్యక్షమగుమని నాథునకును, విన్నవింపుము సత్వసంపన్న నీవు.

వ. అని చెప్పి మఱియును,

వంజరుల - శివరంజని

తల్లి వలెన్నను, రామునిన్గన్న, తండ్రి రీతి మదినెంచి,
ఎల్లవేళలన్గడు భయభక్తుల - నుల్లంబున బూజించి,
వినయమున గొల్బుముద్దుమఱిది నవివేకమున దూలనాడి
అనుభవ మందితినాపాపఫలమున హాహా ఇట్లుల్లాడి
మఱచి నన్ను మన్నింపు మాయనుచు మఱి మఱి నీవు వచించి
సరగున రామునితోడరమ్మనుము సౌమిత్రిని దయయుంచి

వ. అని యిట్లు జనక రాజతనయం, పలికిన పలుకులాలకించి,
హనుమంతుండాజననితోడ నిట్లనియె.

కం. ఇనుడుదయించకమున్నే, వననిధిలంఘించి మనుజవల్లభుకడకున్
నినుగొని పోయెద వీపున, జననీ కూర్చుండు మనిన సంతోషమునన్

కం. నీవంత వాడవగుదువు, నీవెంటనెవత్తునేని నెగడవు కీర్తుల్
రావణుని కన్నమిక్కిలి, భూవరుడే దొంగయంద్రు బుధనుతచరితా

వ. అదియునుగాక రామచంద్రుని దప్పనితరుల నంటుదానను గాను గాన
నీతో వచ్చుటతగదు, మఱియును.

కం. దొంగిలి తెచ్చిన దైత్యుని, సంగడులగు వారి వారి సాహస మొప్పన్
సంగరముఖమున జంపక, దొంగిలి కొని పోవదగునె దొరలకు నెందుర్

వ. మఱియుఁరామచంద్రుండు త్రిజగదేక విరుండును, కోదండ దీక్షా
గురుండును, రాక్షస కులాంతకుండునగుటం జేసి, రాణివాస ద్రోహియగు
రావణుని సంగరరంగంబున ప్రఖ్యాతంబుగా జంపి, కొని పోవుట ధర్మంబు,
నీవు రామచంద్రునకు పరమభృత్యుడవగుటంజేసి, నీవెంట నరుగుదెంచుట
తప్పుగాక పోయినను, పగదీర్చక వచ్చుటుచితంబు గాదు. కావున, నీవు
రాఘవేశ్వరులకిన్నియుందెలియవిన్నపంబు జేసి తడయక తోడ్కొని రమ్మనిన
నద్దేవికి నమస్కరించి హనుమంతుండిట్లనియె.

ఉ. నీ విభుడబ్ధిదాటి, ధరణీతల నాథులు సన్నుతింప, సు
గ్రీవ సుషేణ ముఖ్య బలబృందముతో నరుదెంచి, నీచునిన్
రావణునాజిలో దునిమి, రాజసమొప్పగ నిన్ను గొంచు, సే
నావళితోడ నీ పురికి నారయ నేగు నిజంబు నమ్ముమా!

వ. అని విన్నవించి, నమ్రుడై యద్దేవిచేత దీవెనలంది మఱలుచున్నవాడై తన శక్తి రావణునకెరుగ జేయదలచినవాడై

సురటి - జంపె

ప. మంగళము శ్రీరామ - మహనీయ గుణధామ ॥మం॥

అ. మంగళము రఘురామ - మానిత పరంధామ ॥మం॥

చ. మంగళము శివధనుర్భంగ - లలితాంగ జయ ॥మం॥
మంగళమునవకోమలాంగ సదయాంతరంగ ॥మం॥

కం. రామా! రఘుకుల జలనిధి, సోమా! సంగుణాభిరామ, సుందర రామా
రామా! నవ్యాంబుద ఘనశ్యామా! రణ రంగభీమ! జానకి రామా!

వ. ఆంజనేయుండు జానకిచే నాశీస్సులంది, మఱలుచున్నవాడై తన రాక రావణున కెఱుగ జేయవలయునని తలంచి,

సీ. మేదిని సమముగా మేడలు గావించి, కేళీగృహంబుల నేల గలిపి,
కమలా కరంబులు కలఁచి గారలు పెట్టి, వృక్షజాతంబుల విఱుగదన్ని.
పుష్పగుచ్ఛంబుల పుడికి పారగవైచి, తేనెలు రాల్చి పూదేనెలుడిపి
పొదరిండ్ల పొడవులు జదియగా నుగ్గాడి, చప్పరంబులనేలచదును జేసి,

తే.గీ. వనముఁగాచెడి రాక్షస వర్గములను, వీర వరులను ఎనుబది వేల జంప
సీతఁగాచెడి రాక్షస స్త్రీలు బెదరి, పాఱిపోయిరి రావణుపాలికంత

వ. రావణుంజేరి,

మంజరులు - మాండ్

దేవా! నేడొక మర్కటుండు ఏ తీరున వచ్చెనో? సీతా
దేవిన్గని మాటాడి వనము నెంతే జెఱచెన్ మానేతా
వనముఁ జెఱచి ప్రోవులనిడియంతట వనపాలకులందరినిన్
ఘనభుజశక్తిన్ యొకని బోనీక గడతేర్చె నెల్ల వారిన్

అతుల శౌర్యధైర్య సాహసుండ సమానుడు కాలాంతకుడు
ప్రతి జెప్పగ వీల్గాని దోర్బలుడు ప్రళయ కాల భైరవుడు
అని విన్నవింప రావణుండు రోషాగ్నులు నకులఁరాల
మనమునన్దలచి రాముఁదూతయని మండి పడుచు బోద్రోల
పనిపెఁపదివేల రాక్షసుల వాని బట్టి పల్లార్పఁగోరి
జని రక్కసులుగ్రంబున దాకిరి సమీర తనయున్ బోరిఁ

ఉ. తాకిన యంత వానరుడు, తానదలించి, కఠోర రేఖతో
వీకనెదిర్చి పేర్చి, రణ వీధిని శాచర సైన్యమెల్లనో
క్కాకున వెంటునంటి సమదోగ్రబలంబున బాఱ బాఱగా
తోకనుజుట్టి మోదె , బలుదుర్దములన్దునుమాడె నందరన్

కం. అందునఁజావకఁ మిగిలిన, కొందరు బరదెంచి యసుర కొల్వున మొఱ్ఱో
యందర మ్రింగెను దానవులందరకును వీడు డారుణాంతకుడనుచున్

వ. విన్నవించిన, రాక్షసేశ్వరుండగు రావణుండు మండిపడి, పింగళాక్షుని, దీర్ఘజిహర్వుని, నశ్మవకుని, శార్దూల ముఖుని, వక్రవాసుఁబనిచిన వారును తమ తమ బలంబులఁగూడుకొని, రథారూఢులైవచ్చి, యార్చుచుండాకి, శస్త్రాస్త్రములడరించిన నవియెల్ల బలువిడిగా ద్రుంచి, లెక్కగొనకయ క్కరువలి కొడుకు దర్పంబునఁబేర్చివాల మల్లార్చి, ఎదిర్చిన బలమ్మును బలు విడిగా దోలి పింగళాకుని ద్రుంచి, దీర్ఘబాహుల్షీర్ఘ నిద్రఁ బుచ్చి, వక్రవాసుని పరాక్రమంబునఁ జూర్ణంబుజేసి శార్దూలముఖుని మర్దించి, నిర్వక్రమ పరాక్రమంబున గర్వించి మరలి మకరతోరణము నారోహించి, యార్చుచున్న సమయంబున,

కం. చావక మిగిలిన దైత్యులు రావణుకడకుయేగి వేగరాహుత్తుల పాట్లా వాయుజుసాహసమును, పేవిధమున జెప్పనతడు విస్మయపడుచున్

మ. కుటిల భ్రూకుటిదుర్నిరీక్షణ ములన్ క్రోధానల జ్వాలలు
త్కటమై బర్వగ, మంత్రి సూనుల మహాగర్వాంధులన్, గ్రూరుల
న్పటు బాహాబలులార్వ్వరన్ బనిచె శుంభద్విక్రమాటోపమ
ర్కట పారీంద్రముమీద నుద్దవిడి సంగ్రామంబుగా వింపగన్

వ. ఇట్లు బనిచిన నా యార్వ్వురును.

సీ. శతకోటి విక్రమ ప్రతి మానుడైనట్టి, కోపానిలాఖిల సాహసుడైన
శత జిహ్వుడత్యంతసాహసుండు
రోషానలాఖిలశేషాహియైనట్టి రుధిరాక్షుండత్యు గ్రరూపయుతుడు
పర సైన్య శాసన పావకుండైనట్టి, రక్త రోముడు, మహోక్షణ బలుండు
కఠిన శాత్రవలోక గజసింహుడైనట్టి, శూల దంష్ట్రుడు లయ కాలయముడు
తే.గీ. వ్యాఘ్రకబళుండు పృథుతరవైరి జయుడు, స్తనిత హస్తుండు సాహసోదార
బలుడు, వీరలార్వురునత్యుగ్రవేషములను, రూఢివెడలిరి ఘనరథారూఢులగుచు.
కం. తమ తమ బిరుదులు నెరపుచు, తమ కంబున వెడలిరధిక తండముగొలువన్
ఘుమఘుమ భేరీశకసంభ్రమములతో మంత్రి సుతులు పావని మీదన్.
ఇట్లు గదిసి, సింహనాదంబు లంబరమునన్నెలంగ, గజ, తురగ, శతాంగ,
సుభటనికరంబులం గూడి శస్త్రాస్త్రంబులంబొదివిన.
గీ. వాలమల్లార్చి బ్రహ్మాండ గోళమెల్ల, పగులనార్చుచు భుజయుగం బప్పళించి,
రణముచేయంగ మకరతోరణముడిగ్గి, మంతుకెక్కిన యాహనుమంతుడంత.

అఠాణా - ఖండగతి

ప. ఒక్కొక్క రథములో నొక్కొక్క యరదమును ॥ఒక్కొక్క॥
పెక్కు తునియలు గాగ, తుక్కుతుక్కుగ గొట్టి ॥యొక్కొక్క॥
అ. ఒక్కొక్క గజముతో. నొక్కొక్క వారణము ॥ యొక్కొక్క॥
నుక్కడంగగ బట్టి. ముక్కు ముక్కలు గొట్టి ॥ యొక్కొక్క॥
ఒక్కొక్క యశ్వముతో మరొక్కక యశ్వమంబునన్ ఒక్కొక్క
యోజునితో మరొక్క భటుని గొట్టెన్ ॥ ఒక్కొక్క॥
వ. ఇట్లు బాహు బలమే పారగా, (త్రిపుట (అఠాణా)
ప. హత మొనర్చెను యంజనీసుతు -డసురవర్గము నాహవమ్మున
అ.ప. సతమతంబుగ మంత్రులార్వుర చావగా గజయూథములతో ॥హత॥
ము. అతుల బలాన్వియలగు భటులను, యశ్వంబుల రథకేతనముల ॥ అరు॥
నతికుతుకంబులనెగురంగను, అంబర వీధికి వైచుచును. ॥ హత ॥
చ. మకరతోరణమున విక్రమమ్ము, మెఱయ, భీకరాకారుడై
మూకమూకలు జావమిగిలిన, సోకు మూకలుగొందరటుపై
మి. అక్కటకట జచ్చిరి యందరు, హా! యింకెవ్వరు బ్రదుకగలరు. ॥అ॥

దిక్కేది కదశకంఠా యని, దీనులగుచు రావణు జేరగను ॥ హత॥

వ. వారి పాటు విని, రావణాసురు డదరిపడి, యాజ్యాహుతింబ్రజ్వరిల్లు హుతాశనుఁ బోలి మండిపడి ప్రహస్త తనూజుండగు జంబుమాలిన్గని, నీవా వానరాధముని వధించి శీఘ్రమ్మున రమ్మనిపంచిన।

ఉ. అప్పుడు జంబుమాలి, భయదాకృతి! వీరరసాప్తి గన్నులన్
నిప్పులు రాల బేరలుక నిండగఁ నూర్పులు బర్వఁ చిత్రమై
యొప్పుగరోప్పుచున్, రణమహోత్సకుడై గజరాజబృందముల్
విప్పుగ వెంటరాగ, కపివీరు నెదుర్కొనె విక్రమంబునన్.

కం. అదలించి వాయునందను, ప్రదరంబుల నేయునంత, పవనజుడలుకన్
గొదగొని బలములనన్నిటిఁ, జదియంగా మోదెనొక్క సాలముడోర్ల

ఆ.వె. రథము నుగ్గుజేసి రథసారథిని జంపి, రథతురంగమములఁ పృథుల శక్తి,
బట్టి వాలమునను బడగొట్టి చంపిన, జంబుమాలిగినిసి సాహసమున.

## మంజరులు - కన్నడ

అడిదంబున్గదయున్నొనిపుడమికి - కడుడేగ మెలంఘించి,
యెడపక వాయుజునిటలమున వ్రేసి - నెంతయున్మూర్ఛ ముంచి
నంత తెలివి నంది యాంజనేయుడు - యంతక సన్నిభుడగుచు
నంతమొందించెజంబు మాలి నత్యంత కోపోక్షుడగుచు యత్యంత బలశాలి
జంబుమాలియత్యంత బలశాలి జచ్చుట విని రావణుడు
డంబు మీరయాగ్రహమున నక్షకుమారునంప నాఘనుడు

సీ. చిత్రమాణిక్య రంజిత నేత్ర విభవంబు, భాను కోటి ప్రభాభాసితంబు
భీకర ధ్వజదండ బిరుదాలవాలంబు, శస్త్రాస్త్రపరికర రసంయుతంబు
బంధు రాధిక జనబహుహయో పేతంబు, కుటిలదిక్పాలదృగ్గోచరంబు
ఘననభోమార్గ విఖ్యాతైక గమనంబు, వరతపోలబ్ధాతి వైభవంబు

తే.గీ. నైన రథ మెక్కి మదవారణాఘసుభట, వీరహుంకార ఝుంకారవారములియ
కదలె హనుమంతుపైకి నాగ్రహమెసంగ, ముదముద్దైవార నక్షకుమారుడలుక.

కం. అటుజనిపావనిఁగని దిక్తటములు సెదరంగ నార్చిదండడి భూభృ
త్తట ముపయిగురియువర్షోత్కట ధారల రీతి నంపధారలు గురిసెన్.

ఉ. వాయుజు డప్పుడంపగమి వాలముఖంబున దెంచె తెంచినన్
వాయుజు మీద గ్రమ్మరనవార్య బలమ్మున నేసె యేసినన్
వాయుజుడుగ్రుడై దునిమె వాని శరావళి నెల్ల బిమ్మటన్
వాయుజు నాటనే సెcగడు వాడి శరమ్ములనక్షుడుద్ధతిన్

వ. ఇట్లేసిన,

ఉ. తాల మహీజరాజిని రథంబును గూలగ మోదె, మోదినన్
నేలబదాతియై నిలిచి, నేర్పుగ వాcడు శరాళిమారుతిన్
ఫాలము నొంచె, నొంచినను పావని మూర్ఛిలి తేరి దానవున్
దూలగ ముష్టిచే బొడిచే దోర్బల శక్తిరథాంగణమ్మునన్

కన్నడ - ఖండగతి

ప. పొడిచిన న్మూర్ఛిల్లి - వడిదేరి దైత్యుండు,
వడముడిన్గదనుగోనివై చెవక్షముబగుల. ॥పొ॥

అ.ప. వడినాంజనేయుండు వాని అక్షముబగుల, నె చెనాగద తోడ ప్రక్కలైపోవంగ,

మి. కడువడి నక్షయుడాకసమున కెగురన్వడ, ముడియున్వెను వెంటన్
దోడ్తోడ ఎగసెన్ ॥పొడి॥

చ. గదను గొనివై చెనక్షయ డాంజనేయునిన్, గద ద్రుంచె మారుతి, ఖడ్గమున
మారుతిన్ యూరువుల్ నొవ్వంగ నొచ్చి సోలుచు కపి
వరుడాతనింబట్టి వసుధకున్డలివెట్టె ॥పొడి॥

అంత హతశేషులగు వారలరుగుదెంచి, సంభ్రమంబున దానవ చక్రవర్తిని గాంచికొలువెల్ల సందడిగాగనప్పు, డాంజనేయుని బహు విధంబుల ప్రస్తుతించి,

మంజరులు - ముఖారి

అక్షుడుదెగెనశ్మవక్షుండు దెగటారెరక్తరోముండు
రక్షణ లేక నెస్త నితహస్తుండు - రాలె శార్దూలముఖుడు
చచ్చెcశార్దూలకంబళండు జచ్చె - శతగమాయుదుర్జయుడు
జచ్చె, వక్రనాసుండు కడతేరె, చచ్చెరక్త నాసుండు
నేలగూలెయూ పాక్షుడుంజంబు మాలి శూలదంష్ట్రుండు

బిలము జొచ్చె పింగళాక్షుడున్నా-వలివర్గముతో నేడు

వ. అని వేఱు వేఱ విన్న వించినన సురేంద్రుండు విని తనమనమ్మున.

మత్తకోకిల.

వీనివానరుడంచు నిక్కము - విశ్వసింపగజెల్లదీ
దానవావళిc బ్రింగcబుట్టిన దయ్యు మోయటుగాకవై
శ్వానరుంటిటువంటి రూపున వచ్చి నిల్చెనో గాక యీ,
మేను గైకొని విష్ణుడీడకు మేటి యైచనుదెంచెనో?

మత్తకోకిల

కాక ఏవరమ్మైన నాకఱకంఘుcడిచ్చిన నుబ్బియా
నాకవల్లభుడెల్ల కాలము నాకు నోడిన భీతిమై
లోకభీకరమ్మైన రాక్షస లోకమెల్లనడంపగా
నీకరాళిపురూపు నిప్పుడయీడకంపగ వచ్చెనో?

మత్తకోకిల

కాక తక్కిన వారలెల్లరు గర్వ సంపద మీఱగా
నాకు ఢీకొని ధాకతోడరణంబు చేయcగ వచ్చెనో?
లోకమందెటు క్రోతులెక్కడ లోర్చుదానవ వీరులన్
జోకవీనికి గల్గనేనియు, జూఱవుచ్చెద సర్వమున్.

వ. ఇట్లనేక ప్రకారంబులc జింతించి, యుక్షయుకువూరుందలంచి, పలుతెఱంగుల విలపించుచున్న తండ్రి న్గాంచి, మేఘనాథుండిట్లనియె.

కం. దేవతల తోడ గూడను, దేవేంద్రుని గెల్చినట్టి దేవరకున్ మీ
కీవగపేటికి నేటికి, దేవాచిత్తంబు లోన దీనుని భంగిన్.

కం. వానరుని కొండజేసుక,పూనికచింతియనేల భుజబలశ్రీన్వానింజయెద నొండెను,
దీనుని గావించి పట్టితెచ్చెద నొండెన్

వ. నావుడు రాక్షసేశ్వరుండతని కూటులకునలరి, నీవు విరించి వరదత్త ప్రతాపహుతాశనుండవు. చాప విద్యా ప్రవీణుండవు, తపోబల సమర్థుండవు. దేవేంద్ర గర్వ విమర్దనుండవు. మత్సమానశౌర్య చాతుర్యుండవుగావున నీకసాధ్యంబగు కార్యంబెద్దియున్లేదు. నీవిపుడ పోయి వాని సాధించిరమ్మని పంచిన,

సీ. మాణిక్యతపనీయ మయ విమానము తోడ, కెంబట్టు బిరుదుటెక్కెంబు
తోడ సరిజెప్పగారాని శస్త్రాస్త్రములతోడ, బలమైన దివ్య చాపంబుతోడ
సాహసకోవిదుండైన సారథి తోడ, ఘనసత్వ జవతురంగములతోడ
గనుపట్టి దిక్కుల గగన యానము తోడ, బాలసూర్యోదయ ప్రభల తోడ

తే.గీ. కరము విలసిల్లు రథ మెక్కి గంధనాగ, తురగ, రథ, భట వంది
సందోహపటహ, శంఖ, కాహళ దుందుభి స్వనము, లొలయ,
మేఘనాథుండు హనుమంతు మీద వెడలె.

లయగ్రాహింపెక్కులగు గుఱ్ఱములు బొక్కపు రథంబులును, నెక్కువగు సేనుగులు క్రిక్కిరిసి
రాగా, రక్కసుల చేరి ఇరుప్రక్కలను గొల్వఁగను, నుక్కువకు మీరి చల
మెక్కుడు గనంతన్

గ్రక్కదల భూతలము చుక్కలొ గిరాల శిలలుక్క సిలినాదములు పిక్కటిలి
మ్రోయన్, డెక్కెముల మించి జనమెక్కుడుగ జూపుదళమక్క జముగా నడువ
దిక్కులు వంకిర్.

వ. ఇట్లు భయంకరాకారంబున వెడలి, కంఠ హ్యాంకృతులును, భేరీ భాంకృ
తులును, నంబరము న జెలంగ బొంగి చనుదెంచుచున్న రాక్షస
సైన్యమున్గనుంగొని, హనుమంతుండు తోరణ స్తంభంబుపై నుండి, బధిరీ భూత
దిగంతంబుగా భీకర గతి నార్చిన.

అభేరి - ఆది

ప. కలగెను దేవగణంబుల్, గిరులును, చలనము బొందెను ఘూర్ణిలె జలధుల్ ॥కల॥
అ.ప. జలబాష్ప చంద్రలొదుగన్, వరియలై జలధరములు చదలంబర్వెన్ వడి ॥కల॥
మి. జలజల చుక్కలు రాలెన్, దిగ్గజములు గడగడయల్లాడెన్, దిక్కుల
బలువు దప్పి తిరుగాడెన్ ధరణియు, చెలువువీడి వణకాడెన్, భయమున ॥కల॥

మంజరులు - బిలహరి

నిప్పులు వర్షించెడి నిశితాస్త్రము - లప్పుడు దానవవీరుల్
గప్పిరి కెందొగ వానలఁ గప్పిన - ఘనశైలంబుల బోలన్
అంపవర్షములు కపివరు మీదన్, జొంపములలీల గుఱియన్
తెంపునన్ లెక్క గొనక లంఘించి, ధీరుడు రోషము మెఱయన్.

వ. అద్భుతంబుగా వాల మల్లార్చి, యొక మహాసాలమెత్తి

గీ. వరయూధముల మీదగ విసిమావంతుల, తోడ గూడగ బట్టి తునియగొట్టి
గుఱ్ఱంపు హౌజులకును దాటి రౌతుల, గలయంగ బట్టి చెక్కలుగ గొట్టి
రథముల పైకి నుగ్రంబుగా లంఘించి, రథికులతో గూడ రసను గొట్టి,
బలముల మీద నిబ్బరముగా గుప్పించి, వాలముఖంబున దూలగొట్టి

తే.గీ. పటహ, నిస్సాణ, కాహళ, పటిమలు రియ ద్రొక్కి శస్త్రాస్త్ర నిచయముల్
తుమురు జేసి, చత్రములఁ ద్రుంచి పడగల సత్వమడచి, పవనసూ
నుండు సాహస ప్రౌఢి మెఱసెఁ.

వ. అట్టి సమయంబున,

చ. అనలము రీతి మండి, దివిజారిత నూజుడు తేరు దోలియ
య్యనిలజు మీద నేసె వివిధా యుధ పంక్తులఁ వానినెల్లదు
త్తునియలు జెసె వాయుజుడు దోర్బలశక్తిని దైత్యుడేయఁదో
కనుదును మాడె వాని విశిఖంబుల నన్నిటిఁ వాయు సూనుడున్

కం. గిరులను వందల కొలదిగ, దరువులు సేయంగ గినిసి దానవుడంతన్.
దురమున నడుమనె ద్రుంచెను, శరజాలము చేతనొక్క క్షణమునవానిన్

తే.గీ. గంధవహుఁ పుత్రుడంత నాగ్రహముతోడ, రథము గూలఁగదన్ని సారథిని
జంపి, గుఱ్ఱముల గూల్చి కేతువు కూలనడపఁ మేఘనాథుండు గినిసి
సమీరసుతుని,

వ. అహాంకారమున ప్రతిఘటించి.

మంజరులు - భైరవి

వాయువ్యాస్త్రము మేఘనాథుండు - వాయుజుమీదికి వైవఁ
వాయు వ్యాస్త్రము కరుణతోడనా - వాయుజుదాకక పోవ
రౌద్రంబడరఁగ నేసెనతనిపై - రుద్రాస్త్రంబున గాథ
రుద్రుని యంశంబగుట న్దొలగెన్ - దుద్రాస్త్రంబును గూడ

వ. అమ్మహాస్త్రంబు గూడ దొలంగిన నాశ్చర్యంబున్జెంది, ఇంద్రజిత్తు
యంజనీ తనయున్గాంచి.

మోహన - ఆది

ప. తప్పించుకొనలేవురా - తరచరా॥త॥ తప్పించుకొనగనీతరయుగాదురా
బ్రహ్మాస్త్రంబిది ॥తప్పిం॥

అ.ప. తప్పించుకొనలేవు - తప్పదు చావునీ, కిప్పుడు నీపప్పులేమి యునుడుకవురా ॥తప్పిం॥

మి. ఇప్పుడెందుబోదువురా, నీటు ప్పాలిక సాగవురా.. నీ ॥విప్పు॥
డప్పులు చాలించుమురా, నిన్నిప్పుడెబరి మార్చెదరా తరుచర ॥తప్పి॥

వ. అనిపల్కి

కం. సుర, ఖచర, యక్ష, కిన్నర, గరు,డోరగ, సిద్ధ, సాధ్య, గంధర్వగణం
బరుదంది చూడగా నిర్భరముష్టిందొడిగి యేసెఁ(బహ్మాస్త్రంబున్

వ. అట్టి సమయంబున

కం. సప్తాంబోధులు గలగెను, సప్త ద్వీపములు వడఁకె శైలముల దరెన్
సప్తానిలములు దలకెను, సప్తాశ్వుడు(మాను వడియె జగములు గదలెన్

వ. ఇట్లనేక (ప్రకారంబులఁకాలాగ్ని తెఱంగున వెడలి, మిడుంగురులు చెదరి పడగ (బహ్మాండమండలముంబట్టుకొనునట్టివెను మంటలుప్పరంబెగయ, నేతెంచు (బహ్మాస్త్రంబున్గని హనుమంతుడు తనమనంబున

ఆ.వె. తనకు చిన్న నాడు దయచేసినటువంటి, వనజ గర్భుచేత వరము దలచి
(బహ్మమం(త్రమపుడు పఠియింప నదిజంప, కతని గట్టి వైచె నవని మీద

వ. ఇట్లు కట్టువడిన కరువలి పు(త్రుని న్జూచి, రావణాసురుని పట్టి తనలో నిట్లనుకొనియె.

## మోహన - ఆది

ప. ఆశ్చర్యమాశ్చర్యము ఈతని మహాత్మ్యం ॥ఆశ్చ॥

అ.ప. ఆశ్చర్యమాశ్చర్యమజుని యస్త్రమనోర్చి, యసువుల నెడబాయకాహా(బతికి యుండు ॥ఆశ్చ॥

చ. (బతుకగా లేడెట్టి బలవంతుడే గాని, (బతికి యున్నాడెట్టి బలవంతుడో వీని
బలమునకు రాక్షస బలమంతయును జచ్చెఁ బలవంతులకు వీడు
బలవంతుడని తోచు ॥ఆశ్చ॥

## మంజరులు - మోహన

అట్టి బలయుతుడు నా చేత జిక్కె, నహానే! నెనే మొనగాడ
పట్టి నాతం(డి ముందు బెట్టెదన్, భళి! భళి! (ప్రాణముతోడ

పెక్కం డ్రదనుజవీరులంబట్టి - జక్కాడెసాహసమున
జిక్కె నా చేత బ్రహ్మాస్త్రమునకు జేర్తుకొల్వు కూటమున
అని తన్ను దాను బొగడుకొనుచు నయ్యసుర వీరుండు వేగ
ఘనరథఘోటక దంతి పదాతులు - గదసి తనవెంట రాగ,

వ. భేరీ భాంకృతులతో, భీకరకాహళరవములతో శంఖనినాదములతో, నారీ టంకారమ్ములతో తళతళన్మెరయుకేతనములతో, మిగిలిన రథ గజ తురగ, పదాతి దళములు యస్త్ర, శస్త్ర, సమేతులయి రాగా, మిన్ను ముట్టెడినుహోట్టహాసార్భటులతో, నాంజనేయునిగాంచిపోయి రావణాసురుని సమ్ముఖమ్మునంబెట్టినన్గాడ్పుపట్టింగని,

కం. కుటిల భ్రూకిటి నటనస్ఫుటఘామ విలాస నవ్య పూత్కృతిజనితో,
ద్భటరోషానలకీలోత్కట నేత్రుండగుచు బలికె గటముల దురగన్

ఉ. ఎవ్వడవోరి? నీకు ప్రభువెవ్వడు? జెప్పుము, నీ విటొంటిమై
నివ్వన రాశిదాటి, యిటకేగతివచ్చితి, నామమేమి? నీ
వెవ్వని ప్రాపునంబెరికి తీవనమంతయు? శంకలేక? యిం
కెవ్వని ప్రాపునందునిమితీసురవైరుల నెల్లనుగ్రతన్?

సీ. అమర వల్లభు భోగమంతయు గైకొని, వీతి హోత్రుని సిరి నీటు ముంచి
జమునికింకరులను సంహార మొనరించి, రాక్షసాధీశ్వరు శిక్షజేసి
యంబోధినాధుని గాంభీర్యమడగించి, దోర్బలంబున గాలి దూలబెట్టి
విత్తనాధుని మహా విభవంబు గొల్లాడి, శూలహస్తుని నొక్కమూలకదిమి

తే.గీ. అమర, కిన్నర, గంధర్వ, యక్ష, భుజగ, గరుడ గుహ్యక, ముని సిద్ధవరుల నెల్లఁ
బట్టి, మునువెట్టి జేయించునట్టినన్ను, విన్నయంతనె గుండెలు వ్రీలవెట్లు?

మంజరులు - అఠాణా

శరనిధిన్దాటి వచ్చుట జాలక, చాల నాపురిన్జొచ్చి,
వెరవకన్మేటి బంటువై వనము వ్రేళ్లతో గూడవ్రచ్చి
బిరుదు మగండవు బోలె రాక్షసుల పెక్కండ్రనుక్కడంచి,
కరగరితోడన్నా యెదురన్నహహ గర్వము మీరగ నిల్చి

వ. అదరు బెదరు లేకుంటి వౌరా!

మోహన - ఆది

వ. ఖండింతునీ చేతులన్, వానరా, ॥ఖం॥

అ.ప ఖండింతు నీ నడుము రెండు తుండెలు గాగ ॥ఖం॥

మి. చెండించెదనీ కండలన్, రుచిగ, వండింతును చమురులోన రక్కసి తండమునకు విందుజేతు జూడుము, మొండీ మరియెన్నడు రాకుండగ ॥ఖం॥

వ. ఇట్లు పట్టరాని కోపంబున నాటోపంబుగా బల్కుచున్న రావణాసురుంజీరి కింగొనక హనుమంతుండిట్లనియె.

కం. ఇనతనయుని వరమంత్రిని, జనపతియైనట్టి రామచంద్రుని దూతన్ ఘనుడగువాయుకుమారుడఁ హనుమంతుండంద్రుడునన్ను నార్యులు దిశలన్

కం. రాముని పంపున వచ్చితి, రాముని సేమంబు నిందురంజిల్లెడియా రాముని సతికెరిగించితి, రాముని కడకేగుచుండి రాజసవృత్తిన్

కం. నారాకమీకు డెలుపఁగ బీరంబున వనము గలయ బెరికితిశక్తిఁ ఘొ రాజినన్ను నెదిరిన, వారల జంపితినియముని పట్టుము జూడన్

షణ్ముఖ ప్రియ - ఆది

ప. బెదరింతువా? నన్ను రావణా? నీ బెదరింపులకు నేను బెదరువాడనుగాను ॥బెద॥

అ. మదినెంచితివొ? నీకుమారు బలముననన్ను
ఎదిరించి కొని తెచ్చి ఇటునుంచెనని నీవు? ॥బెద॥

మి. ఎదనెంచుము నిన్ననితిరిగిపోదు, గదయనిచిక్కితినంతె మఱియు నీ విధము దెలిసికొంటినేను జెప్పెడి. హితమునాలకింపు బ్రనుకనెంచిన ॥బెద॥

చ. ఘనుడవు, నీతి మంతుడవు, కార్య మెఱుంగుదు సాహసంబునన్
నిను నెదిరించి పోరుటకు నిర్జర వల్లభుడోపలేడు, నీ
వనిన జగత్రయంబళుకుఁ, నద్భుత రూపముఁ జెప్పరాదునీ
యను సమభోగసంపదలకాఱడి దెచ్చితివిప్డురావణా

సీ. కుదియించి సింహంబు కోరలు బెరుకంగ, శేషాహిదౌడలు జీల్చి పేయఁ పీడించి దంభోళి పిడికిలిఁ బట్టంగ, కఠిన కాకోలంబు కడిగొనంగ, చెలఁగిబ్రహ్మాండంబు చిప్పలూడఁగదన్నఁ హుంకారమున బడబాగ్ని నుఱుక, నంభోనిదానమ్ములరచేత బడపంగ గిరివర్గముల తలక్రిందు జేయఁ

తే.గీ. గల మహా బాహుసత్వ విఖ్యాత విపుల దండభుజదండ సాహసోద్దండ విలయ కాల రుద్రావతార సంగ్రామ ధీర, మూర్తి మంతులు కపులు సత్కీర్తి యుతులు

వ. అదియునుంగాక, దశరథ రాజనందనుండును, కౌసల్యాగర్భసంభవుండును, తాటక ప్రాణాపహరుండును, విశ్వామిత్రుని యాగ సంరక్షకుండును, అహల్యాశాపమోక్షదీక్షాగురుండును, హరకోదండ ఖండనుండును, జామదగ్ని బాహుబల భంగుండును, విరాధ నిరోధుండును, ఖర, దూషణ త్రిశిరచ్ఛేధనుండును, మాయామృగ సంచారి మారీచ సంహారుండును, కబంధాంతకుండును, వాలి ప్రాణనిబర్హణుండును, సుగ్రీవ రాజ్యసంస్థాపనాచార్యుండును, ధనుర్విద్యా ప్రవీణుండును, సుమోఘబాణుండును, రాక్షసకులాంతరుండును, కాకుత్స్థాన్వయాంభోనిధిచంద్రుండును, కరుణాసింధుండును, శ్రీరామ చంద్రుడు కరుణాలంకారుండుగావున.

ఉ. వారక సీతనిచ్చి, రఘు వల్లభునిన్శరణంబు జొచ్చినన్
నేరములెంచి చంపమికి నీయెడ నెప్పుడు నేను బూటగా
భారపడంగజాలుదుఁ శుభస్థితి నమ్ముము, నమ్మకూరకే
పోరఁగ జూచితేని, బోరి వుచ్చక మానడు నిన్నురావణా.

మంజరులు - కాపి

అనమం నన్వినికాలాగ్నివలె మండి, యసురుల గనిరావణుడు
సునితాస్త్రంబుల జంపుడు వీని న్మాడకుండ రాముండు
భయపడిచెడునన విభీషణుండనె పాపము దూతనుజంపన్
నయమున బుచ్చుడు చాలుగాకున్న నా హనుమంతుని తోకన్
కాలిచి పంపుడు మీ మానసముల గలిగినవంతల దొలగన్
మేలదియన రావణుండు నదియే మేలటుజేయుడుద్వరగన్

వ. అనియానతిచ్చిన రాత్రించరుల తనిని సభా మధ్యంబు నుండి బయటికి గొనిపోయి, యొక్కచోట.

ఉ. వాలము నిండ కోకలు జవంబున గట్టిగ జుట్టి, వానిపై తైలము చక్క జల్లి, పిఱుదంజని పౌరులు జూడ, పావక జ్వాలదగిల్చి, బొబ్బలిడి, వాడల వాడలు ద్రిప్పుచుండ, వాతూలభవుండు దానికినిదూలక వహ్ని జపంబు జేయగన్.

ఆ.వె. అగ్నిదేవుడపుడు యాత్మలో జింతించి, హితుడు నాకు లోకహితుడు పవను
డతనిపుత్రుడైన హనుమంతునకు నేను, చలువ గూర్తు ననుచు చల్లనయ్యె

వ. అప్పుడచ్చటి వృత్తాంతము నంతయు దనకు గావలి యున్న రాక్షస కాంతల వలన విని, చింతా భరక్రాంతయై, జనక రాజ నందన కరంబు శోకించి, కరంబులు ముకుళించి, జగత్ప్రాణనందనుండైన హనుమానునకు శీతలుండవు గమ్మని, యగ్ని దేవునకు నమస్కరించి, యగ్ని మంత్రంబును, బ్రహ్మమంత్రంబునుచ్చరించిన, వైశ్వానర భగవానుండు చల్లనయ్యె బ్రహ్మాస్త్ర ఓంధనంబును నూడెనట్టి సమయంబున

సీ. కొలువు కూటములకు గుప్పించి గజ వాజ శాలల మీదికి చౌకళించి
ఖండార గృహములపైకి ని లంఘించి, మెఱుగారు మేడలమీది కురికి
చప్పరంబుల మీది కుప్పరంబున దాటి, యతఃపురమునకు గంతువైచి
చవికెల మీదను సాహసమ్మున వ్రాలి గరిడి కూటంబున సొరిది నెక్కి

తే.గీ. వాడవాడలఁ వీధుల వన్నె మెఱసి, హరుడు త్రిపురంబు ప్రేల్చినయట్టె లీల
కొక్క గృహమైన లెక్కకు దక్క నీక, దానవేశ్వరు పురము దగ్ధంబు జేసె
శా. అంభోరాసిని వాలవహ్న్యనతి శాంతంబొప్ప జల్లార్చి, య
య్యంభోజాననఁ సీతఁగాంచి, తన వృత్తాంతంబు తెల్లంబుగా
గంభీర ధ్వని విన్నవింపుచు నమస్కారంబు గావించి, సం
రంభం బొప్పగ వేడ్కతో గదలె ధీర ప్రౌఢి దీపింపగన్

వ. బోయెడి వాయుజునెదుర్కొని,

కాంభోజి - ఖండగతి

ప. ఎక్కడికి బోయెదవు - యుక్కడంతున్నిన్ను, మర్కటా దక్కితివిర ...
మరియెటు బోలేవుర ॥ ఎ ॥

అ.ప. చిక్కితివి నా చేత, చెఱచి వేతున్నిన్ను, పెక్కెల నిల్వుమిక పీచమడతున్వేగ

మి. టక్కరివై జొరబడి - యకటులంక గాల్చితి, టెక్కలి కాడవు నీ
నిక్కడగింతున్ న్నిలు ॥ మెక్క ॥

వ. అని ఎదుర్కొని నలంకిణి నొక్క పిడిగ్రుద్దునఁ బరి మార్చి, సువేలాచలం బెక్కి, సింహనాదంబు జేయుచు,

కం. వడినగధర శృంగంబున, నడుగులు వడి నూది త్రొక్కి, యద్భుత శక్తిన్
గడచి జలరాశి పావని, మిడి వింటి నృసిడి యుండ మీటిన రీతిన్

వ. గుప్పించి యుప్పరంబెగసి, వాయు వేగంబున జనుచు, నయ్యబ్ధి మధ్యంబుననున్న సునాభంబను శైలమ్మున తన దేహంబు దాహంబు దీర్చుకొని సముద్రంబును దాటి యవ్వలికింజనియెనప్పుడు.

ఉ. వచ్చిన పావనింగని జవంబున నంగదుడాది వానరుల్
క్రచ్చుఱ భక్తితో నెదురుగా జన, నందరఁ గౌగలించి, వా
రచ్చటి కార్యమంతయు ప్రియంబున తన్నడుగంగ బోయి, వే
వచ్చిన చంద మేర్పడగ వారికి జెప్పెను తప్పకుండగన్

క. రఘు వరుడిచ్చిన ముద్రిక, రఘువల్లభుదేవికిచ్చి, రామా మణిచే
రఘువరుని కానవాలుగ, రఘువల్లభుదేవి యిడిన రత్నము గొంటిఁ

మంజరులు - ఆనంద భైరవి

అని చెప్పన్ వినియంగదాదులు మహాశ్చర్యంబునఁబొంగి, పా
వని బాహు బల సత్వము న్పొగడి వర్ణింపుచును జెలంగి
పునరాలింగనకూచరించి శడిభూషించుచుమడి మ్రొక్కి
ఘనతన్పాడుచునాడుచున్మిగుల గర్వంబునకడునిక్కి
నేనేజాలుదు రావణుతలలన్నేలంబడగొట్టంగా
నేనేజాలుదు వాని పట్టణమమున్నీటిన్ద్రోయంగా
నేనేజాలుదునంచు పంతముల నెన్నో బల్కి కపిగుంపు

వ. అమ్మడువాడుదయంబుననే మధువనములో ప్రవేశింప నుద్యోగించి, అందరికన్నను పెద్ద వాడగుజాంబవంతుని బిలిచి, నీవు శ్రీరామునకు హితుండవు, సుగ్రీవునకు మంత్రివి, గావున మాకు నొక్క బుద్ధియానతిమ్ము. ఈ కపులు క్షుద్బాధావశంబున బొరలి మహాశ్రమంబు నందియున్నవారలు. గావున సుగ్రీవుని మధు వనంబున నుండెడి ఫలంబులంబరితృప్తులమై రాముని సన్నిధానంబున కేగుట లెస్సయగునని, అంగద హనుమంతులు వల్క జాంవంతుండును నత్యుత్సాహంబుననంగీకరించి, కపులంబురస్కరించుకొని మదువనంబులో ప్రవేశించునంత.

సీ. ఒక్కడాకొని కొమ్మలూచిన పండ్లెల్ల చేకొని తేర బక్షించునొకడు
ఒక్కడాకొని రేపుచున్నట్టి తేనియల్ తడయక కొల్లాడి త్రాగునొకడు

ఒక్కడాకొనికోయుచున్నట్టి కాయలు, మిన్నక యూటాడి మ్రింగునొకడు
ఒక్కడాకొని గోళ్ల నొలిచి నట్టి చిగుళ్లపుక్కిళ్ల, కొలదిగా బొక్కునొకడు
తే.గీ. తరువుపై నుండి తరువుపై దాటునొకడు, పండ్ల కెటువంటి మ్రాకైన బ్రాకునొకడు
దిగువగూర్చుండి తరువునకెగురు నొకడు, పెద్దపొదవుననుండి కుప్పించు నొకడు
ఉ. కాయలు ప్రేటులాడుచును, గంతులు వైచుచు, పూవు దీవెలన్
దూయెలలూగుచున్, తరువులూపుచు, పండ్లను పొట్టనిండఁగా
మేయుచు వెక్కిరింపుచును, మిన్నక దాటుచు, తోకలెత్తుచున్
కూయుచు నేల దూకుచును, గుంపులు గూడి కపీంద్రులెంతయున్.
కం. వనమంతగాసి జేయగ, వనపాలకులేగుదెంచి, వడికోపముతో
డను నదలించిన వారల, హనుమంతుడు మొదలుగాగనగచరులెల్లన్
కం. మెడబట్టి వనములోపల, వెడలగనట బారద్రొబ్బి, వెడలుండన్నన్
తడయక దధిముఖుడనుతమ యొడయని కడకేగి వారలు గ్రముగాఁగన్
వ. విన్నవించిన యంతనే,

బిలహరి రూపకము

ప. దధిముఖుండు మండిపడగఁ,. తన వారల గూడి సర్వ
విధముల జరియించెడు కపి - వీరులగని కోపముతో ||దధి||
అ.ప. మధువనమెల్లల్గొల్లన్ - గొనమర్కటు వల్లభునా
జ్ఞన్ద్రోయన్మమ్మథముల జేయనెంతఘనులటంచు ||దధి||
చ. యుద్ధతి దండించుచున్న - దదిముఖుపైనంగదాదు
లుద్ధతులై యాగ్రహమున నురికిరికడు భీకరముగ ||దధి||

మంజరులు - అఠాణా

కొందఱఁగఱచియు - కొందఱఁబొడిచియు - కొందఱతలబట్టీడ్చి
కొందరఁగొట్టియు వ్రేళ్లగ్గాళ్లన్ న్గొందరదన్నియు పేర్చి
వ్రయ్యలు వారఁగవచ్చిన తనువులు గ్రయ్యన రక్తముగ్రమ్మన్
కుయ్యోమొఱ్ఱోయని ఇనసుతుకడకున్నరిగిరి కడుభీతిన్
అరిగి రామలక్ష్మణులతో నున్నయర్కజునకు కేల్మోడ్చి
జరిగిన విషయం బెఱిగింపనతడు చాలగ సంతోషించి

సీతాదేవిని గనినహర్షమున, జేసి యుందురటుగాని
వాతాత్మజ, జాంబవంతులుండగ వారటుజేయరు పోనీ

వ. అని, రామ భూపాలుండు విన సుగ్రీవుడు వారలనూరార్చి, వారి దుండగంబులు వారికే యుండుంగానీ వారలఁదోడ్కొని యతి వేగంబున రండని యనిపినంజని, అంగదహనుమంతులన్గని, యువనీశ్వరుండీక్షణమ్మున మిమ్మందర నచ్చటికి రమ్మని యానతిచ్చెంగావున, వెచ్చెఱరండని తోడ్కొని పోవునప్పుడు వారలకెదురుగా శ్రీరామ చంద్రుని పాదారవిందములకు సాష్టాంగ దండ ప్రమాణంబులాచరించి, సౌమిత్రికిని, వందనమ్ములొనర్చి, సుగ్రీవునకు నమస్కరించి, తన చేత మేలు వార్తవిన నుత్సహింపుచున్న రఘుకులేశ్వరుల తలంపెరింగి హనుమంతుండిట్లనియె

శా. కంటిన్జానకిఁపూర్ణ చంద్ర వదన న్గల్యాణి నాలంకలో
కంటిన్మీపద పంకజంబులను, కౌతూహలంబొప్పగా
కంటిన్మీకరుణావలోకనము విఖ్యాతంబుగా కీర్తులన్
కంటిన్మాకపివీర బృందములిటన్గంభీర వారాన్నిధీ

సీ. కట్టినవస్త్రంబు కట్టుకొంగే తక్క
జీర్ణించిపోయిన చీర తోడ
నుడుగనివగలచే నోరంత ప్రొద్దునుఁ
జెక్కింటఁ జేర్చిన చేయితోడఁ
బుడమిపై బొరలాడునొడలు బూడిద ద్రుంగి
నిరతంబు దొరఁగుకన్నీటితోడ
నిడుద పెన్నె జివేణి సడలించి జడలతో
నిరతని రాహారనియతి తోడ

తే. గినుకఁజంకించు దైత్య కామినుల నడుమ, తపము జేయుచు దనుజ బాధలకు నోర్చి
వనిత ప్రాణంబు దక్క సర్వము త్యజించి, నిత్యమును మిమ్ము మదిలోన నిల్పియుండ

కం. జానకిఁపొడగని యును మీరానతి నాకిచ్చి పంపినట్టి విధముగన్
సేనాయమకెఱిగించియు, జానకి రత్నంబుగొనుచు జనుదే గంటిన్

వ. ఇవివ్విధంబున సీత చిహ్నంబులు రామునకున్జెప్పి, దండ

ప్రణామంబులాచరించి, తనకు సీతా మహాదేవి దయ చేసిన శిరో రత్నంబు శ్రీరామునకు నర్పించినంజూచి, యది యక్కునస్జేర్చి, యానంద భాష్పమ్ములు గ్రమ్మ, మూర్ఛిల్లి, తెప్పరిల్లి, హా! వామలోచన ! హా పద్మ గంధి! హా సీతా! హా సీతా! యనుచు శోకించి, సుగ్రీవునన్గాంచి మనము లంకా ప్రయాణము జేయబోవుదముగావున నిక సేనలంగూర్చుమని, యానతిచ్చిన వానరేశ్వరుండు మహా ప్రసాదంబని, అంగద హనుమద్జాంబవంత, సుషేణ, పనస, నల, నీల గజ గవాక్ష, గోముఖాదులను సేనా నాయకుల నలువదికోట్ల నియోగించిన, వారును ఒక్కొక్కరునూరేసి కోట్ల బలంబుల , దోడ రామచంద్రుని ఇరువంకల పాడుచునాడుచు మాల్యవంతంబు వెడలిరనవిని, నారదుని వాల్మీకి మునీశ్వరుండటుమీద వృత్తాంతంబెట్టిదియనియడుగుటయును.

కం. జలజాక్ష భక్తవత్సల, జలజాసనవినుతపాద జలజాత సుధా!

జలరాసి భవ్యమందిర, జలజాకర చారుహంస జానకిరామా!

గద్యము. ఇది శ్రీ గౌరీశ్వర వర ప్రసాద లబ్ధగురు జంగమార్చన వినోద సూరిజన వినుత, కవి చమత్కృతుకూరి. కేసనశెట్టి తనయ మొల్లనామధేయ విరచితంబైన శ్రీ రామాయణ కావ్యంబు సుందర కాండము నందు, హరికథా కేసరి హరి కథా సుధానిధి సత్కథాధుర్య, గానకళానిధీ, త్యాది బిరుదాంకితులును గజారోహణాది సమ్మానితులును, రామాయణ మహాభారత, భాగవతాది హరికథా కథకులును ఆకాశవాణి గాయకులును, శ్రీ తాళ్లూరు నరసయ్య వేంకటాంబా ప్రథమ తనూజులు, నిరంతర శ్రీవాసుదేవచరణారవింద సేవారతులు, శంకరయ్య భాగవతార్చే పాటలు, మంజరుల కూర్పు రచనతోనేకాశ్వాసము

సురటి - ఆది

ప. పావన మూర్తిమంగళం - భానుకులాన్వయమంగళం ॥పా.॥

అ.ప. శ్రీవనమాలీ మంగళం, శ్రితజన వందిత మంగళం ॥పా.॥

చ. దేవాదిదేవామంగళం - దీన పోషణా మంగళం ॥పా.॥

దివ్య స్వరూపా మంగళం, భవ్య చరిత శుభ మంగళం ॥పా.॥

లోకాస్సమస్తా సుఖినో భవంతు ఓం తత్ సత్

# యుద్ధ కాండము - ప్రథమాశ్వాసము - హరికథ

వ. ఇట్లు నారదమునీశ్వరుండు, వాల్మీకి మునికెఱింగించిన తెఱంగు వినిపించెద సావధాన చిత్తంబుతో నాకర్ణించుమట్లు శ్రీ రామచంద్రుండు వానర సైన్యముతో వెడలి నడచు చుండ హనుమంతుండంతకుముందు తాను లంకకరిగి మగిడి వచ్చియచ్చటి వృత్తాంతమంతయు శ్రీరామ చంద్రునకెరిగించియు, త్రోవలో నుబుసు పోకకుగా వఱల రావణుడుండు చందంబును, రాక్షస స్త్రీల సంవాదంబును, నింద్రజిత్తతికాయాది కుమార వర్గంబు తెఱంగును. పంచ శక్తి విభీషణాది సోదరులయునికియును, లంకిణి పొంకంబడంచుటయు. లంకలో పలికి బోయిన చందంబును, లంకాపురీదహనంబును, సముద్రలంఘనంబును, నదినిదియన నేల? తాజేసినవచ్చిన కార్యంబుల నెల్ల, నెవ్వరేదేడియుడిగిన వారి కావృత్తాంతమ్ము లెఱిగించుచుండ మిగిలిన కపులు వినుచు, దమజాతి చేష్టలు సూపుచు; జనుచున్న చందంబు, సుగ్రీవుండు రామచంద్రునకు జూపుచు నడచుచున్న సమయంబున,

మోహన - ఆది

ప. గంతులు వైచిరి యా నందమ్మున, కంతు జనకురాముని భజియించుచు,

అ.ప. మంతనమ్ము లాడుచు కొందరుమరి, వింతగర్వమ్ములాడుచు మరి కొందరు ॥గం॥

చి. పంతములన్నాడుచు కొందరు మరి పండ్లికిలించుచు దూకుచు కొందరు
వింత చేష్టలంజేయుచు కొందరు, వీరాలాపము లాడుచు కొందరు ॥గం॥

సీ. పాదఘట్టనము చే బరగిన పెంధూళి, యాకసంబున మేఘమట్లు పర్వ
పీకతో దాకిన వృక్షజాలంబెల్ల, ప్రేల్మిడి గొమ్మలు విరిగి పడగ
ఒదువడితో బోవు పక్షిజాతమ్ములు, భయము చేనందంద చాటుచుండ
జూపించి రావణాసురుని సైన్యంబిట్లు, మన వారి చేతను భ్రమింపగలము

తే.గీ. అనుచు శ్రీరాములకు నర్కతనయుడిట్లు, సంతసముబుట్ట, జెప్పుచు సాగిరాగ
క్రమముగానందరునుc గొంత కాలమునకు, తిన్నగా జేరిరి సముద్ర తీరమునకు,

వ. ఇట్లందరు సముద్ర తీరమున విడిసియున్న సమయంబున హనుమంతుడు బుద్ధిన్వరిష్టుండుగావున శ్రీ రామ చంద్రునకు నమస్కరించి, రావణుండు రాజ్యము నంపట్టభద్రుడైయున్న వాడు వానిబంపి సీతాదేవి నెడ్పించుపనికై వేగమనమందరము సిద్ధులమైయుండవలయుదనడు రామచంద్రుండు తమ్మునితో.

కం. ఈ వానరులను దోడ్కొని, ప్రావీణ్యముతోడ వృషపర్వతయునకున్ వేవేగమెదెప్పింపుము, పోవుదమటు మీద వైరి పురముస్జేరన్.

వ. ఇట్లానతిచ్చి, సముద్ర తరణోపాయం బాలోచించుచుండెనంత

మంజరులు - మోహన

అక్కడ రావణుడఖిల మంత్రులన్న తి వేగమెరావించి,
చక్కగ కొల్వును దీర్చియనియె నీ సరణినిఁ గడుచింతించి
మర్కటుడొక్కండరుగు దెంచి మన వారి నెందరి నొగూల్చి
తర్కించి కించపరచె మనల నందఱి లంకను వేగాల్చి
ఆరామంబుల పాడుగావించి యంబుధినిల్లంఘించి
శ్రీరామనొద్దనేమిజెప్పెనో? చేరి వారిరోషించి,
రామలక్ష్మణులు కపుల గూడి మన రాజ్యంబునకేతెంచి
ఏమి జేతురో మన వారి నిప్పుడెల్ల చెప్పుడూహించి,

వ. అని ఇట్లు రావణుండు నిండుపేరోలగంబున గూర్చుండి, డోలాయమానమానసుండై, విచారించుచుండ, నా సమయంబున విభీషణుండు సాయం సంధ్యా దివిధిఁ దెరుచుకొని, తన మంత్రులు దానును, కొల్వు కూటంబునకేతెంచి, పెద్దగద్దియపై కొలువున్నయన్నకు, సాష్టాంగదండప్రణామంబు లాచరించిన, నతండును సంతోషించి యనుజునకు నర్హపీఠంబున్జూపిన నాశీనుండై యన్న కిట్లనియె.

తే.గీ. అవధరింపుముదేవ మహానుభావ, మనపురమ్మున ప్రకృతమ్ము జను తెఱంగు విన్నవించెదనున్నదియున్నయట్లు, కొంచెమవధానముగ నాలకించుమయ్య.

సీ. అన్నంబునీరును నక్కఱ లేకుండ, భటులందరును దుఃఖపడుదరయ్య,

కంబాల గట్టిన గజబృంద మెల్లను, జవసత్వములు దూలిజడిసెనయ్యా
హర్షంబుతోడను హయ జాతమంతయు, మెడలెత్తుకొని
వేడ్కమెలగవయ్యా.
ప్రజ్వలించుచునున్న ప్రతి, హోమకుండంబు, పొగలు గ్రమ్మచు నారి
పోయెనయ్యా

తే.గీ. ఇట్టి యపశకుములఁ గుపట్టెనయ్యా, సకల శాస్త్రంబులెరిఁగిన
జాణవయ్యా
ఇంపుగా జెప్పుచుంటి నాలింపుమయ్యా, వేగరాముని సతినిచ్చి
వేయుమయ్యా.

కం. సీతను దెచ్చుట మొదలుగ, నీతోనయవాక్యములను నేజెప్పితినీ
చేతమున బెట్టవైతివి, ఖ్యాతిగనికనైన సీతనాతనికి మ్మా!

వ. అదియనుంగాక, మొన్నరాతిరి సీతయొద్దగావలియున్న రాక్షసకాంత లందరు నిద్రించుచున్న సమయంబున త్రిజటమెల్కాంచి, నిదురించుచున్న స్త్రీలను లేపి చెప్పిన దుస్వప్నంబు విన్నవించెద నాకర్ణింపుము. రామచంద్రుడు మనలంకపై దండువిడిసినట్లును. నీవును, కుంభకర్ణుడును దక్షిణాభిముఖులై గార్ధభంబుపై నెక్కి, పితృభూమికరుగుచున్నట్లు, ఇంద్రజిత్తాది కుమార వర్గంబును, సైన్యము, మూలబలము సర్వము నశించి పోవుచున్నట్లును, సీతం జేకొని శ్రీ రాముడయెధ్యకు బోవుచున్నట్లును కలగన్నదట! త్రిజటకల నిక్కంబైతోచెడిని, రాముడు వానర సైన్యంబుతో గూడి సముద్ర తీరమునకు వచ్చియున్నాడని చారులు విన్నవించిరి. ఆ రాముని దూతలు మరలనిచటికి రాకమునుపే శ్రీరామునకు సబహుమానముగా సీతనుంసమర్పించుట లెస్సయగు కార్యము. ఇంతచెప్పనేల? మొన్న ఒక్క దూతవానరవేషంబున వచ్చి, తన పరాక్రమంబు నీకును, పరి వారమునకు నెరింగించి పోయెనది గురుతుంచుకొమ్మని, నీతి జెప్పుతమ్మునిపై కోపించి, దిగ్గున కొలువు కూటంబు విడిచి, యంతఃపురంబునకు బోయెనా సమయంబున, నా సభలోని వారందరును తమ తమ మందిరమ్ముల కుంజనిరి.

కం. మఱునాదెప్పటి యట్లనె, సురుచిరముగ గొలువు చేయఁజోద్యంబుగ,
విద్దురబోవుకుంభకర్ణుడు, సరీగా మేలుకొని వచ్చె సరభసతిలన్.

వ. ఇట్లు వచ్చి, గృహ ప్రవేశంబు జేసి, స్నానాదిక్రియలు నిర్వర్తించుకొని, భుజియించి, మంత్రులతో నన్నకొలువునకు జనుచుండు కుంభకర్ణునితో మరల విభీషణుండు మంత్రిసంహితుండై వచ్చెను. అనుజులిద్దరును, వచ్చి నమస్కరించిన దీవించి, సేమంబడిగి, యుచితాసనములంగూర్చుండ నియోగించిన కుంభకర్ణుండంతకుమును నా సీనుడైయుండె. కొంచెము దూరములో గూర్చుండి యున్న విభీషణుండు మరలనన్నతో నిట్లనియె.

సీ. దశరథ రాముండు తన పత్ని గోల్పోయి, వానరావళి గూడి వచ్చియిప్పు
డ దెజాడు మంబోధి యావలి యొద్దున, కపిబలంబుల తోడ గలసియుండె
రాముని సత్వంబుర మణి చేమున్వింటి, మాతని తమ్ముండు నట్టిడంట
సౌరిది వారికి బ్రాపు సుగ్రీవుడున్నాడు, వానికిన్మించిన వానితమ్ము

తే.గీ. డాతడిటువచ్చి నిన్ను నుగ్గాడిగాని, సీత దేవని పంతంబుజేసెనంట,
వలదువైరమ్ము సీత నీవలయునేగ, నతని ననితెల్వ గాజాల రమరవరులు.

కన్నడ - రూపకము

ప. రాముగెల్వ నెంచదవే - రాజసముననోయన్నా ॥ రాము॥

అ. రామునకుస్సీత నొసగి - రాజీ మార్గమున బోక ॥రాము॥

మి. రాముని పాదాబ్జంబుల - వ్రాలి శరణు వేడివేగ
రమణీమణి జానకినిడి - రక్షణమ్ము గోరు కొనక ॥రాము॥

చరణము. చంపగనరుదెంచునట్టి, శత్రువైన శరణువేడఁ
చంపకనభయం బొసగుట, సరసుడు రాముని బిరుదట.

మి. ముంపకదనుజుల ముప్పున - ముందుగ రామునకు సీత
నంపి యెల్ల వారిని రక్షింపుమన్న నీవుఁబ్రతికి ॥రాము॥

వ. అనిన యా రావణుండు కటకటంబడి విభీషణునితో
రోషభీషణంబుగానిట్లనియె.

మంజరులు - (మోహన) అఠాణా

ఈవురాముతో గూడి బుద్ధిజెప్పెదవె? నాకుతమ్ముడవే?
కావునీవునీమంత్రులు నలుసులుగాగ కంటమెలగదవే?
తమ్ముడవయ్యు న నార్యమ్ముగ శాత్రవులబొగడెదవెతులువా!

ఇమ్మగ నౌరౌర సిగ్గులేకిటు - నేల నుండెదవుపలువా!
అనిన విభీషణుఁడన్న కిట్లనియె, నన్నానినుజంపఁగ,
నిను గాచుక నీమంత్రులున్నారు చనుసేనను దిట్టంగ
అయిన కొసమాట నొక్కటి జెప్పెద నాలకింపు మోయన్న
దయయుంచి వేరుగా దలపక సీతమ్మొడ కాదనకన్న
ఆది నారాయణుండు రాముండు, యాదిలక్ష్మి యా సీత
ఆదివిజవర్గ మెల్లకపులునీ, కలవియె జయింప భ్రాత?
ఏ జెప్పిన నీతి వాక్యముల విని పే రాము శరణుజొరుము
ఆ జగన్నాథు కరుణంగని కడు హాయిగ నెప్పుడు మనుము.
వ. అని విభీషణుండు విన్నవించిన, హితవచనంబులు రోగికి
పథ్యాహారంబురుచింపని పోలికను వీనులకసహ్యంబులై యుండ,
రావణుండు మండి వడుచు, రోషారుణ నేత్రుండైయిట్లనియె.
సీ. పటు విషంబొలికించు పాములతో నైన జెలగి ఇంపుగ చెల్మి చేయవచ్చు
గాని శత్రులనెప్డు గైవారములు చేయు, వానిని తన ప్రాణబంధువైన
జేర దీసిర యేని చేటు వాటిల్లును, గావున వీని బల్గర్వమడఁతు
విను కుంభకర్ణ నీవును రాకమున్నునీ చెనటినాకున్బుద్ధిఁ చెప్పఁ బూనె
తె.గీ. ననుచుహుంకరించి, నవ్విభీషణుబట్టి, వేగకత్తి బూని వ్రేయఁబోవఁ
నటు ప్రహస్తుడప్పుడడ్డంబుగా వచ్చి, దేవనీకు దగునె యీ విధమ్ము?
కం. నీకేల ఇంతకోపము, నీకు హితము జెప్పుచున్న నీతమ్ముని నీ
వేకత్తి వ్రేసి చంపిన, లోకులు వినిమెత్తురయ్య? లోకస్తుత్యా!
తేగి. గుణమయుండైన మన విభీషణుడు లేని
లంక ఎటికి? సైన్యంబులింక ఏల? వైభవం బేల? యీ మీద ప్రాణమేల?
శాంత మవధారుదేవ నీ స్వాంతమందు.
వ. అని ప్రహస్తుండు, రావణు కోపంబును కొంత శాంత పరచె, నప్పుడన్న కోపంబునకు దమ్ముండు కుంభకర్ణుండు వడవడ వడంకుచు అన్నకెదురాడనోపక, తమ్ముని గాదన లేక , గద్దియ మీద గూర్చుండియున్న యన్న కు మ్రొక్కి, నిదురగృహంబునకుంజనియె, నటురావణుండు విభీషణునింజూచి, యోరీ! నీవు

విశ్వాసఘాతకుండవు, స్వామి ద్రోహివి, గాన నీవు నాకొక్క పేదనరుని పెద్దజేసి, చెప్పెద వాతడే పౌరుషశాలియేని, నీ వాతనింజేరి సుఖంబుగ బ్రతుకుమనిన నతండిట్లనియె.

### శహనా - ఖండగతి

ప. వినురాక్షసేశ్వరా, విష్ణుసన్నిభునిరా, మునిపేదనరుడమచు చుల్కనగనాడకుము. ॥విను॥

అ. ఘనుడుయసమానుండు - గాంభీర్య శౌర్య నిధి, వినుత సత్యయశుండు, విక్రమో పేతుండు ॥ఘను॥

మి. ఘనుడగు శ్రీరాముని - సునిశితశరములునీ, తనువును జీల్చెడి తరిదల చెదుగానీనను ॥ని॥

చ. పర్వతపు శిఖరముల్ - బడునట్లు నీతలలు, యర్వి బడుపేళలను, యుల్లముననను కొనెదు. ॥విను॥

మి. గర్వంబున చెడకుమ నీకావు మనుచు, శరణం - బుర్వి జనిడి వేడుము, ఉడిగి సాహసముఁ కోపము ॥ విను॥

వ. అన్నా, నీ తమ్ముండ నేట, నీ బ్రతుకు గోరి సేవచియించు హిత వాక్యంబుల వినుమను బిభీషణు మాటలకు మఱింత కోపోద్దీపిత మానసుండై, యాజ్యా హుతింప్రజ్వరిల్లు హుతాశనునిగతి న్మండిపడి, ఫెళ, ఫెళ నార్చి, గద్దియమీదం గూర్చున్న తమ్ముని వక్షమ్ము నెదమకాల న్బగులదన్నిన, నతండు తనకన్నుల నుండి దొరగుజలకణంబుల హస్తంబుల దుడిచి కొనుచు నాక్షణమ్మున మంత్రులుందమతల్లియైన కైకసి యొద్దకుంజని, సాష్టాంగ దండప్రణామం బాచరించి, యన్న జేసిన దుర్ణయం బెఱిగించి, శరణాగత వత్సలుండైన శ్రీరామ చంద్రుని, సన్నిధానమునకు బోవుచు న్నాడనని, చెప్పి, యా యమ్మ యను మతంబు వడసి, దీవెనలు గైకొని చని సముద్ర తీరంబున విచారగ్రస్తుండైయున్న శ్రీ రామ చంద్రుంగని విభీషణుండు.

సీ. భానువంశోత్తంస వందితామరలోక, జానకీ నాయక శరణు వరణు,
తాటకా ప్రాణ విదారణ రఘురామ, సకలలోకాధార శరణు శరణు
దిక్కు నీవని వచ్చితిని దీనమందార, పరమపూరుష రామ శరణు శరణు
మాతృపిత్రాదుల మాడ్కిసంరక్షించు, సర్వలోకస్తుత్యశరణు శరణు
అనె రామ వెఱచినాడ రక్షించు రక్షించు, మిపుడు నాకు నభయమిమ్ము యిమ్మ
జూడుచూడు నిన్ను జూచ్చితి శరణంబు, కావు కావు నన్ను కరుణ తోడ.

వ. అని యివ్విధంబున, రామచంద్రుని స్తుతిజేయుచు, జేర వచ్చుతరిని సుగ్రీవుండు శ్రీరామ చంద్రుంగని, విశ్వాసంబు జూపువాడై, దేవా! వీడు రావణుని తమ్ముండు విభీషణుండనువాడు, రాక్షసులు మాయజేయుదురు, గాన వీని వధియింప నాజ్ఞయొసంగు మనిన, రామచంద్రుండందులకు సమ్మతింపక, యితండెవ్వండయిన నేమి? శరణన్న రావణుని తమ్మునినే గాదు, రావణునైనను గాచెద, శరణని వచ్చినవాని ప్రాణంబులు గాపాడుట రాజులకు పరమధర్మంబు, తొల్లి శిబిచక్రవర్తి రాజ్యంబు జేయుచుండ, నొక్క ఖగంబేతెంచి, శరణుజొచ్చిన నభయంబిచ్చి, తన దేహముంగోసి, దానిందఱుముకొని వచ్చిన డేగకిచ్చెనట. కావున నాతని నా యొద్దకు గొని రమ్మనపుడు, సుగ్రీవుండువిభీషణునిదెచ్చి శ్రీరామచంద్రుని పాదారవిందంబులపై బడవైచిన యాతండు యాలింగనంబు జేసి, యుభయప్రదానంబునొసంగి,నేడు మొదలు నీవు వహాకు హితుండవునయితివి. గావున, నిన్ను వహా తమ్ములలో నొకనిగా జూచుకొనియెదనని పలికి, విభీషణా! ఇంకవైరి ప్రభావంబు జెప్పు మనిన దశరథ నందనునకు వందనంబొనరించి, కరంబులు శిరంబున ధరియించి యితండిట్లనియె.

### మంజరులు - కన్నడ

రావణు బల సత్వ స్థితి శౌర్యము - రామాయభినుతి జేయ్యా
నా వశమ్ము గాదతడు దేవేంద్రుచే వెట్టి గొనును దినమున్
ఒక్కొక వాకిట యేనూరు కోటులుందురు కావలి యసురుల్
దక్కక తానెల్లడలు దిరుగు నా దశకందుడు దేబవలున్
తారలనైనన్లెక్కింపందగు తరము గాదు లెక్కింప
ధీరులు లెక్కకు మిక్కిలియై యుందురు కాజ్యము దక్కింప.

వ. తన కుమార వర్గంబు లక్షయుం బదివేలు. వారల నొక్కక్కరికి లక్షమంది బంట్లు నేర్పరిచియుంచిన, వారులంక వీధులలో గొందరును, మఱికొన్నిచోట్ల మఱికొందరును, గుంపులు గూడితిరుగుచుందురు. అయినను బ్రహ్మాదులకయినను సాధింప వలనుపడని లంకా పురము మీచే ప్రసాధింపబడగలదు. కావున మీరు వేవేగ సముద్రుంబ్రార్థించి, సముద్రబంధనంబు జేయవలయుననినయంత

మహేంద్ర పర్వతమ్మును డిగ్గి, సముద్ర ప్రాంతంబున విడిసి, జాంబవ, దంగద, సుషేణ, నీల, మైందాది యందరి వీరుల చేత నలు దిక్కుల యందు గల పర్వతంబులును, వృక్షంబులును, పాషాణంబులును, దెప్పించి కడలి గట్టంగడంగిన

శా. కూపారుండును సంతసిల్లి, జలజాకుంజూచి, మిన్నంది, స
ల్లాపంబుద్ధతిఁబొంగ జూచి, నిరసోల్లాసంబునన్ రాఘవ
క్ష్మాపాలుండును, గోపముంగదరఁ నీ గర్వంబు నా చేత వ
మ్మైపోనిప్పుడటంచు లక్ష్మణుడు విల్లందియ్యబెన్వేక తోన్

మ. పరుషోద్యత్కుటి లాకృతిన్ బాములు చూపట్టంగ శోణప్రభో
త్కర రేఖల్గను గొల్కులన్ని గుడగోదండంబుచే దాల్చి, భూ
వరవంశాగ్రణి రాముడద్భుతముగా, వారాసి మీదన్వడిన్
శరజాలంబులు బేర్చి ప్రేయుటయ నిచ్చ్ర ప్రాణ భీతిన్వడిన్

నాట - రూపకము

ప. రాముని ఎదుట సముద్రుడు - తా మానవ రూపుదాల్చి ॥రాము॥

అ.ప. రామునకు మ్రొక్కి నిల్చి - రయమున నిట్లనియె బిల్చి ॥రాము॥

మి. రామా! తడయగనేలా? రయమున నీకల చేతఁ ॥రాము॥
కామితమందార కట్టు - గట్టి దాటు మయ్య యనుచు ॥కామి॥

వ. మిమ్ములనర్థింప మిన్నంటుంబొంగితినింతియ గాని, కపటోపాయంబున బొంగిన వాడగానననిన రామచంద్రుండు కరుణా సముద్రుండు కావున, సముద్రు నెప్పటియట్లనుండనియమించి, వానరులంబనిచిన

మంజరులు - వెహాహన

రాముని పంపునప్లవంగోత్తములు - రయమున కొండలు, తరుల
సేమమున దెచ్చి జలనిధిఁ బంధించిరి సంతసమున తరలి
పర్వత, పాషాణ, వృక్షజాత మపారముగా గొనివైవఁ
బవ్వెసముద్రుఁడుగుభగుభధ్వాన మడరినవి మున్గిపోవఁ
ఉప్పొంగుచు బ్రహ్మాండ భాండంబు - నొయ్యన బద్దలు గాగఁ
చప్పుడొనర్చుచు నట్టహాసంబు - చాలగ జేయుచువేగఁ
గంతులు వైచుచుబర్వులెత్తియు గ్రాకృతితో జెలరేగి
వింతగా తిమితిమింగలములవ్వడి - మ్రింగె శైలములమూహాగి

వ. నా సమయంబున

ఆ.వె. తిరుగఁదెచ్చిపైవఁ తేలిరాకుండుట, కాత్మలోన సంశయంబునంది
రాజసింహుఁడపుడు రత్నాకరునిఁజూచి, యడుగుటయును వేగనా తడనియె

సీ. రావణుపంపున రాలెల్ల చేపలు మ్రింగుచుండెగదయ్య మేదినీశ
తిమి, తిమింగలములుఁ దిరుగుచునాయందు,
నుండి రావణు పంపునొనరఁజేయు
నలుడు గట్టిన గాని నిలువ నేరదు కట్ట, నలు నిబంపగదయ్యనళిన నేత్ర,
యని సరిత్పతి జెప్పియవ్వేళనరిగిన, వీరులిప్పుడు మహా వీర్యమునను

తే.గీ. పర్వతంబులఁదేరగాఁ భానుకులుని, పంపుచేతను వారధిఁ బరగఁ వేగఁ
నలుడు నా ప్రొద్దె పదియోజనములు గట్టె నంతలో సూర్యుడస్తాద్రికరుగు చుండె

వ. అంత సూర్యాస్తమయంబగుటయుఁ, వానరేంద్రులు, తమ బలంబులంగూడి వేగునందాక సేతు బంధనబునకు కావలియుండి రంత, సూర్యోదయంబైన వెంటనే, మహా బల శాలియగు హనుమంతుడు సువేలాద్రి కరిగి, యానగంబు పొంతనున్న హేమకూటంబును, నాగ పర్వతంబును, సింహాచలంబునను మూడు కొండలు వాల పాశంబున బెకలంచి, నిమ్మ పండ్లమాద్కి, పూల బంతుల వంతునఁనెగురవైచుచు నేతెంచి, నలునికందిచ్చిననా పర్వతంబులు మూడును తొంబది యోజనంబులు నిడుపు గల్గి దశయోజనంబుల వెడల్పుగా నీరధిని బంధించి, నలుండా వార్త రామున కెరింగించిన తోడనే, యతండు లంక లగ్గలు వట్టు నుద్యోగించి, పనసునుత్తరముగను, గవయు దక్షిణముగను, హనుమంతుఁదూరుపుగను, బట్టనియమించినఁ వారలును, లంకాపురంబు దగ్గరకు జొచ్చి, రాక్షసులనుగ్గుమాచంబుగావించుచుండ, హతశేషులు పరుగెత్తి, యా వింతయంతయు, రావణునకెరింగించిననతండు చింతాక్రాంతుండై, దేవాంతక, నరాంతకాతి కాయ, త్రిశిరమహోదరమహా పార్శ్వాదుల రామలక్ష్మణులంజంపి, వారి శిరంబులు గొని రండని పంపఁ, వారరుగుదెంచి, ఘోరాహవంబు నందమ శిరంబులె రామలక్ష్మణుల బాణముల కర్పించిన, వారిలో జావక మిగిలిన యతికాయుండు చనుదెంచి తండ్రియగు రావణునకిట్లులనియె.

## మాంఢ్ - ఆది

ప. దేవా! భానుకూలావతంసుడు - ధీరుడు రాముడు మించి వధియించె

అ.ప. హావిర్భూత మహాప్రతాపమున - యసురులఁ భూరి సాహసబుననన్మించి

మి. ఆవేశంబున ద్రుంచె నెల్లరిని, హావెతల ముంచెయగపాట్లునించె
ద్రోవన్ భీతి వచింపనేల తద్ఘోర ప్రతాపము నింతకున్మిoంచి ॥దేవా॥

## మంజరులు - ధన్యాసి

అనియతికాయుడు విన్నవించినన్ యట్టెయుల్కివడిలేచి,
వెనువెంట నెయక్కుంభకర్ణుమేల్కొన జేయనతఁడు లేచి,
ఆవులించి పండ్లు గీటుచున్ లయకాల మృత్యువుంబోలి
వేవేగమె యరుదెంచిన తమ్ముని వీక్షించి, చింతదూలి
అనిలో నీ వారామలక్ష్మణుల నాంజనేయునింజంపి,
వినుమా! వారల మూర్ధములు ద్రుంచి, వేగనాకు పర్పింపు
మనిన హర్షమున కుంభకర్ణుండు - యట్టహాసమున్జేసి
జనెరణ భూమికి రామయక్ష్మణుల సమీర నందనుఁడాసి

సీ. భేరీమృదంగాది భీమవాద్యధ్వాన, ముకు సముద్రముల్ బొంగిపొరలఁ
కపుల పాలికి లయకాలు డోయనుచును, వినువీధిఁ దివిజులు వెరచి తొలఁగఁ
నతికాయుడును, మహాహంకారమున వేగ, వెనువెంట రోష ప్రవృత్తి
జనఁగఁ
కుంభకర్ణుండు కాకుత్థునైఁ బోయిన, దక్షణోత్తర సముద్రములలీలఁ

తే. గడసి యిరువురుఁబోరాడఁగడగుటయును, కపులు వేవేగ వచ్చిరి విపుల శక్తి
సాధ్య గంధర్వ పతులెల్లసర భసమున, చూచుచుండంగ బోరిరి సురుచిరముగ

వ. ఇట్లు పెద్ద యుంబ్రొద్దు వీరావేశంబునఁబోరుచుండ కుంభకర్ణుండు విజృంభించి, బలంబులకురికి, దిగ్గజ కర్ణస్ఫోటితంబుగా నార్చుచు, వానరసైన్యమ్ముల నసంఖ్యంబుగ మ్రింగుటకు గడంగిన, రఘువీరుండలిగి బ్రహ్మాస్త్రంబు ప్రయోగించి, వాని శిరంబునుదునుమాడె, నంతనతిదికాయుండు తనపినతండ్రి పాటున కలిగి రాఘువేంద్రున భిముఖమ్ముగా నిల్చి దివ్యాస్త్రంబులు ప్రయోగించుచుండఁ, లక్షణుండడ్డుజొచ్చి, నానాస్త్రంబులు ప్రయోగించి, ఘోర

యేద్ధమ్ము జేసి, కడపట వారుణాస్త్రంబు వింటన్సంధించి, విడిచిన నది అతి
కాయుని శిరంబును ద్రుంచెనంత హతశేషులైన రాక్షసులు కాందిశీకులయి
రావణుంజేరి.

తే.గీ. దేవ! దేవాంతకుడు జచ్చెఁ దీన వృత్తిఁ కుంభకర్ణుండు సమసెను ఘోరలీల,
తెగువనతికాయుడును మ్రగ్గెఁ దీనఁకినుకఁ బూని ప్రతికారమొనరింపు భూరితేజ

వ. అని విన్నవించినఁ వుండిపడి, రావణుండింద్రజిత్తుం బంపిన, న
తండాగ్రహంబున

కం. పరవీరులపై వైశ్వా - నరుచే గొన్నట్టి చాప నారాచములున్
పరిఘుయు బ్రహ్మాస్త్రముగొని, దుర మొనరింపంగ వచ్చెదోర్బల శక్తిన్

వ. తదనంతరంబ,

వుంజరులు - వెూహన

తండోపతండముల బాణమ్ములఁ చండకిరణుగతినేసి
కొండల వృక్షంబులఁ వానరులను, కొండమయం బుగఁజేసి
ఖండన మెనరించె మేఘనాథుడు, బాగు భళీయనసురలు
దండిమగతనమ్మున కిన్నర విద్యాధర గరుడోరగులు

సీ. మిన్నకఁ రామ సౌమిత్రుల మీదను, ప్లవగ సేనల మీద బాహు శక్తిఁ
బహ్మాస్త్రమడరింపఁ పటు నినాదంబునఁ బరతెంచి వానర ప్రతతిమీద
బ్రహ్మామంత్రజ్ఞా న పరులైన వారినిర్బంధమ్ముగా జుట్టి పట్టి కట్టి
తక్కిన వారల నుక్కడగించిన, గనుగొని యమదేంద్రకంటకుండు

తే.గీ. వైరమెల్లను నేటితో దీరెననుచు, మించి కెరలుచు విల్లెక్కుడించి పొదలి,
శాంతతను బొందిరాక్షస చక్రవర్తి, కడకు నేగుచుఁ వడిముద్దు కొడుకు గుట్టు.

కం. ముని నాయక వినుమంతట, తనమనుమల పాటు దెలిసి తనలోఁదానే
కనుగొన జాలక పోయెనో? యనగనున పరాబ్ధిలోన నర్కుడుగ్రుంకెన్

కం. అరవింద భవుని కరుణను, వరమందిన వాయు సుతుడు వసుమతి మీదన్
మరి బ్రహ్మామంత్ర జపమున్ విరుదై యున్నట్టి యలవిభీషణుడొకడున్

వ. తక్క, తక్కిన వారెల్లరును మూర్ఛాగతులై చచ్చినయట్లు బడియున్న
సమయంబున వాయు సుతుండును విభీషణుండును, దమలో నెవ్వరు సచ్చిరో?

నొచ్చిన వారెవ్వరో? విచారింప దగునని, మహోగ్రాంధ కారంబు నడుమ నింగలపుఁ కొరువులు బట్టుకొని, రణ రంగంబునఁ గల యశోధింపుచువచ్చి, శరతల్పంబున నున్న జాంబ వంతునింగని విభోషణుండిట్లనియె.

కం. భల్లూకేశ్వర! వానరు, లెల్లరున్నృప వరుల తోడ నిలమీదనుమూ
ర్ఛిల్లియుఁ జచ్చియు యున్నారొల్లంబోవుదును దీనికుపఎటున్నన్

వ. జాంబవంతుండు

భూపాలు - ఖండగని

ప. వినుమా! విభీషణా! వీలుగాకున్నయది వినుకనువిచ్చినీ వైపు - గాంచగా నాకిపుడు విను

అ.ప. మనియున్న వాడె మన మారుతి సుఖమ్ముగా
వినగోరెదన్జెపుమ - వేగ నాతని మేలు వినుకనువిచ్చినీ వైపు - గాంచగా నాకిపుడు విను.

వ. అనిన విని హనుమంతుడు

మి. ఘనుడా మహనీయుడు - కలనబడక మిగిలిన మనవారందర నొకక్షణమున బ్రదికింపనగుర్

చ. పదముల జేరి మ్రొక్కుచును, బాణియుగంబున మోడ్చి, నీ కృపన్
బ్రదికిన వాడనన్న, నతిప్రీతినిఁ జేరగఁ దీసి, నీ విటన్
బ్రదికితిగాన నీకతన పార్థివముఖ్యుని సేనలన్నియున్
బ్రదుకుని జంబుగానిపుడు, పావనియంచుఁ బ్రియంబుజేయుచున్.

వ. వినుము వాయు నందనా! ఈ లవణ సముద్రంబున్దాటి, హిమ వంతంబును, నిషిధా చలంబును గడచి, మేరుశైలంబును, వెండి కొండయును, శ్వేత పర్వతంబును, నతిక్రమించి, ఘృత సాగరంబు లంఘించి, ద్రోణగిరి మధ్యంబునందున్న యౌషధ శిఖరంబు నంగల సంజీవాది దివ్యౌషధంబులు గొనివచ్చి రాఘవప్రీతిగా సైన్యంబు ప్రాణంబులు నిలిపి, కీర్తి వడయుమని ప్రార్థించిన నియ్యకొని, వాయునందనుండు వాయు వేగముతో వేగంబు నన్జని, జాంబవంతుండు జెప్పినదివ్యౌషధముల నెల్లన్గొని వచ్చి సకల సైన్యంబుల ప్రాణంబుల న్గాచి, నిమిష మాత్రంబున నక్కొండ న్దొల్లింటి యున్కి పట్టునను నెలకొల్పి వచ్చె; నపుడు.

క. ఇనుడుదయపర్వతంబున గనుపట్టిన దెల్ల వారఁ గపిసైన్యములున్
జననాథుఁగాంచి మ్రొక్కిరి జనపతియును వాయుసుతునిఁ సుశ్లాఘించెన్.

వ. అంత ఇంద్రజిత్తు పరాక్రమంబునకు సంతోషించి, నిజంబును, గల్లయును, దెలియుటకు రావణుండంపిన చారులేతెంచి, యుత్సాహంబుతో , యుద్ధ సన్నద్ధులై కెరలుచున్న వానర బలంబులగనుంగొని, మరల జనుదెంచి, రామచంద్రుని బలంబున్న తెఱంగెఱింగించిరి, అది తవిని కలంగియుఁ కలంగ నిభంగి నాశ్చర్యంబున్ బొంది, రామలక్ష్మణులపైకి కుంభ, నికుంభ గవాక్షపై, ప్రజంఘు, శోణితాక్షులఁబంపిన, వారును, తమ తమ బలంబుల తోడఁ గరితురగ, రథారూఢులై వెడలి, సింహనాదంబులు జేయుచు, వానర సైన్యంబుపై గదసి, శరవర్షంబులు గురియుచు, పరిఘల జక్కజేయుచు, యడిదంబుల ప్రేయుచు, ముద్గరంబులఁ జెండుచుఁ ముసలంబుల మోదుచు, కరులచే మట్టింపుచు, తురంగంబులచే ద్రొక్కించుచు, రథంబులనొద్దలి వెంపర లాడుచు, మహారవంబులు జేయు సమయంబున, కపిబలంబులడరి, గిరి వర్గంబులు దరువర్గబులుఁ ననర్గళంబుగ గైకొని ప్రతిఘటించి, పోరాడునప్పుడు,

### నాటి - రూపకము

ప. తెంపున వాలి కుమారుడు - కంపనుతో నెదిరి పోరి ॥తెం॥

అ. కంపింపగ వానిని కోపంబున వక్షమ్ము బొడిచి ॥కెం॥

మి. చంపెన్గుంపులు గట్టిని లింపులు చోద్యమునందగ ॥చం.॥
యంపెన్గమునింటికి వేలంపటు దీరఁగఁ కపులకు ॥తెం॥

వ. అప్పుడు

చ. కనుగొని శోణితాక్షుడు నకంపను ప్రాణముగొన్న వాలినందనుని
పయిన్గడున్గిని సితార్కొని తాకి రథంబు, దోలినన్
గనలుచు నంగదుండు తురగంబులతో నరదంబు నుగ్గుగా
దనుజుని మీదఁ తా నురికి, తన్నిన వాడును గూలెనైలపై

ఆ.వె. అతడు నేలఁగూలఁ నా ప్రజంఘుడును, ఘనుడు యూపనేత్రుఁడెనసివాలి
కొడుకు మీదఁ రాగఁకోపించి మైందుండు, ద్వివిదుడంత లోన తెంపుమిగిలి

కం. దనుజునిఁ దోలఁ ప్రజంఘుడు, కనుగొని యవ్వాలి సుతుని, కటుములు బొడువన్
గనలి విశాచరుశిరమును, ఘనతరదృఢముష్టి బొడిచి గడపెన్ ధరకున్

సీ. ఘనుడు ప్రజంఘుండు కదనంబులోబడ్డ, నక్షయ బలుడు యూ
పాక్షుండంత
గదగొని వ్రేసినc ఘనతతో గుప్పించి, భుజ శక్తినాతని బొదివి పట్టి
కొని పోవునప్పుడు కోపించి యన్నకై, శోణి తాక్షుడు వచ్చి శూరుడగుచుc
విడిపించుకొన జూడc వడిగ మైందుడు డాసి, గలనయూపాక్షుని c గదిసి పోరి
తే.గీ. సాహసంబున నొఱలంగ జంపుటయును, శోణితాక్షుండు, ద్వివిదునిc
జూచి పొడువc
నతడు మూర్ఛిల్లి తెప్పిరి యసుర బట్టి, శిరము గూలంగ నడిదంబుచేత వ్రేసె
తే.గీ. శోణితాక్షుండు పోరిలో చూర్ణమైన, కుంభుడప్పుడు కోపించుకొనుచు వచ్చి
ద్వివిదునెదురొమ్మునాటcగ, దీవ్ర శరము లేసి వడిజంపె నాజిలోనేమి జెప్పc

## మోహన (త్రిశ్రగీతి)

ప. తమ్ముని పాటు నుగనుగొని - హుమ్ముని మైందుడు కుంభుని ॥తమ్ము॥
అ.ప. ఱొమ్మున బొడువ గన తడొక్కమ్మున గూలంగ నేసెc ॥తమ్ము॥
మి. నెమ్మనముల నమరులును భయమ్మునందమైందుడు నుర
యమ్మున నసువులు వీడి దివమ్మున్సేరగ నాజిన్ ॥తమ్ము॥

## మంజరులు - మోహన

అంగదుడొక పర్వతంబు కుంభుశ - తాంగముపై వేయంగన్
చెంగునదైత్యుడు దుమికి ముసలమున్ యంగదుపై విసరంగన్
వాలము నార్చుచు వజ్రి పౌత్రుండు, వాని మోదcగా మెచ్చి
కాలాంతకరుద్రుని వలె కుంభుడు - వాలి కొడుకుపై రెచ్చి
ఐదు బాణముల గూల నేయ నతడవనిcబడి మూర్ఛనంద
అది ఎరింగి సుగ్రీవ జాంబవద్ధనుమనంపెరఘునంద
నుండు వారందరధిపు నాజ్ఞగొని కొండల భూరుహములను
దండిగగొని కుంభునిపై వ్రేసిరి దర్పోద్ధతులై కలను.
వారలు వైచిన తరుగిరులన్నిటి - వరుసగcదుత్తి నియలుగా
క్రూరాస్త్రంబుల దునుముచు నమ్ములc వారి వేసెవే వేగ
ఏసిన కుంభుని రవి జుండంతనె యే సెన్ను దురంటంగన్

ఏసిన గ్రమ్మఱఁ రవిజుని వక్షము నేసెన తడుమూర్ఛిలగన్
మూర్ఛ దేరి వెనువెంటనె కుంభుని ముష్టి ఘాతమున బొడువన్
నార్చి శరనిధి స్కంధరము వోలె - నతడు తిరిగి పడి చచ్చెన్

ఉ. కుంభుడు కూలినంగని, నికుంభుడు దాపరిఘాయుధంబు, స
రంభ మెలర్ప ద్రిప్పిదిన రాజ తనూజుని పైకి రాగ, బల్
సంభ్రమ మొప్ప వాయుజుడు శౌర్యముగన్పడ నద్దమైన, డి
క్కుంభిగముల్ గలంగ గను గొబ్బున వక్షముఁ వైచె నార్పుచున్

క. వ్రేసినఁ పరిఘా యుదమది, వీసము నాటంగ లేక విరిగిన మిగులన్
గాసిలి దైత్యుడు పవనజు, నా సమయమునందువేసె నడిదము చేతన్

తే. అంత హనుమంతుడుగ్రుఁడై యసుర గళము, నందు వాలంబుదగిలించి, యాకసమున
ద్రిప్పి ధరణీ తలంబునఁద్రెళ్లగొట్టి, సింహనాదంబు జేసె నచ్చెఱువు గాఁగ.

వ. అట్టి సమయంబున హతశేషులు కావణునొద్దకరిగి.

## అసావేరి - ఆదితాళం

ప. ఏమని దెల్పెద మోప్రభో... ఎంతయు మిగలెను చింతయె మనకిపు ॥ఏమ॥

అ.ప. సామీ యనికి న్జనిన వారెల్లఁ జచ్చిరి యోధాను యోధ వరులతో॥ఏమ॥

మి. ఏమందు మువిధి వైపరీత్యమున, కెంతయు దేవాంతక, నరాంతకులు
ధీనుంతుడు కుంభకర్ణుడాదిగ దేవా! చెల్లిరి కుంభ నికుంభులతో ॥ఏమ॥

## మంజరులు - కన్నడ

అనియాద్యంతము నెఱుక పరచినన్ - విని దుఃఖమ్ముఁ న్బొంది
అనె రావణుండు కొంత వడికి మనమున ధైర్యమ్మున్పొంది
మనకుఁ గల యట్టి బాంధవుల్ సుతులు - మద గజంబులున్నరులు
అనిఁదెగిరందరుఁక పివర్గముచే నగుచు పేట గొట్టియలు
అని చింతింపుచు రావణుండు మక - రాక్షుఁ జూచి హర్షమున
యనెనీ తండ్రి న్జంపి నరిపులన్ యనికూల్పు మాదయమున

వ. అనిన మకరాక్షుండును

సీ. సింధుర రథ, భట, సైంధవంబుల తోడ, దఱచైన పట్టు చత్రముల తోడ

పటహభేరీ ముఖ్య పటు వాద్యముల తోడఁ, దట్టపు నానాయుధములతోడఁ
వంది మాగధ సూత బృందస్తుతుడు తోడఁ గెరలాడు బిరుదు టెక్కెములతోడ
బహుళ కాహళ శంఖ, భాంకరములతోడ, రాజిల్లు నవ చామరముల తోడఁ

తే. నడచె దిగ్దంతి భూదార, నాగకూర్మ, కుల నగేంద్రయుతముగ భూతలముగదలఁ
బదరజః పాణి సంచన్న బాణుడగుచు, దనుజుడైనట్టి మకరాక్షుండాక్షణమ్ము

వ. అతిభయంకరాకారమ్ముగా గదలి, వానర వీరులతోడందలపడి, పోరాడు నెడఁ వానర బలంబులు, తలచెడి పాఱుటంగని, రాజపుంగవుండోహో వెఱవకుడని తన మరువునకున్మరలించి, మకరాక్షుందేరి చూచి, చండకాండంబుల తండంబులు ఖండించి, హరులఁశరంబుల పాలు జేసి, రథంబులను సారథుల తోడంగూడ పృథ్విం గలిపి బలంబులు జలంబునన్దరిమి, సింహనాదంబు జేసి నంగినిః, మకరాక్షుండిట్లనియె.

అఠాణా - ఖండగతి

ప. నేడు నీ తోరణము - నే జేయఁ సమకూరె, నిలువు మా మగతనమున...
నేనినుదునుమాడెద నిలువుమా మగతనమున, ॥నేడు॥

అ.ప. నాడు వధియించితివి - నా తండ్రినట్లుగా, దేడకేగెదవాగుమా... ఇపుడే
నిను గూల్చెద, నేడకేగెదవాగుమా ॥నేడు॥

మి. కడు వడి నా శరముల - బడకూలిచి జనకుని, యొడయని ఋణముల నొగి
దీర్చెద గనుమా ॥నే॥

మ. అని గర్వోక్తులు, పల్కుచున్గెరలి, తీవ్రాస్త్రంబులా రాముపై
తన బాహాబల శక్తి నేయగని, కోదండంబునన్దప్పుచున్
వన జాప్తాన్వయుఁడేసెఁ వానినని గీర్వాణుల్ ప్రశంసింపగా
దనుజుండేసెను రామభూవిభునిపై దర్పాస్త్రజాలంబులన్

కం. శరములుడిపి మరియొక, యా - శుగమునవాని చాపమపుడుదునియనా
డాశరథి రథము పొడిగా, కౌశలముననేయ వాడుక్షా క్రస్థలికురికెన్.

ఆ.వె. ధరకు నుఱికి దుష్టదైత్యుఁడు గదద్రిప్పి భాను కులుని నేయదానినొక్క
విశిఖముననెదునిమి వేగంబెవిభుడగ్ని, శరముదొడిగి వాని శిరముఁ ద్రుంచెఁ

మంజరులు - కాపి

ఆ యెడమ కరాక్షుండు రిపునిసా యకములఁ గూలుట దెలిసి, దై
తేయుడు గుండెలు బగుల నెంతో చింతించి దుఃఖమున సొలిసి

తెప్పరిలి మేఘ నాధుగాంచి నా యప్ప నీవుఁ నే దప్ప
ఇప్పుడు మన దళములన్నియుందెగె నే కపి దెగెనని చెప్పు?
మా! నాగ పాశముననాడా జిన్, బడిన కపులెట్లు బ్రతికి
కో? నాడు చతుర్ముఖుని యస్త్రమున - నొచ్చిన కపులెటు క్షితికి
వచ్చిరో? కుంభ కర్ణుఁడు జంపిన వానరులెటు జీవించి
వచ్చికొ? యతి కాయుడు గూల్చిన కపి, వర్గమెట్లు మేల్కాంచి
చావక? వానరులే దేవతలా శౌరియె శ్రీరాముండు
ఏ విధి గెలువన్ వశమె జెపుమమును పెరుగ నైతి మూర్ఖుండ

వ. అని దీనాలాపములాడుచున్న తండ్రికి నమస్కరించి, మేఘ నాధుండు మేఘ గంభీక వాక్యంబల దుఃఖోపశమనంబుజేసి, నేటి తోడపగ సాధింతునని, ప్రాగల్భ్యంబుగఁ బలికి యనుమతింబడసి, గజ, వాజి, శతాంగాదులగు చతురంగ బలంబులఁ గూర్చు కొని చత్ర చామరంబులు పిక్కటిల్ల, నట్టహాసంబుజేయుచు, లంకాపురంబు వెడలి, సంగ్రామరంగంబునకుంజని, తన బలంబుల చక్రా కారంబుగా నిలిపి, తన్మధ్యమున రథా వతరణంబు జేసి, రక్తాబరుండై జపంబు జేయచుండునంత నొక్క కృత్తి ప్రత్యక్షంబై నిలిచి, మెచ్చితి వరంబిచ్చెద వేడుమనిన, నతండు తానాకసంబుననుండి ఖండనంబుజేయు నెడకపులకు గాన రాకుండ నంధ కారంబు గావించిన నేను వారిని జయింతునని ప్రార్థించిన నియ్యకొనియె నంత మేఘనాధుండు నభంబునకెగసి, మహాంధ కారబాణంబు వేసిన దానంజేసి పెంజీకటిం గప్పిన జీకాకై పొఙుచున్న వానరులంగని వాయు నందనుడు శ్రీరామ చంద్రునితో నిట్లనియె.

కం. వాయు వ్యాస్త్రము చేతను, బాయునుజూమ్మంధకార బాణ విశేషం
బీ యెడ వేయుడు శ్రీ రఘు, నాయక యని విన్నవింపనవ్వుచునంతన్.

కం. విల్లెక్కు వెట్టి మారుత, భల్లము సంధించి తివిచి పార్థివుడలుకన్
పెల్లార్చియే సెగగనం, బెల్లను వడిదూల దైత్యుఁ డిలపై కూలన్

ఆ.వె. రాజ తిలకుడంబరంబునకెగయంగ, వాయు శరముఁ దొడగి, వ్రేయఁ దడవె
మాయ శక్తి దొలఁగి పోయిన యంతలో మేఘనాధుడుర్వి మీద బడియె

చ. బడియును మేఘనాధుఁడు సుపర్వులు బెగ్గిలనుగ్రబాణముల్
దొడిగిప్లవంగసేనపయిఁ దోరముగాన నడంప నంతటఁ

బెడ బెడనార్చి మారుతి విభీషణులన్గని దానవావళిన్
బొడి పొడి జేయఁ లక్ష్మణుండు పూనిక నాతనిఁ దాకె నార్చుచున్

కం. అంతటు దానవ సేనలు, పంతము జెడి తలలు వీడఁ బారంగ నితా
నెంతయు వెఱవ కుడంచును, కుంతము ద్రిప్పుచును దైత్యకుంజరుడంతన్

వెహాహన - ఆది

ప. సౌమిత్రీని బిలుమా! వత్తువే? శౌర్యము సంధిల్లన్, నన్నెదురన్ ,॥ సౌమి॥

అ.ప. నామీదన్బరపింప వచ్చితివె, నాగాస్త్రంబుల నేమిమ్మందర
రామున్గట్టుట మఱచితేనాడు, రణ కౌశల మింతనె? మదినెఱుఁగవో?

మి. నీమా సత్వ విశేషమెల్లమది - నిక్కముగా దెలియంగ నెంచితో?
ఏమైన న్సరి గాచుకొమ్ము నిన్నిప్పుడే యంత మొనరించెదనో ॥సౌమి॥

వ. అని బాణ ప్రయోగంబు జేసిన,

కం. వానిని బ్రతిశరముల దాపూనిక సంధించిత్రుంచి భుజ బలశక్తిన్
దానవునిఁ మూర్చ పుచ్చెను. భానుకులుండంత నొక్క బాణము చేతన్

ఆ.వె. ఇంద్రజిత్తుడిప్పుడినకులోద్భవునిచే మూర్చనొంది తెలిసి మూర్ఛఁగతిని,
భాస మానమైనబాణత్రయంబునఁ నతని నొవ్వ జేసి యార్చెనంత

సీ. సౌమిత్రితావాని చాపంబు నడిమికి ఘనత రాస్త్రమ్ముచేదునుగఁ జేసి
పది బాణములు వాని బాహు మధ్యంబున, గాఢంబుగా వడి నాట నేసి
తురగంబులను నాల్గు తూపులఁ దునుమాడి, సారథి నొక్కట సంహరించి
శరవృష్టి గప్పిన సురవైరి కోపించి, కాద్ర వేయాస్త్ర సంఘంబు వేయఁ

తే.గీ. గరుడ శరమున దున్మిలక్ష్మణుడు గినిసి వడి కుబేరాస్త్రమతనిపై వైచెన సుర,
దానిఁ దునుమాడి వేగమైంద్రాస్త్ర మేసెఁ
నరవరుడు దానిఁ యామ్య బాణమునఁద్రుంచె

వ. ఇట్లుద్రుంచిన

కం. వరుణాస్త్రంబును వేసెను, సురరాజ విరోధి రాజసూనిని మీదన్
కరమలిగి రామసోదరుడరుదారగఁ దాని ద్రుంచెనైంద్రాస్త్రమునన్

వ. మఱియును.

తే.గీ. కనలి దానవుఁ డతనిపై గంధపుష్ప, సమితి, నొప్పెడు గంధర్వ శరముఁదొడి గి
ప్రేయగోపించి దశరథోర్వీసు సుతుఁడు, ఖండ శరబాణమున దాని గండడంచెఁ

వ. ఇట్లు గంధర్వ శరంబును ద్రుంచి, యంతటుంబో వక దేవేంద్ర దత్తంబైన భుజంగాస్త్రంబు వింతు సంధించి, వేదంబులు సత్యంబగునేని, రామచంద్రుడు ధర్మాత్ముడేని, ఇంద్రాదిబృందారక ద్రోహియైన ఇంద్ర జిత్తుని శిరంబు నీ శరంబుద్రుంచుగాక ! యని వానిపై లక్ష్యంబు జేసి ప్రత్యాలీఢ పాదస్థుండై నిలిచి, గర్ణాంతంబు గాదిగిచి, ఏసిన నదియునం కాలానలా ఖీల జ్వాలంబులుప్పతిల్లగగనంబునన్ బఱతెంచి, నాశరంబుక్కున నారక్కసుని శిరంబు ద్రుంచిన,

కం. కనుఁగొని దేవతలందరు, తను బొగడగమఱలఁ రాముఁ తమ్ముఁడు విజయంబున వచ్చి మ్రొక్క నాతని మనుజేంద్రుడుగౌ గతించి మఱియిట్లనియెన్.

కం. నీ చేతఁ వీడుద్రుంగుట, భూచక్రంబెల్ల మేలు బొందెను వినుమా
నా చేత దశముఖుండును, నీచుఁడుదెగుటెల్లఁ నిజము నిర్మల చరితా

వ. ఇట్లు సౌమిత్రి చేత నింద్ర జిత్తుదెగెనని చెప్పిన నారదుని వాల్మీకి మహామునీంద్రుడటు మీది కథా విధాన మెట్టిదనియడుగుటయు

కం. జలజాక్ష! భక్తవత్సల! జలజాసన వినుత పాద జలజాత సుధా
జలరాశి భవ్య మందిర! జలజాకర చారు హంస! జానకి రామా!

గద్యము : ఇది శ్రీ గౌరీశ్వర వర ప్రసాదలబ్ధగురుజంగ మార్చన వినోద సూరిజ నవినుత కవిచమత్కారాతుకూరి మొల్ల నామధేయ విరచితంబైన శ్రీ రామాయణ మహా కావ్యమునందు యుద్ధ కాండమున శ్రీ రామాయణ, మహాభారత, భాగవతాది హరికథా కథకులు, హరికథా కేసరి, హరికథా సుధానిధి సత్కథాధుర్య, గాన కళాప్రపూర్ణ, పద్య పఠనా ప్రవీణాది బిరుదాంకితులును, గజారోహణాది సమ్మానితులు, శ్రీ తాళ్లూరు, నరసార్య, వెంకటాంబా ప్రథమ తనూజుడు శంకరయ్య భాగవతార్ బాగధేయ విరచితంబైన పాటలు, మంజరులనో ప్రథమాశ్వాసము మంగళం.

మంగళము సురటి - ఆది

ప. పరమ పురుష జయ మంగళం, పద్మ నాభ శుభ మంగళం ॥పర॥

అ.ప. కదివరదా జయ మంగళం, కరుణాభరణామంగళం ॥పర॥
కలుష విదూరా మంగళం, కమల భవనుతా మంగళం ॥పర॥
జలజనబన జయ మంగళం, జానకీ నాథ మంగళం, శుభ మంగళం,
జయ మంగళం,

ఓం సర్వే జనా సుఖి నో భవంతు, సమస్త సన్మంగ శానిభవతు

ఓం తత్ సత్

# మొల్ల రామాయణము - హరికథ 6వ ఆశ్వాసము
# యుద్ధ కాండము

వెూహన రూపకవము

ప. అమలిన శుభ చారిత్రా - కమల దళ సమాన నేత్ర, కౌశిక మిత్రా!...॥అమ॥

అ.ప. ద్యుమణి వంశవార్ధి సోమ సమదాసు రజన విరామ, జానకి రామా...॥అ॥

మి. సమరదనుజ విజయరామ - సజ్జన జన కామాసు ॥సమ॥
త్రామాది వినుతసుర - స్తోమాసుగుణాభివరామ ॥అ ఓ॥

వ. శ్రీ నారద మహా మునీశ్వరుండు, వాల్మీకి మహామునికెఱింగించిన తెరంగెఱింగించెదనా కర్ణింపుమట్లు.

ఆ.వె.చారులరుగుదెంచి, సౌమిత్రుఁచే నింద్ర జిత్తుడీల్లెననుచు జెప్పుటయును.
పంక్తి ముఖుడు సుతునిఁ బలు మారుదలఁచుచు వగవజొచ్చె నెల్ల వారు, వినగఁ

శివరంజని - ఆది

ప. కొడుకా! నేడనిఁ గూలితివా కడకెవ్వరు నా కండలేకుండ ... కొడు ॥కా॥

అ.ప. హడలెత్తించితి వసుర వర్గమును ఆహవమునసుర నాథునింగెలిచి ॥కొడుకా॥

మి. కడుప్రతాపమునరిపు వర్గంబును గడగడలాడించి మూర్ఛఁముంచి
కడతేరితి వాసౌమిత్రునిచే కడకిటునన్నొంటిగ నుండగనియమించి ॥కొడుకా॥

చ. కొండంతయండగా నుండిన కొడుకులేకుండ ఇందరున్న నేమి,
లాభమ్ము కుమారాహా!సుకుమారా నా కొడుకా నేడ నినూ, లిడినా ॥కొడు॥

వ. ఇట్లనేక ప్రకారెంబులంగుమారుంబలవరింపుచు, దుఃఖింపుచు, కొంతతడపున కూరడిల్లి, ధైర్యంబునూలుకొల్పి, తనకుమారుంజంపిన వారిని నేనవశ్యంబును, సంగ్రామరంగంబున జంపుదునని నియమంబున తక్షణంబు

సీ. శైలసన్నిభముతా సామజంబుల దోడఁనని వేగముగల్గు హరులుతోడఁ మూల బలము దోడఁ

కాంచనో జ్వలమంతా ఘనరథంబుకలతోడ, ప్రతిలేని ఘనమూల బలముతోడ

గిమ్మిర వర్ణోరుకేతనంబులతోడc దఱచైన పట్టు చత్రముల దోడ
భేరీ మృదంగాది పృథువాద్యముల తోడc వర శంఖకాహాళ ధ్వనులతోడc

తే.గీ. పాదఘట్టన చలి దోర్వి భాగుడగుచు, వనధులెల్లను బిండలి వండుగాcగc
నడచె లంకేశుడధిక సన్నాహమునను రామచంద్రుని తోడను రణమొనర్పc.

మ. కరిఘీంకారములున్ మహాజవతురంగ వ్రాత హేషారతుల్
వర కోదండ నినాదముల్, సుభట దుర్వారాట్ట హాసంబులున్
గురు సంఘోజ్వలనాదముల్, దశదిశాకోశంబుగా నొక్కటై
పర గన్పంక్తి ముఖుండుc దానడచె కోపస్ఫూర్తి నిశ్వాసుడై

వ. ఇట్లు చతురంగబలంబులు గొల్వ లోక విద్రావణుండగు రావణుండు సమరంబొనర్పనc రుదేరంగని, రాఘవేశ్వరుండనికి దండ నాయకులంబనిచిన, ఆందర రిగి, పాషాణపాణులై ఎదురు నడిచి సింహనాదంబులు జేయ, నుభయ బలంబులున్దలవడి పోరాడు సమయంబున, నసుర వైరులు, శస్త్రాస్త్ర వర్షంబులు గురియించి నొప్పించినంత, వానరవీరులుcమరల దానవులపై, బాషాణ, పాదపంబుల డరింప నరి బలంబులు విరిగి, పికాపికలై పఱచునత్తఱి, పంక్తి కథుండుగ్రుండై కెరలుచు, క్రూర నారాచంబులు చాపంబునన్దొడిగి, పనస, పవనతనయ, నల, నీల ద్వివిధ శరభ, కుముద, గజ, గవయ, గవాక్ష, గందమాద నాంగద మైందాదుల నొక్కొక్కరిc బది బాణంబుల గుదిగొననేసిన విరిగిన న సుర సేనలునుఱుకునయ్యవసరంబున,

మంజరులు - కాపి

చేరి విరూపాక్షుని తేఱి పయిని - ధీరతతో నొకకొండన్
సూరజుడు వైచి చూర్ణమునరించె - శూరత్వము కడు నిండన్
రథము విరుగనొక వారణంబెక్కి , రణమధ్యంబున రాగc
గదసియంగదుడు రోషమున దరుమగా నురికి ధరకు వేగc
వాలి కొమరు కోలన్విరుగనేయ వాని వక్షమున్బొడిచి,
నేలగూల వైచెన్వి రూపాక్షునెంతయు రవి సుతుడొడిచి

వ.    ఇట్లు గూలిన

కం.  హుమ్మనియాతని కూరిమి, తమ్ముండునుఁ గదలి వచ్చు తపనజున
క్రమ్మగ మాకొ్కని జడిగా, నమ్ములవర్షమ్ము గుఱియ నాలో బెలుచన్

చ.  శరములు దాకకుండ నొక శైలముఁ దాకఁగఁనో నడంచి, యా
యరదమునుగ్గుగా, కపికులాగ్రణి పైచినఁ వాఁడు నేలకున్
వరభుజశక్తిఁ దాటి కరవాలున నేసినఁ దప్పఁ గ్రుంగి, వా
నరపతి కొట్టెనప్డు మహినాదుడు సంతసమంది చూడగన్

కం.  కదనమున నొచ్చిదానవుఁ, డదలింపుచు భానుసుతుని, యొదల, బగులన్
గదచే నడచినఁ వానిని, గుదియంగా బట్టి పైచెఁగుంభిని మీదన్

కం.  అంత సుపార్శ్వుడు మిక్కిలి, పంతమునెరపుచును రథము పవనాత్మజుపై
నెంతయు బరపుచుబాణము, లంతంతనె నాటనే యునవసరమందున్

సీ.  హనుమంతుడాదైత్యునరదంబుపై దాటి, చెక్కలు వారంగఁద్రొక్కి ద్రేసి
సైంధవంబులఁజంపి, సారథిఁ తలగొట్టి, గొడుగులు, పడగలు పుడమిఁ గలిపి,
వడిఁవానిచేనున్న యడిదంబుగైకొని, బిరుసుగా నేసినఁధరను గూలి
గొబ్బునఁ దెప్పిల్లి, కోపంబు దీపింప ననిలజు నురము మూడంబకముల

తే.గీ. జాంబవంతుని, నిరుమూడు సాయకములఁ వడిగవాక్షునినైదింట, వాలిసుతుని
నేడు బాణములను దూలనేసెనెంత నవని బడిలేచి యంగదుడాగ్రహమునఁ

మంజరులు - కేదారగౌళ

మండిపడి దైత్యువిల్లుదునుమ నాతండు పరిఘగొనిడాసి
దండి బలుండంగదుని మూర్ఛవడి ధరణిఁగ్రాలగాచేసి
నంతఁ దెప్పరిలి వాలి సుతుడు పిడుగడచినగతి నెదఁబగులన్
ఎంతయున్నెగువ నూచి పొడిచి చంపెన్సుపార్శ్వుఁబంధుగులన్

వ॥  అట్లు సుపార్శ్వాదిరక్షోనాయకులాక్షణంబునన్గూలిన దశకంఠుడు
మిగులవగచి. కనలుచు, సూతునితోనిట్లనియె.

ప॥ పోనిమ్మా రథమున్, సారథీ ॥పో॥ పొంకమడతురామలక్ష్మణులనిక ॥పో॥

అ.ప. కానిమ్మాలస్యమ్మొనరింపక - కదనమందు దాశరథులగూల్చెద ॥పో॥

చ. రానిమ్మెవ్వరేని యడ్డువడ, రామలక్ష్మణులకండగా నిలిచి ॥రా॥
ఈ నిమిషమ్మునసెల్లర్ రణోర్వీతలమ్మునకుఁ బలిగావించెద ॥పోనిమ్మా॥

వ. అనిన.

ఆ.వె. అధిపుడానతిచ్చినట్లుగా సూతుండు, రామచంద్రుఁమీద రథముఁబంపె
నపుడు శంఖకాహళాదిరవంబులు, వందిజనులు నుతులు సందడింపఁ

వ. ఇట్లు, శతాంగ, తురంగహేషారవంబులును, బహుళకింకిణీ, ఘంటకానిన
దంబులును, దనుజ భటాట్టహాసంబులును, బోరుకలంగ, సంగరము
నకేతెంచునక్తంబేశ్వరుండు దనుర్ధరుండై ప్రతిఘటించు సమయంబున

కం॥ అనికెదిరించినరాముని, గనిదనుజ విభుండుఁకినుకఁగదురఁగఁనటుఁజ
య్యన నాగాస్త్రమ్ముల దన ధనువున గీలించియేసెఁ దనభుజశక్తిన్ అవి లెక్కగొనక
పొలిబోరి నవనీ నాయకుడు కినుక నసురాధిపుపై
దివిజాదులులికిపాటుఁగ, బలిసన్నిభమైన తీవ్ర బాణములేసెన్

సీ॥ లంకేశుడవియెల్ల లక్ష్యంబు సేయక, తిమిరాంబకములు సంధించియేయ
నిబిడమై చీకటి నిండంగబర్వినఁ కపులెల్లరంధులై కళవళింపఁ
ఉర్వీశ్వరుండంతనుగ్రబాణంబుల, నంధకారంబంతనణఁగఁజేసి.
వాసవారాతిపై వహ్నిబాణమునేయ, నాతండు రౌద్రాస్త్రమడరనేసె

తే.గీ. రెండు బాణంబులుంగూడిగండెసంగ, బెనగియాకాశముననుండి పృథ్వి మీద
బడియెనద్భుతముగ జగత్ప్రళయముగను, సురలు, గపులును,
దైత్యులుఁజోద్యమందఁ

వ. అట్లు మహాద్భుతంబుగా సమరంబు జరుగుచున్న సమయంబున.

మంజరులు - వెహాహన

రామునిపై బాణస్తోమంబుల - రావణుఁడేయఁగనలుకన్
రాముడేసెఁబాణస్తోమంబుల రావణుపై కడుచులుకన్
ధరణి పుమీదన్గనలి తీవ్రముగఁ దానవ వాధుడు వీకఁ
కర, శరభ, ఉష్ట్ర, కాక, ఫణి, గండక ఘూక, బలాక, భేక; సూ
కర, ద్విరద, ఋష్య, కూర్మ, శుక, భీకర భల్లుక, వృక, పణక, కే
సరి, గృధ్ర, కీట, బక నీలకంఠ, సైంధవ, సైరిభ మూక
వక్త్ర బాణముల వక్రముగా నిర్వక్రమ లీలన్వేవఁ
విక్రమ శాలిరఘూత్తముడు ద్రుంచె వేగనన్నింటి శేవ
సురరిపుమీదన్సుర లచ్చె ఋవడఁ సూటిగ రఘురాముండుఁ ని
బ్బరముగ వైచెన్ యగ్ని బాణము నభంబున కీలలు నిండన్

వ. అమ్మహాస్త్రంబు వలన

కం. దహనముఖంబున శరములు, గ్రహముఖములుగలుగు నట్టి, ఘన తర శరముల్
మిహిర ముఖంబున శరములు, బహుళముగా గల్గి దైత్యపతిపైబడియెన్

ఆ.వె. అంతదాన వేంద్రుడాబాణములనెల్లఁ దృణములట్లు నడుమఁద్రెంచివైచి,
మయునిచేతగొన్న మహనీయనట్టి శంభరాఖ్యమైన శరము వైచె.

కం. ఆశరమున బహుశస్త్రము, లాశుగతింగలిగి, గవియ నన్నిటి నొకటన్
నాశముజేసెను రాముం, డాశాపతులలరమన్మథాస్త్రముచేతన్

ఆ. వె. శంబరాఖ్యశరము జగదీశుబాణంబు, వలన జెడక రాము వక్షమడరఁ
నాటె నంతలోన నాకారిపైనేసెఁ విశిఖతతులు వేయి వేయునెడను

భైరవి - రూపకము

ప. రాముడు విడిచిన శరముల, రావణుండు ప్రతి/ఘటించి

అ.ప. రామునిపై వైచె బాణ రాజిని ఎడతెరపి లేక ॥రాము॥

చి. భూమీవలయమువడకన్, భోయని గగనము గలగన్
సోమార్కులు తారకలును, సోహమ్మని భువిరాలన్ ॥రాము॥

ఉ. తల్లడ మందిరామవసుధాపతికడ్డము, సొచ్చిలక్ష్మణుం
డుల్లమునొవ్వఁ నాటుచు మహోన్నత కోపముతోడదైత్యుచే
విల్లును నారియున్దునిమి వేసి వడిన్శర శ్తకమ్ము చే
బల్లిదుడైన దైత్యకుల పాలుని వక్షముఁ దూర్చియార్చినన్

కం. అంత విభీషణుడమరేంద్రాంతకు నరదంబు గూలనటు సేసిన
త్యంత జవమ్మున ధరణికి, గంతు గొనెన్వడిని పంక్తి కంధరుడలుకన్

వ. ఇట్లు తన రథంబు న్గూల సేసిన విరథుండై రావణుండు మయ దత్తంబైన శక్తిని బూని తమ్ముని నేయజూచుచున్నంత, శరణాగతవజ్రపంజరుండగు, రాఘవేశ్వరునితో బుట్టువగుటంజేసి, లక్ష్మణుండు కరుణామయుండై విభీషణుని తన వెనుక నిడుకొని యెదిర్చి నంగని నీవు నాపగరకడ్డంబ వైతివి గావున, నీవ ఈ శక్తి చేత హతుండవు గమ్మని ఏసిన నదియును శతఘంటి కారంజితంబును, శతకోటినినదంబును, బావక జ్వాలా ఖీలకీలాన్వితంబైపరతేరంగని, సురేంద్రాది దేవగణంబులు భయంబంది, రాముతమ్మునకు దీర్ఘాయువగుంగావుత! యని దీవింప, జగంబుదల్లడిల్లఁ, సముద్రంబులు ఘూర్ణిల్లఁ, గులాచలంబులు వడంక, చంద్రార్క బింబంబులు దలంకఁ నేగుదెంచి, సౌమిత్రి యురంబుదాకి ధాత్రింబడియెనట్టియవసరమ్మున,

సీ॥ పంక్తి కంధరుడేయు బాణంబులనిలెక్క జేయకరఘుకుల సింహుడపుడు
తమ్ముని మెయినాటి ధరణిగాడి నశక్తి, నొగివానరులు దీయ నోపకున్న
నవలీలదానినొయ్యనదీసి పోవైచి, ఘనులైన కపులను గాపుబెట్టి
నేనెరాముడనైతినేని? మజ్జనకుండు దశరథుండగునేని? తప్పకుండ

తే.గీ. గలన నెదిరించి నాతోడఁ గయ్యమునకు. నిలిచెనేనియు దనుజేంద్రుని జముగాగ.
నమరులెరుగంగజంపుదు నతని చేత జత్తునంతియెగాని నేరిత్తనుగుడఁ

వ. అని మఱియును,

ఉ॥ రాముడు రావణుడనుచును, భూమిపయిన్నిర్వురకును పొసగదు సుండీ
నా మాట వినుడు లెస్సగఁ రాముడు నేనొండెభువిని రావణుడొండెఁ

వ. ఉండుదుమని వీరాలాపంబులాడుచు, రామచంద్రుఁడు ధనుర్ధరుండై శరవర్షంబులు గుఱియించిన, నసుకేశ్వరుండు ప్రతిశరంబుల వానినన్నిటిని న్వూలనేసిన కనలి.

మోహన - ఆది

ప॥ శరవర్షంబును గురిపించెను రఘు - వరుడు రావణునిపైరయమ్మున ॥శ॥

అ.ప. శరములకు ప్రతి శరములేసి దశ-శిరుడు వాని నన్నింటిని దునుమఁగ ॥శర॥

చ. శరములుదొడుగుటువెడలుతూపులును, ఎరుఁగరాని చందమునరావణుశ
రీర భూషణములురలఁ కిరీటములిలడుల్లఁ దివిజులుల్ల సిల్లగాగ ॥శర॥

చ॥ తెఱపిలేని శరవర్షపుధాటికి, వెఱచి రావణుడు కాలుకేల్లురుప
తఱముగానీక, కరముజాచుటయుఁ, కరమునుడుచుటయునెఱుగరానీక

చ. తిఱిగి చూచుచు మృగేంద్రునిగన్న గజేంద్రురీతి దశకంఠుడులంకా
పురికి విన్నవదనుడైచనగ కపివరులు సంతసంబుననుప్పొంగగ ॥శర॥

వ. తదనంతరంబ.

కం॥ ఆ వేళలావు జూపుచు, రావణుచే శక్తిఁదాకిరణరంగమునఁ
చేవజెడిపడిన లక్ష్మణు, దేవున్దగ్గరగరామదేవుడు వచ్చెఁ

వ. ఇట్లురుగుదెంచి,

తే.గీ. రక్తసిక్తాంగుఁడై ధాత్రి శక్తినాఁటి
యున్నతమ్మునిఁ గనుఁగొని యుస్సు రనుచు
దుఃఖ మంతంత నాఁగక తొంగలింపఁ
చెడలపై నిడి బాష్పముల్ దొప్పదోఁగ.

సీ. హా! భానుకులదీప! హా! సత్యసల్లాప!
హా! సుగుణకలాప! హా! సురూప
హా ధర్మసంచార! హా! వైరిసంహార!
హా! కీర్తివిస్తార! హా! సుధీర!

హా! నిత్యసుజ్ఞాన! హా! పుణ్యసంధాన!
హా!పూజ్యసమ్మాన! హా! నిధాన
హా! శౌర్యగుణవృద్ధ! హా! యుద్ధసన్నద్ధ!
హా! చిత్తసంశుద్ధ ! హా! ప్రసిద్ధ!

తే.గీ. హా! మునీశ్వరసంరక్ష! యసురశిక్ష! హా! గుమస్తోత్ర! సత్పాత్ర, యబ్జనేత్ర!
హా! సదాచారసంపన్న! హా ప్రసన్న! యనుచు శోకాతురాత్ముడై యంతకంత

మంజరులు - శివరంజని

జనకుని పంపున నాతో నడవికి - సనుదెంచినిదురకోర్చి,
మునివృత్తిన్ననుగూడినడచి ఎటుబోతివో వెతలదేర్చి,
వనమున గల ఫలమూలములను దిన మును భక్తి సమర్పించి
జననీ జనకుల భంగి నన్ను సీతను పోషించితిమించి
నీవంటి తోడబుట్టువు నిజముగ నీ వంటి గుణోత్తముడు
భూవలయంబున గలడెయూహింప నీవు దక్కనెవ్వండు?
వెఱవకనిద్రాహారము లెరుగక వెంటఁ పదునాలుగేండ్లు
తిఱిగి నన్ను సేవించిన నిన్నెటు మఱతుమిగులఁకడగండ్లు
నిన్నిటివిడిచే పుదికిన్నన్ను కన్నతల్లి ఏతెంచి
నిన్నడుగఁగ నేమని చెప్పుదునే? చిన్న బోయిదుఃఖించి

వ. అని మఱియును

చ. వినుడు కపీంద్రులార! పలవింపుచు మజ్జన కుండు, నాకమున్
జనియెఁ ధరాతనూభవ! నిశాచరుచేఁ జెఱవోయె! నేఁటితో
ననుజుడుదీరె, నింకనడి యాశలనుండుటు వాకు ధర్మమే?
చనుడు విజాశ్రమంబులకు సంశయమొందక మీరు గొబ్బునన్

వ. అని విభీషణునిగనుంగొని,

ఉ. అక్కట! నీకు నింటగల యట్టి సుబాంధవ కోటిఁ బాసినీ
విక్కడికేగుదెంచితి వహీనముదంబున మమ్ము నమ్మి, పెం
పెక్కగఁ రావణుండుదగ నేలెడు లంక గడంగి నీకు నే
దక్కఁగనిత్తునన్ప్రతిన దప్పె విభీషణనీవుఁ బోవుమా

వ. అనియనేక ప్రకారంబులఁ బ్రలపించు రామ భూపాలునకు

సుషేణుండిట్లనియె

ఉ. దేవర నీకు నీ గతి మదిందల పోయఁగనేల? తీవ్రమై
రావణు చేతి శక్తి బవరంబున నాటుట జేసి లక్ష్మణుం
డీవిధినుండెఁ గాని, ధరణీశ్వర జూడుముఖారవిందమున్
జావడు పాపఁడియ్యెడ నిజంబుగ నమ్ము మనంబులోపలన్

ఉ. పున్నమి చందురుండెగడి, పొల్పెసలారెడిమో ముదమ్మియున్
కన్నులు కల్వ రేకులను గాంతిఁజయించెడు గాని, రక్తమున్
చెన్నుదొఱంగయుండ నరచేతులుఁ పాదములున్దలంపగా
నున్న వివర్ణముల్ గలిగి యొప్పు దొరంగదు రాఘవేశ్వరా!

మంజరులు - కన్నడ

అని విన్నవించుచున్న సుమంతుంగనిసుషేణుడనెనిట్లు
వినుమా! హనుమా! యలనాటిమందు వేగమెగొని యిప్పట్లు
తేవలె నీ వియ్యెడ నచ్చుటికిం దెప్పున జనివేరమ్మా!
రవియుదయం బందకము నుపెనీవు రయమున న్దెచ్చియిమ్మా

వ. అనిన భూకాంతుండు హనుమంతునకిట్లనియె.

ఆరభిగాని అఖేరి గాని - ఆది

ప. రమ్మా హనుమా! ప్రాణ రక్షనిడి - రయమునగాపాడు మా లక్ష్మణుని

అ.ప. ఇమ్మగ సత్కీర్తింబడయుమనీ వినచంద్రులునున్నంత కాలమిటు ॥రమ్మా॥

చ. పొమ్ము వేవేగ సంజీవిని గొని రమ్ము మనో జవమున వినుమా, నా
తమ్ములందు నీ వొక్కండవు సత్యమ్ము నీమేలు మఱువఁ జన్మముల ॥రమ్మా॥

వ. అనిడాయంజని, కౌగిటుంజేర్చి దీవించి యంపెనప్పుడు,

కల్యాణి - ఆది

ప. ఎగసి కుప్పించి వడిఁదాటి చనియె - గగన వీధి నంజనీసుతుడు పై ॥ఎగ॥

అ.ప. దిగజూచి, యూచి బాహువులనడుమ బిగియబట్టి క్రుంగి పదములూన
ద్రొక్కి ॥ ఎగ ॥

చ. అగణితముగ రాళ్ల వృక్షములు వడి, నెగసి కొంత దూరమరిగి ధరబడ ॥ఎగ॥

పొగలుగ్రమ్మి పెంధూళి మేఘములు గగన భాగమెల్ల గ్రమ్ముకొనగా

వ. అట్టి సమయంబున

సీ. దనుజేశుడా వార్తవిని, కాలనేమి గేహము జొచ్చినడురేయి యతని తోడ
తన చేత హతుడైన ధరణీశుతమ్ముని, ప్రాణంబులెత్తంగఁ బవనసుతుడు
సనుచున్నయట్టియాపని విఘ్నమొనరింప గ్రక్కునఁ నటుబోయి రమ్మటంచు
కాలనేమియిదేటి కార్యంబు దగదనఁ వినక కోపించిన వేగనరిగి

తే.గీ. ద్రోణశైలంబు చేరు వత్రోవయందు, వనముగావించి, తగమునీవ్వరుని రీతిఁ
జపము జేయుచు కన్నులు జక్కఁ మూసి, నడుము నిక్కించి
పద్మాసనమునునుండెఁ

వ. అప్పుడాకాశ మార్గంబునన్జనుచున్న యప్పవనసుతుండు, వనంబునుంచి, త్రోవదప్పెనని, మనంబున సందియమంది, యమ్మునీంద్రునడిగి చనువాడై, యతనికి నమస్కరించియిట్లనియె

కం. మునినాథ నేను రాముని పనికై జనుచున్న వాడ పరమౌషధముల్
గొని రావలె మదిభావించినిజమ్ము గనిపుడు త్రోవ జెప్పుము నాకున్

వ. అని ప్రార్థించి దాహోపశ మనంబున కుదకంబుఁ వేడిన నక్కపటు మునీంద్రుండిట్టులనియె.

ఆ.వె. పవన తనయ రామభద్రుని పని మాకుఁ దీర్పవలయుఁగాన నేర్పుతోడ,
ప్రాణరక్షకౌఱకు ద్రోణాద్రికరుగంగ వలదు వినుము నాదువనమునందు

తే.గీ. ఘనతరంబైన సంజీవ కరణి మొదలుగాఁ గదివ్యౌషధంబులు గలవు నీవు
గొంచు పోవచ్చుఁగావునఁ గోరుపండ్లు, తనివి దీరంగఁదిని నీళ్ల
ద్రాగుమిచట

వ. అని తన హస్తంబుననున్న విషయుక్తంబైన కమండలోదకంబుఁ జూపించినంగని, హనుమంతుండవిజాలవనిన, నక్కపటమునీంద్రుఁడు క్రూరమకరావృతంబైనకమలాకరం బొకండెరిఁగించి పొమ్మనిన పవనాత్మజుండుఁ జని

వుంజరులు - వెూహన

విమలకమల మకరంద సంకలిత భ్రమరజని తనినదంబై

కమనీయ పవన కంపిత కైరవకుముదయుతమనోజ్ఞంబై
అలరారు జలాశయమునందు దిగి - యవ్వారిఁ తన్వి దీర
గ్రోలనుంకింపమకరమ్ముబట్టుకొనెఁపదములఁబిగువార
విదళింపగపట్టొని చరణముల విడువకున్నంతఁమీరి
వేగబేధించి వెలికి వచ్చినన్ వేగ దేవకన్యకయ్యై
రాగము మీఱఁ వచించెనభోభాగముననిల్చి మోచనయ్యై.

అభేరి - ఆది

ప. నమ్మకుమా! వీనిఁ మారుతీ! మది నమ్మకుమా వీని మారుతీ నీవు

అ.ప. నమ్మకుమా వీడునయవంచకుడు గాని, పొమ్మావీనినిఁ జంపి ప్రొద్దు బోడువక మందె ॥నమ్మ॥

మి. ఇమ్మెయి నాశాపమ్ము దీరెనే నెంతయున్నన్యురాలనీకతన
సుమ్మునే నమర కన్యను ముని శాపమ్ముగారణమున మకరినైతిని ॥నమ్మ॥

వ. నీకు జయంబగు గాక! యనిదీవించి, ధాన్యమాలికాండిన్యుడు తనకుం శాపంబొసంగిన విషయమెఱిఁగించి, దివంబునకుంజనిన యంత హనుమంతుండు తేజోవంతుండై
యరుగుదెంచి, కపటి సంయమినింగనిన యంత నతండిట్లనియె

చ. తడసితివేల యింతవడి? దాపుననే వచియించి నట్టియా
మడుగునకేగిరాకునికి మాకను మానము మేదోచెనయ్య, యి
ప్పుడు గలదేనిఁ కొంత గురుపూజకు విత్తముఁ గొన్కబెట్టి, నీ
వడుగుము మందులెట్టివి? ప్రియంబుగ నట్టివి నీకు నిచ్చెదన్

చ. అనవుడు గోపమెత్తి పవనాత్మజుఁడప్పుడు నీకు పూజ, గొమ్మని
యురుముష్టిచే బోడువఁ నాతడు ఢీకొని పక్షి రూపుఁడై
తనుఁగదియంగ వచ్చుటయుఁ దాని న పక్షముగాగ ద్రుంచినన్
గినిసి మృగేంద్రుడై పొడువఁగేసరి పుత్రుడు దాని గూల్చినన్.

తే.గీ. అంత సుగ్రీవుఁడై వచ్చి, యనిలతనయ బ్రతికె సౌమిత్రి మందులపని దలంప
వలదు రమ్మని నన్ను భూవరుఁడు బంచెఁ, మగిడి పోదము పదమన్నమాట వినుచు,

వ. సుగ్రీవుండని విచారించి, కాకుండుటెఱింగి, వాని బాహు మధ్యంబునఁ

బొడిచిన, నతండారూపంబు విడిచి, శతశృంగుండై నొప్పించినఁ నలిగి, జగత్ప్రాణనందనుండు వాలంబున నడంచి, కరంబులు ఛేధించి, శిరంబు ద్రుంచివైచి, సింహనాదంబు జేసి, జయ లక్ష్మింగొని,

కం. ద్రోణాద్రి కేగి మందులు పోడిమి నీకున్నఁ గినిసి పొల్పరఆగనా
క్షోణీధరమ గలింపుచుఁ పాణితలాగ్రమున బెట్టి పట్టుక రాగన్

మంజరులు - కాపి

కావలియుండి నగంధర్వవరులు, గదసి పదు నాల్గు వేలా
పావనిపై కోపంబుననంతట, భండన మొనరుపజాల
వాలముఖంబున నందర నచ్చట, వసుధఁ గూల్చి త్వరలోన
జాల మొనర్పక, గగన మార్గమున జనుచు నంది గ్రామమున
తైలయుక్తమగు తలలతో బొరలు తమ్మునియన్న విధంబు
కలగని దోష నివారణార్థముగ కాన్కలిచ్చి వేగంబు
ధరణీ దేవుల పూజలొనరించి భరతుండు వెలుపల నిలుచు
టరసి కపి శేఖరుండు రాముఁడని యంతరంగమునఁ దలఁచి

ఆ.వె. రాముఁడేల వచ్చుఁ రాకాసి మూకలఁ నుక్కడంపకుండనుర్వి జనట
వదలి కపుల వదలి? వదలి సౌమిత్రిని? ఎంత వింత? భ్రమసి తేనటంచు

వ. సందియముడిపి కొని, కాడని నిశ్చయించి, యంత హనుమంతుడు దక్షణ పాధోధిం దరియంజనునప్పుడు దశానను పంపున, మాల్యవంతుండెదిరించి, శస్త్రాస్త్రంబులు గురియించి, నొప్పించినంగని, వాతూలసంభవుండు వాల వంల్లార్చి, యహార్చి, పేర్చి, దనుజ బలంబుల జలంబునందరిమి, వాలవముఖంబున గళంబులు బట్టి, నా నాముఖం బులం బారవైచినన్గని, మాల్యవంతుండు, తీవ్ర శరంబుల నొప్పించిననడరి, యద్దానవేంద్రుని కంఠంబున వాలంబునీలించి, గిర గిరం ద్రిప్పి సముద్ర మధ్యంబున బడవైచిన వాడును పాతాళంబున కున్దనియె. నాక్షణంబు

తే.గీ. మాల్యవంతునిఁ బోకార్చి మానుషమున, గగన మండల మందందబగుల నార్చి,
వచ్చునప్పుడు శతకోటి వారి జూప్త, దీప్తి గనుపట్టెఁ ప్రాచీన దిక్కు నందు

వ. ఇట్లు వెలుంగుచున్న మహా ఔషధాచలంబు, దివ్య దీప్తులు గనుంగొని,

రాఘవేశ్వరుండది సూర్యోదయంబని దుఃఖంబునందలంకి కపి రాజునకిట్లనియె.

చ. అదెకనుగొంటిరే? కలయనర్కుఁడు పూర్వ గిరీంద్రశృంగమం
దు దయము నొందె నింక నిటమించినఁ దమ్ముని ప్రాణవాయువుల్
బ్రదుకుట దుర్లభం ఒకట! పల్మఱు మ్రొక్కెడు ప్రొద్దెమాకుఁ దా
నదయత శత్రువయ్యెఁ గపులార! వినుండిదెమీకు జెప్పెదన్

అఠాణా - రూపకం

ప. తగునే? భానునకియ్యది? ధర్మమగునె? యుదయింపగ ॥తగునే॥

అ.ప. తగునే మా వంశమునకు - తాను కర్తయై యుండియు ॥తగునే॥

మి. పగవారి గూడ వలెనో? బాంధవులాపద నుండగ
మొగమోటము వలదె? బంధువుల ఎడఁవంశీయుల ఎడ? ॥తగునే॥

చరణము : తానుదయించిన ఎడనా - వమ్ముని ప్రాణము నిలుచునె?
కానీ చూచెద నీతని గర్వంబణచెదనిపుడే ॥తగునే॥

మి. కొనిరండిటు బాణమ్ముల కోదండంబును వేగమె
ఇనునిన్నూలగనేసెద - నింత ఏల? వంత దూల? ॥తగునే॥

వ. అనునంతలో జాంబవంతుడు రామచంద్రునకిట్లనియె

ఉ. భానుఁడుగాఁడుచూడు నరపాలక మందుల కొండ, దీప్తలీ
మానముదోచెఁగాని, యనుమానములేదు, వినుండు వేడ్కతో
వానరసేన నింకెదురు వాయు తనూజుని గౌరవింపఁగా
మానవ నాథ పంపు మనుమాత్రనె వచ్చె నతండు దీవ్రతః

మంజరులు - అభేరి

అనిమిషులు సన్నుతింపఁ హనుమంతుడతి శ్రీఘ్రమె ద్రోణాద్రిన్
గొని వచ్చినిల్చి, రాముని పదములకు న్మ్రొక్కు లిడియంతన్

వ. రామచంద్రుండ తనిఁగౌగిలించుకొని, సుషేణుంజూచి, నీ వందలి దివ్యౌషధంబుల వలన సౌమిత్రి ప్రాణమ్ములు దేర్పుమనిన, నయ్యధిపునాజ్ఞ శిరంబున దాల్చి, వనచర సహితుండై పర్వతంబెక్కి తొల్లి దేవతల మృతపానంబు జేసిన చోటును, వానరులకు జూపుచు, నగ్గిరీంద్రముపై నున్న యౌషధంబు గొనివచ్చి ప్రయోగింప నాయౌషధముల సామర్థ్యమ్మునంజేసి లక్ష్మణునకుఁ

ప్రాణంబులు మగుడc వచ్చెనంత సకల వానరులు నానంద వార్ధిందేలిరప్పుడు సౌమిత్రి రామునకు నమస్కరించిన రామచంద్రుండు కౌగిటంజేర్చి. హనుమంతుండొనరించిన యుపకృతికి సంతోషించి యాపర్వతంబును తొల్లింటియునికి నేయుంచిరమ్మనిన యతండట్లుగావించెనని నారదుండు జెప్పిన వాల్మీకి మునీశ్వరుండటు మీది కథా విధానం బెట్టిదని యడుగుటయు.

కం. జలజాక్ష! భక్తవత్సల! జలపాసన వినుత పాద జల జాత సుధా!

జరరాశి భవ్య మందిర! జలజాకర చారుహంస! జానకి రామా!

గద్యము : ఇది శ్రీ గౌరీశ్వర వరప్రసాద లబ్ధగురుజంగమార్చన వినోద సూరిజన వినుత, కవి చమత్కారాతు కూరిమొల్ల నామధేయ విరచితంబైన శ్రీ రామాయణ మహా కావ్యంబు నందు యుద్ధ కాండమున, హరికథా కేసరి, హరికథా సుధానిధి సత్కథా ధుక్య గాన కళా ప్రపూర్ణ. పద్య పఠనా ప్రవీణ ఇత్యాది బిరుదాంకితులు, గజారోహిణాది సమ్మానితులు రామాయణ మహాభారత, భాగవతాది హరికథా కథకులు ఆకాశవాణి గాయకులు, నిరంతర వాసుదేవచరణార వింద సేవకులు, శ్రీ తాళ్లురు నరసార్య వెంకటాంబా ప్రథమ తనూజులు శంకరయ్య భాగవతార్చే పాటలు మంజరులు కూర్పుతో ద్వితీయాశ్వాసము.

మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే సర్వే జనా సుఖినో భవంతు

చక్రవర్తి తనూజాయ, సార్వభౌమాయ మంగళం సమస్త సన్మంగళాని భవతు

# మొల్ల రామాయణము - యుద్ధ కాండము
# తృతీయాశ్వాసము - హరికథ

కల్యాణి - ఆది

ప. విమల సుధాకర వదనా, సుమనశ్శ్రేతో బ్జసదన.... సుస్థిర కథనా ॥విమ॥

అ.ప. కమనీయ రదన శత్రువిషమ రఘుకులసార్వ భౌమ జానకి రమణా ॥కమ॥

చి. సుమశర హర వందితమృదుపాదా, సూరి జన వినుత, వేద వినోదా!
కమలాప్తసత్కులాన్వయదీపా - కారుణ్యామృత ఘననిక్షేపా ॥విమ॥

వ. శ్రీ నారద మునీంద్రుండు, వాల్మీకి మునీంద్రున కెఱింగించిన తెరంగెఱింగిచెదఁ నా కర్ణింపుము.

కల్యాణి - ఆది

ప. జలజ నయన శ్రీ జానకి రమణా - కలుష హరణ నవకౌస్తుభా భరణ ॥జల॥

అ. పాలకడలి శయనా వినుతగుణ - భక్త జనావన పరమ పావనా ॥జల॥

చి. కలకల పక్షులు గూయన్, తారకములు పలపలలై పడమట దోపన్
జలజములు విరియఁ తూర్పున భానుడు, బలపలనై తెల్లవారబొడమెన్ ॥జల॥

సీ. అటమున్నదశకంఠుడాచార్యుడైనట్టి - శుక్రాను మతిఁ దేహ శుద్ధి తోడఁ
రణజయార్థంబుగా రథములు గుఱ్ఱముల్ కవచంబులస్త్రసంఘములు గలుగఁ
పాతాళగుహఁజొచ్చి నీతిహోత్రునిఁ గూర్చి, పాయకహోమంబు జేయుచుండఁ
నాహోమధూమంబులాకసలమునఁ బర్వఁ గనివిభీషణుడు భూకాంతునకును

తే.గీ. విన్నవించెను నాయున్ననిన్ననరిగి - హోమ మొనరింపుచున్న వాఁడుడుగకిపుడు మొనసి యా హోమ మడితుడముట్టెనేనిఁ గలన బ్రహ్మాదు లాతనిఁ గెలువ లేరు.

కం. ఈ పని విఘ్న ము జేయఁగ, భూపాలక కపులఁ జేర్చి పుచ్చుము వేడి
మీ పని విఘ్నమ్మ గుసన, భూపాల వరేణ్యుడపుడు భూధర పరులన్

చ. గవయ, గవాక్ష, వాలి సుత, కంజ హితాత్మజ, నీల, వాయుసం
భవ, బల, గంధమాదన, విభాసిత, భల్లుక నాథ ముఖ్యులన్
దివి జవి రోధిపైఁ బనుపఁ, దీవుననేగి, పురంబు జొచ్చి దా
నవ పతి సేనలందఱిమి. నాకము భేదిల నార్చి యత్తఱిన్

కం. గుహ జొచ్చిదనుజ వల్లభ విహితమె సాహసము విడిచి వినుముని వృత్తిన్
దహన గత ధూమ రేఖలఁ నహరహమును వ్రేల్వ నీకునర్హంబగునే?

కం. మగటి మిగల్గినపురుషులె, మగతనమును విడిచినడువ మగు వలునగరా?
తగదనక నేడు మరుగునఁ నీ గతి వీరుండవగుచు వేల్వాందగునే?

వంజరులు - శ్రీరాగం

అనికేగుదెంచి శ్రీ రాముఁడు, బాహ్యాళి ప్రదేశంబునను
నిను రమ్మని పిల్చుచుండనియ్యెడఁ నీవుండుట వ్యాజమున
దనుజాధీశ్వర వీరధర్మమే? తప్పించు కొనఁగనంచుఁ
వనచారుల్కిగ బట్టి యీడ్చినను, వదలక నిశ్చలుడగుచుఁ
కదలక వుదయ జ్ఞానము వదలక కడు నిష్ఠన్మంత్రములఁ
బెదరక వ్రేల్చుచు నుగ్రతతో గంభీర ప్రౌఢిన్ వరల

వ. ఇట్లు శిలాస్తంభంబు పగిదిని చలింపకున్న నతనిచేతి యాహుతులు విడిచి
పోవైచి సుక్రుస్రువంబులు నలుగ ద్రొక్కి, ఇద్మంబులు
హోమద్రవ్యంబులు నొక్కింతనగ్ని లో ద్రోచి.

హోమాగ్నినిజిందరవందర జేసి, భుజంబులెక్కి, మీసలు బట్టుకొని లాగి, తలలు గదిలించి, వీనులఁ పెనుబొబ్బలిడి, కదలకున్నంగినిసి, వాలి తనూభవుం డంత నంతఃపురంబున కునొప్పోయి, యందున్న మండోదరింజుట్టువట్టి యీడ్చుచు, బరువున గొని వచ్చి, దశవదను ముందర నిలుప,నక్కాంత దుఃఖాక్రాంతయ్యై తన కాంతునకిట్లనియె.

తే.గీ. రామచంద్రుడెయాది నాకాయణుండు, కపులెదేవతలని నీకు గనబడంగఁ
నెల్ల వేళలనే జెవినిల్లుగట్టి, విన్నపము జేయు నా మాట వినక పోతి.

మ. మయదైత్యేయునకే తనూజనయి, సేమంబొప్పనీ పత్నినై,
జయపెట్టంగనునింద్రజిద్జ్జననియై స్వాంగనా పూజ్యనై
భయమెన్నండు నెఱుంగనట్టి నను ని బ్బంగిన్ వనాటుండు, ని
ర్భయవృత్తిన్దలనట్టి యీడ్వఁగనుఁగో. బ్రాతైతి నీ ముంగలన్

కం. రాముని దూతలు నన్నును, బాములు బెట్టంగ జూడఁ బండువె నీకున్?
నామానముగా పొడని, నీ మానుష మేటికిపుడు, నిర్జరవైరీ

చ.	ఈముని వృత్తి కన్నఁ దనుజేశ్వర, రాముని తోడనేడు, సం
గ్రామము జేసి గెల్చినఁనఖండ రమా విభవంబు గల్గు, నా
రాముని చేత జచ్చినఁ స్థిరంబగు మోక్షము గల్గుఁ, దీనికై
ఏమిటి కింత దైన్యమిసి! యిచ్చదలంపు ముదాన పేశ్వరా!

వ.	అనియనేక విధంబులుగా, దీనాలాపంబులాడుచు, వెక్కి వెక్కి ఏడ్వన్లజ్జించి, మహోగ్రాకారుండైలేచి, దగ్ధశేషకాండంబులచే వానర వీరుల కరంబులు, శిరంబులు, ముక్కులు, చెక్కులు, నలగ మొత్తినం బఱచి, రామ చంద్రుని సమ్ముఖమ్ము నకుంబోయి, వచ్చిన పని విన్నవించి రట్టి సమయంబున.

తే.గీ.	నగచరులఁ ద్రోలి గ్రమ్మఱఁ నగరి కరిగి, పంక్తికంఠుండు ధైర్యంబుఁ బాదుకొల్పి,
విన్నదనమున వగపునఁ జిన్నబోయి, చెంతనున్నట్టి తనకుల కాంతఁ జూచి,

కాపి - ఆది

ప.	మది చిన్నబుచ్చు కొనెదదియేలా, మందోదరీ నా ప్రతిన వినుచాల మది
అ.	కదనంబున రాముని జయించుటో? గాకఁ వాని చేననిన్మీ మడియుటో?
మి.	సుదతీ! విను మీరెంటనేదియో! చూతు వింకనో దార్చుఁ జెందుమా
ముదమున నాకేలువట్టివెలసిన - ముద్దియనీకేలాయనుమానము ॥మది॥

వ.	రాముని గెల్చి విజయలక్ష్మిని వరియించుటో, రామునిచే వీర మరణంబు నొందుటో? కాని యూరక మరలుట కాని మాటయని, వీరరసంబు పొంగఁ ప్రతి జ్ఞాలాపంబులఁ తన పట్టపు దేవి యగు మందోదరి నోదార్చి, కొలువు కూటంబునకేతెంచి, యచ్చట

క.	శిరములఁ వీనులఁ గళములఁ గరములను యురమ్మునందు గమనీయపదాం
బురుహముల భూషణాదులు, యరుదారగఁ దాల్చి మోహనాకృతి మీరన్

తే.గీ.	గంధమాల్యాంబ రాదులు బంధురముగ, మేన గలియంగ ధరియించి, దానవేంద్రుడంతరణ భేరివేయించి, పంత మలర, బిరుదు రాహుత్తు వీరులఁ బిలువఁ బంచె

వ.	అట్టి యవసరంబున

ఆ.వె.	రోషమదర ఖడ్గరోముండు వృశ్చిక, రోముడల్లసర్పరోముడగ్ని
వర్ణుడాదిగాఁ గ వచ్చిరి రాక్షస వీరులపుడు దనుజ విభుని గొల్వ

కం.	ఇరువది చేతుల శస్త్రాస్త్రోత్కరములు మెరయుంగఁదాల్చి కౌతుక మడరఁ
తురగములు నూరు గట్టిన, యరదమ్ముపై గూరు చుండ యతి విభవమునన్

భేరులు, తారలు, చిమ్మటి తారలుఁ, బూరగొమ్ములున్ బిడులు
వీరమద్దెలన్ గిడిగిండ్లు, కంచు వీరణములు, శంఖములు
గాలి కొమ్ములుఁ మకిలి కోవులున్ కాహళములు తప్పెటులు
డోలు, కైవళ్లు రుంజలున్, నమ్మటులు చత్రచాపామరములుఁ
పిల్లన గ్రోళ్లున్, పసిడి డక్కలున్, పెల్లు నిస్సాణములునుఁ
ఎల్ల దిక్కుల నొర్బెరుగలుంగన్ వెడలు దనుజ వర్గముగడు
కదలెన్బహు వీరోత్సాహంబున, కదనమునకు రావణుఁడు
గదలె వీర రసము కరుడు గట్టిన కరణిఁ నిన్ని ద్రావణుడు

కం. కాలాగ్ని, కాల భైరవ, కాలాంతక, కాల దండ, కాలాహికళా
ఖీల సముద్యద్దినకర, కాలాకృతితోడపంక్తికండుడు వెడలెన్

చూర్ణిక, జయ జయ కైకసీ గర్భ సముద్ర సంపూర్ణ సుధాకరా! జయ జయ మయతనూజా మనోహరా! జయ జయ రాక్షసకుల సార్వభౌమా! జయ జయ సాగరావరణలంకా ధీశ్వరా! జయ జయ పాక శాసన సభద్ర శ్రీహరణ చతురా! జయ జయ కుటిల వైశ్వానరపుట భేదన విరూపధామా! జయ జయ సమర్తి సంపద్విచ్ఛేదకా! జయ జయ దనుజ వల్లభహల్ల కల్లోలా! జయ జయ జయయబ్ధీశ్వరతో యశోషణ బడబానలా! జయ జయ పవమానసంహారా! జయ జయ యక్షనాయక దుర్వారగర్వాపహారకా! జయ జయ ఈశాన్యైశ్వర్య హరణోద్యమా! జయ జయ నవగ్రహానుగ్రహానిగ్రహా! జయ జయ దశగ్రీవాలంకారా! జయ జయ కైలాస నగేంద్రోత్తున రందుక క్రీడా వినోదా! జయ జయ భవానీశ్వర ప్రసాదకమల శిరః కంజాన పూజా సమర్థా! జయ జయ పుష్పకారూఢ సకల దిగంత విక్రాంతా! జయ జయ బ్రహ్మావశ ప్రదీపికా!: జయ జయ త్రిలోక విజయా! రావణేశ్వరా! జయీభవ! విజయీ భవ.

వ. అని వందిబృందంబులు భయ పార్శ్వంబులందు జయ జయ ధ్వనులనో బిరుదు గద్య పద్యంబులు వక్కాణింప , ముక్తాతపత్రంబుల నడుమ మహిళా మండలార్చిత చామర పవన కంపిత కుండలుండగుచు, వీరరసంబు పురుషా కారంబులనడుమ మహిళా మండలార్చిన చామర పవన కంపిత కుండలుండగుచు,

వీరరసంబు పురుషాకారంబు దాల్చిన లీలసేతేర, ముజ్జగంబులు గడ గడ వడంక, నట్టి సమయంబున, గరి బృంహితంబులును, అశ్వ హేషారవంబులును, దనుజ భటాట్టహాసంబులును, తోమర త్రాస జనకంబులుగా పటహనిస్సాణ భేరీ, శంఖ, కాహళ, భాంకార రవంబులును, ప్రతి ధ్వనుల నీనెనంత, రావణుపై మేఘంబులు, రక్త ధారలు వర్షించె, బిరుద ధ్వజంబులు విరిగి పడియెఁ తురంగంబుల వాలంబుల నుండి నిప్పులు గురిసె దిక్కుల దూమంబు నిబిడంబై సర్వెఁ నటఁ రామునిచే రావణుండు దెగుట వశ్యంబని నభంబును మ్రోసె. బట్టి సమయంబున

అఠాథా - రూపకవము

ప. రక్క సిసేనలఁ నెదురగ రాముడు బంపెన్గపులను ॥రక్క॥

అ. దిక్కులెల్లపిక్కటిలగఁ - దేవతలచ్చెఱువందగఁ ॥రక్క॥

మి. అక్కపి వర్యులు మిగులన్ - యట్టహాసములు జేయుచు, యుక్కు మికిలి
రక్కసులను యుక్కిరి బిక్కిరి జేయగ ॥రక్కసి॥

మ. తరుశైలంబుల తోడ నార్చుచు, భుజాదర్పంబులుప్పొంగ, వా
నరవర్గంబులెదిర్చి వచ్చునెడ నానా కారులా దక్షిణో
త్తరవార్ధుల్ ప్రకటించిడాయుగతిఁ నుద్యత్రొప్ప ఢీదార్కొంచు, సం
గరము స్సేయఁగ జొచ్చిరంత సురలాకాశంబు నన్మూడగర్

సీ. కరులనెక్కించి, భీకర లీలఁ ద్రొక్కించి, వాజులఁదోలి తీవ్రముగ సేయఁ
రథములఁ బరసి శిరంబులఁ జక్కాడి, చెలగి పదాతుల చేరి పొడువఁ
బంతంబు జేకూరఁ ప్లవగోత్తముల గేరి, తరవులు, పాషాణ తతులు బరపి,
శైలంబుల దరించి, సంహారములు జేయఁ, గలఁగకఁ దైత్యులుఁ కపులుఁగలసి,

తే.గీ. పోరునప్పుడు వానర వీరుల సుర, వరుల మీదను బాషాణ వర్షమధిక
లీలగురియింపదనుజులా వేళ విరిగి, తలలు వీడంగబరచిరి తత్తరమునఁ

సీ. మెండైన రథముల మీదికిఁ గుప్పించి, విక్రమ ప్రౌఢిమై విఱుగఁ ద్రొక్కి,
కరుల కొమ్ములు బట్టి జిరజిర వడి ద్రిప్పి, జగతీస్థలంబులఁ జదియఁగొట్టి
తొడరి సైంధవకోటి కడగాళ్ళు విదలించి, పట్టిపెన్ రెక్కలు వాఱఁగొట్టి.
కాల్బలంబుల పైకిఁ గదసి శస్త్రంబుల తొడ కూడనెబట్టి తునియగొట్టి

వే.గీ. చత్రముల గూల్చి చామరసమితిఁ విఱిచి, కెరలి యార్చుచు బిరుదుటెక్కెముల డించి,
వాద్య సంఘంబుల వలీలఁ వసుధఁ గూల్చి, కపులఁ దోలిరి
దానవగణములెల్లఁ

మంజరులు - కాపి

అంతపంక్తి వదనురథమునకు నెదురరుగు వాయుపుత్రునకు
చెంత వచ్చి పిల్చె ఖడ్గరోముడు-జేయనపుడు రణమునకు
పిలిచినర్క రోషమెత్తి వాయుజుడు - భీకర లీలఁ దలపడి
నిలిచివాని రోమమ్ములందాకి - నెంతయు నొచ్చి యురువడి
పర్వతమొడుంగైకొని, దానవు - పై నేయనిశ్చలతతో
పూర్వామరుండుదానిఁ ద్రుంచెయు పొంగి పొరలు రోషముతో
మరియొక పర్వత మెత్తుకొని వచ్చి - మారుతి కడువడి ద్రిప్పి
యురువడి రథమ్ముపై వడి నేయగ యుర్వీ ధరమన నొప్పి
బరియలైతునిగెఁ వజ్రఘాతమున - బ్రద్దలౌనగము వోలె.
దురమునన్ ఖడ్గరోముండు గూలి - తోడ్తోనేలన్ వ్రాలె

ఆ.వె. రోజికలన ఖడ్గ రోముండు గూలుట, సర్పరోముడెరిగి సాహసమున
వాలి సుతునిఁ దాక వాని రోమంబుల, విషము సోలి నొచ్చి వేగఁ దెలిసి

కు. ఆలోన సర్ప రోముని దూలించుచు వాని ముక్కు దూలము బగులన్
వాలితనూజుడు దన్నిన జాలంగా నొగిలి తెలిసి సాహసమొప్పన్.

ఉ. వాలితనూజు నెన్నుదురు, వ్రక్కలు వారఁగఁ సర్పరోముడా
భీలత నొర్చి చే కొలది పేర్కొని కొట్టిన రక్తధారలన్
దేలుచు నంగ దుండతని ఢీకొని పూనిశిరంబు చెక్కలై
వ్రీలి పడంగఁ గగొట్టఁ పృథివీ స్థలి గూలెను సర్పరోముడుర్క

క. ఆలోనసర్ప రోముఁడుఁ గూలుటఁ గనుగొనుచు, మిగుల కోపంబున దా
నాలోవృశ్చిక రోముఁడు నీలుని పై రథము దోలె నిర్భయవృత్తిన్

బిలహరి - త్రిశ్రగతి

ప. శూరుఁడు నీలుండంతనె - చూర్ణముగా వాని తేరు ॥శూరు॥

అ.ప. భోరున నొక వృక్షముతో - పొడి పొడిగా జేసెనపుడు ॥భోరు॥

బ. ధీరతఁ వృశ్చికరోముఁడు - భూరుహము న్దొంచగమం
దార మహీజముపై చెర్ - దానవుడంతనెనీల్గగ ॥శూరు॥

సీ. వృశ్చికరోముఁ డావేశఁ ద్రుంగుటఁ జేసి
వడి రోషమున నగ్నివర్ణుఁడడరి
త్రేతాగ్ను లొక్కడై తెరలి మండినలీల
దనమేనిమంటలు దరికొనంగ
రావణునెదురఁ బరాక్రమస్థితి బేర్చి
రామచంద్రునిమీద రథముఁ దోలి
ప్రల్లదంబునఁ బెక్కు భాషలు నుడువుచు
సాయక నిచయంబు లేయునెడను

తే. వానిశౌర్యంబుఁ దెంపును వానిబలముఁ
జూచి భూపాలుఁ డప్పుడు చోద్యపడుచు
ధనువునందును వారుణాస్త్రంబు దొడిగి
యగ్ని వర్ణునితలఁ ద్రుంచె నాక్షణంబ.

తే. అగ్నివర్ణుడు దెగి పోవుట సురవరుఁడు, కన్నులారంగ గనుగొని కలుషవృత్తి
రామచంద్రుని డాయంగరథము బరపి, పలికెనుత్కట గర్వ ప్రభావుడగుచు

కం. బాలకుమా! బీరము బెడి, పాలకుమా రిపులు నవ్వఁ భయపడివనమున్
దూలకుమా! పేర్కొంచును, జీరకుమాకపులు దోడి జేకొని పోరన్

మంజరులు - కల్యాణి

అని విల్లెక్కిడిదనుజవిభుడు, రోషాయత్త చిత్తుడగుచు,
ఘనమౌర్వీనినదంబు భీకరము-గా, గావించుచు నగుచు
జననాథా గ్రణి మీదనుగ్ర వర-జాలములన్సంధించె
వినువీధిన్సుర సంఘముల్గొలువ వీక్షించి ఇంద్రుడెంచెఁ
రథమెక్కి రావణుండును, నిలపై రామచంద్రభూపతియుం
ప్రధనము జేయుట తగదని మదిలో - వ్యథ బొందిది విజపతియుఁ
మాతలి చేతన్గ వచమున్ రథము - మహితచాపమ్ము శరమున్
భూతల నాథునకున్ పురుహూతుడు - పుత్తెంచె గౌరవముగన్

వ. ఇట్లుబుత్తెంచిన

చ. ధరణికివచ్చి మాతలి, ముదంబున రామునిc జూచి, మీకుగాc
సురపతి బంపి నాడధిక శోభన కృత్యములై వెలుంగు, నీ
శరములు, విల్లు, వజ్రకవచంబును, దేరును వీని చేత సం
గరమున దైత్యునిందునిమి, గైకొను రాఘవ శ్రీజయంబులన్

వ. అని చెప్పిన మాతలి ప్రియవచనంబులకు సంతసించి, విభీషణాను
మతంబున రాము భూపాలుండు శరాసనంబులుగైకొని,
ఇంద్రస్యందమునేన్ వలగొని, వందనంబాచరించి, బాలాదిత్యుండు
పూర్వపర్వతం బెక్కు చందంబున, రథం బెక్కునంత, జయ జయ
ధ్వనులతో సుగ్రీవాంగద హనుమదాదులైన వానరవీరులు
మ్రొక్కిరప్పుడంతరిక్షమ్మున దేవసంఘంబులు సంగ్రామ రంగంబు జూడ
వేడ్క పడి వచ్చి విమానంబులతో గ్రిక్కిరిసి, చూచుచుండి రా
సమయంబున,

కం. గిరిగిరి నభమునభమ్మను, దంధరమును జలధి జలది దార్కొను రీతిన్
సురరిపుడు నసురరిపుcడును, దురముననెదిరించిరధిక దోర్బలయుక్తిన్

వ. ఇట్లు మార్కొనుచు,

కన్నడ - ఆది

ప. వీరాలాపము లాడుచున్ గదసి - రిర్వురు దోర్వీర్యంబు తోడను ॥వీరా॥

అ.ప. జ్యారావంబులు మిన్నుముట్టగా, వారాసులుగ లగంగ నార్చుచున్॥వీరా॥

బ. క్రూరాస్త్రంబుల నొందొరులపైని - గుప్పించుకొనుచునుప్పొంగుచు బల
గర్వ స్ఫూర్తిన్ తీవ్రశబ్దముల - కదన కోదండ పాడిత్యంబున ॥వీరా॥

చరణము. దనుజేశుడేయు శరముల కడిమిగ - మనుజేశుడు తప్పద్రుంచు
మార్కొని ॥దను॥
మనుజేశుడేయు శరజాలంబులc దనుజేశుcడుతప్ప, ద్రుంచుc తార్కొని ॥వీ॥

మి. తనభుజశక్తిన్ దనుజబాణముల - దప్పించు కొనుచురా ముడేసినగ
ఘన భుజ బలమున దప్పించు కొనుచు - దనుజనాయుకుడు
ప్రేటులాడగా ॥వీరా॥

కం. కంటున వేసిన శరములు, వింటన్ దప్పించుకొనుచు, వెసబాణములన్
గెంటింపుచుతమ గాత్రము లంటక యుండంగఁ బ్రేటులాడిరక డిమిన్

కం. మొదల నొక బాణమావల, పదులును పదిపదులు వేయి పదివేలునునే
బది వేలు లక్ష కోటియు, జెదరక విలుకాంద్రమీద శీఘ్రమెబర్వెన్

వ. అట్టి సమయంబున

చ. అభవ, మురాంతకాదులు, మహాత్ములు వింటికి, వారి కన్ననున్
త్రిభువన మందు వీరె గణుతిపగ నెక్కుడటంచు, మెచ్చుచున్
నభమున నుండి ప్రస్తుతి ఘనంబుగ జేతురు, దేవకోటుల
ట్లు భయబంలంబులన్పొగడుచుందురు రామునిఁ రావణా సురున్

చ. ధనువుల మ్రోత, మేఘనినదంబులుగా, శరదీప్తి జాలముల్
ఘనతర చంచలావళులుగా, మణి మౌక్తిక దీప్తి ధాత్రిమీదను వడగండ్లుగా,
క్షతజ ధారలు, సంతత వర్షధారగా
ననయముఁ జెప్పనొప్పెఁ విపులాహవమప్పుడు, వానకాలమై

తే.గీ. పంక్తికంఠుండు మిగులకోపంబుగదురఁ, దేవగంధర్వ శరము సంధించివిచి,
రామభూపాలు మీద విక్రమము మెఱసి, వేసివడి నార్చె, దిగ్దంతి విసరమదలఁ

కం. దానికి ప్రతి శరమప్పుడు, మానవనాథుండు దొడిగి, మానుషమడరన్
బూనికవేసిన దానిం, బోనీయక ద్రుంచి వైచెఁభువనములురలన్

కం. త్రుంచినఁ గనుగొనిదనుజుఁడుఁ మించిన కోపమున రాముమీదను వడిసం
ధించి స్ఫురద్విషబాణము, వంచింపక యేయఁ దానివలనన్‌జాలన్

ఆనె. నాగశరము లొదవి నానాముఖంబుల, వచ్చునపుడు మనుజ వల్లభుండుఁ
గరుడ బాణమేసిఖండించె నన్నింటి, మింటసురలు జూచి మెచ్చి పొగడఁ

వంజరుల

ఆదివ్యధ బోయిన దనుజుఁడాగ్రహమునన్ త్రిశూలమును వేయ న
య్యది విపులార్చుల బేర్చుచున్ వచ్చియనఘుని రాముని డాయఁ
వదలక ముందుగ త్రిదశవల్లభుడు, సదయత నిచ్చిన శక్తిన్

వదలిన రావణు మణి భూషణముల వరుసఁ (తిశూలము(ద్రుంచెన్
వ. ఇట్లు శూలంబును దూలి పోయిన
కం. సూతుని రథమును వాజుల కేతువు దూలంగనేసి, కినుక మెయింజే
సీతను నొప్పించిన నృపుండాతరి దైతేయ విభుని నద్భుత మడరన్.
కం. సూటిగొనియసురతలల కిరీటముల వలీల డుల్లిరివ్వన నొసలున్
బీటలు వారు శతాంగము, ఘోటకముల గుండెల విసి గూలగనేసెన్.
ఉ. అయ్యెడ దైత్య నాయకుడహంకృతిఁ రాముని మేనఁనాటఁగా
వేయు శరంబు లాయముల వేగమెగా, డి నరక్త పూరముల్
కాయము దొప్పఁదోగఁ వడిఁ (గమ్మెడు నప్పుడు గూడనొప్పెఁబ
ద్మాయత లోచనుండు చరమా(ద్రితటిందగు భానుడోయనన్
ఆ.వె. అంతఁ రామచం(ద్రుడత్యంత కుపితుఁడై, బాణవృష్టిఁ గురియఁ పంక్తి ముఖుఁడు
కాలు, (వేలుఁ చేయి, కదలింప నోపక మెదలలేక రథము మీద నొరిగె.
వ. రావణుండు సొమ్మసిల్లి పోవుటెరింగి, కాలకేతుడు తేరు దూరంబుగా గొనిపోయినఁ కొంత పొద్దునకు దనుజేం(ద్రుండు మూర్ఛందేరి, యోరీ!: పగవారలు నవ్వఁదగ దనకరథబిట్లు తేదగుసేయని కోపించిన గాలకేతుండును, యుద్ధ మధ్యంబున దేవరకు సంకటం బైన, రథంబు వెడలఁగొని పోవుట యోటమిగాదని, ధర్మ విధులు జెప్పుదురు. గావున నేనిట్లు దెచ్చితినని విన్నవించిన సూతుని వాక్యంబులకు మెచ్చిప సదనంబు లిచ్చి, మనరథంబు రాముని పయింబరపు మననట్లుగావించిన నగనుంగొని, రఘూత్తముండు

కల్యాణి - రూపకము

ప. మాతలీ మనరథము బరపు - మాతని రథమునకెదురుగ ||మాత||
అ. ఈతఱినతి శీ(ఘగతిన్ జూత మితని బాహు బలము ||మాత||
మి. భూతలమున దుర్మార్గునిఁ బోనడంచియతివేగమె
ఖ్యాతింగాంచెద భువినే నీతిన్నిల్పెదస్థిరముగ ||మాత||
వ. అనిన మాతలి దశకంఠుని కెదురుగా రథంబుఁ బోనిచ్చిన రాఘవుండు రావణునకిట్లనియె

ఉ. భూరి భుజ ప్రతాపమున బొంగుచు, నిర్జర కోటిమాటికిన్
బోరc జయించి తంచుc బలుపోకల పోదువు నీవు భీతిమై
దారకనిల్చి నా యెడ ప్రతాపము సూపుము, చూప పేని నా
వారిజ గర్భుడడ్డుపడ వచ్చినc జంపుదు నిన్ను రావణా!

ఉ. ఆలములోన వానరులc నాలము జేసిన యట్లుగాదు, నా
పాలిశరంబు నీను దుటి వ్రాలుహరింపగc బాలు పడ్డదీ
వేళ వృధాపహాస్యములు వేయి విధంబుల మానలేక, తాc
గాలుడుc కన్ను గీటెcనిదె కాలముడగ్గఱెనీకు రావణా!

చ. హరి గిరి, వహ్నిగిహ్ని ప్రళయాంతకుc గింతకు, దైత్యు, గీత్యు, వా
ర్వరు, గిరు, గాడ్పుగీడ్పు, ధన వల్ల భుగిల్లభు, రుద్రుగిద్రు, సం
గరమున నోర్చినట్టి దశకంధర నీకు జయింప వచ్చునే?
సుర నగధీరు నుగ్ర రణ శూరుcపయోధి గభీరు రాఘవున్!

కం. మతిc దలcపc సుఖ రతింబతివ్రతలను ముని వరులc బట్టి వ్రతములు గర్వో
న్నతిc జెఱచి నట్టి దురిత స్థితినిప్పుడు నీవు నాకు జిక్కితివిచటన్

వ. అనిగర్వాలాపంబులాడుచున్న యుర్వీశునకుc పూర్వ గీర్వాణాధీశ్వ
రుండగు రావణాసురుండిట్లనియె

వంజరులు - అఠాణా

అంతటి భూరి పరాక్రమ వంతుడ వౌదు పేని రామానా
పంతమెఱింగియు నెఱుగకయింత ప్రగల్భములాడగ నౌనా?
నీ లావు న్నాల్లావున్ జూపుద మేలాయీగర్వోక్తుల్
ఆలమ్మున వాలాయముగాని పుడమరులు గనమన శక్తుల్

మ. జననాధాగ్రణి నా ప్రతిజ్ఞ వినుమా! శాంతాత్ముడై, నీకునై
వనజాప్తుండిట వచ్చికావు మనుచున్ వైళంబనన్నోరినన్
విను వీధిన్సురలెల్ల జూచి, వెఱవన్ బీరంబు సంధిల్లcగా
నినునీతమ్ముని జంపకుండ మరలన్ నేలంకకు న్పోcజుమీ

వ. అని కోపోద్దీపితమానసులై వీరాలాపంబులాడుచు, నిద్దరును నుద్దవిడి
గద్దింపుచు, నోల మాసగొనక మీరిన కోపంబున శరీరంబులు మఱచి,

జయోల్లాసంబులుల్లసిల్ల, నొసళ్లఁబొడవు పెన్నెమటు మొత్తంబులును,
రక్తపూరంబులు నున్నెరసి, కాలువలై బాఱుచుండఁమె
ఱుంగు కఱకుటుంపగముల నాటినన్నుఱుకెఱుంగక తమకంబులను నిష్ఠుర బాణ
సంఘట్టనంబులను, బృధుల రథనేమి స్వనంబులను, ద్విసహస్ర తురంగ
హేషారవంబులను, భటుల సింహనాదంబులను గగనంబుబగులఁ జగంబులుఁ
గలంగ, సముద్రంబులు ఘూర్ణిల్ల, ధాత్రివడంక, దిగ్గజంబులు మ్రొగ్గతిల బడ,
న భోభాగంబున దేవ గంధర్వ, సిద్ధి, సాధ్య, కిన్నెర, కింపురుషాదులు చూచి
వెఱంగు వడ నిది పగలిది రాత్రియని యెఱుంగక సమరంబున నేడహా
రాత్రంబులుబోరాడి, యలసి బాణ ప్రయోగములుజ్జగించి, యొకరి నొకరు
జూచుచుండ, నయ్యవసరంబున.

కం. సరసీరుహామిత్రాన్వయు, డరుదరుదని సురలు వొగడఁ వసుధేశ్వరు,న
క్కరములు, శిరములుఁ దెగివడ, నురుముష్టిని దీసి పేగ నుగ్రాస్త్రములన్

బిలహరి - ఖండగతి

ప. తెగిపడిన శిరములు - న్దెగిపడిన కరములును ॥తెగి॥

అ.ప. తెగినయట్లే మొలిచి - తగియుండెఁ బిగువుగా ॥తెగి॥

మి. తెగిమఱలన్మొలిచె -న్నగవాహుడు వెఱవన్
తొగలంబలె వరల - న్నగనొందగ నృపుడున్ ॥తెగి॥

కం. తొడిగెడు శరములు, ధరపైబడియెడు మస్తకములేరు పడకుండగఁన
ప్పుడు రామమహీతలనరుఁడెడతెగ కుండంగ నేసె నేమనిచెప్పన్

వ. అట్టి సమయంబున

ఆ. వె.వింటఁ దొడుగు శరమువెడలె డిశరమును, తిరుగ మొలుచు తలలు తెగిన
తలలు.
నెట్టి వారికైన నెఱుగంగ రాకుండ, రాముఁడేయఁదొడగెఁ రణములోన

ఆ. వె.శరముఁ దొడిగితివియ చక్రంబువలె నుండుఁ శరము విడుచు నపుడు
చాపమగును.
జూడ నొప్పెనౌర! శోభితంబగు రాముఁ చేతి విలుసెప్పఁ చిత్రమగును.

ఉ. కాంచనపుంఖ బదివ్య విశిఖంబుల బాహులుఁ మస్తకంబులున్

ద్రెంచినఁ ద్రెంచినట్లై, కడు తేజమెలర్పగఁ నుద్భవించు స
త్కాంచన రత్న భూషణనికాయము దీప్తులు ప్రజ్వరిల్లఁ గాఁ
గాంచన గర్వదత్త వరగర్వ విశేషము చేత సారెకున్

మంజరులు - అఠాణా

పొరిఁ బొరిఁ ద్రుంచిన చందమున్మరల బుట్టెడు చందము యమ్మున్
న్నారి న్వెరపున, బూను చందమును, బారుచందపు విధమ్మున్
కరము నుతియింప నరుడుగా దెస్వర్గమ్మున సురలకు నైనన్
శిరముల తూపుల చిత్రమ్ముల్ శ్రీ రాముని బాణములెల్ల
రావణుమేనన్నాటి నట్టె శ్రీరాముని గాత్రంబెల్ల
నాటి రక్తమయమ్మై విఱియన్ బూసిన మోదుగ వృక్షముల
సాటియై యరుణగిరిఁలేభానుని సాటియై సింధురముల

వ. దలపించునంత

క. ఎత్తిలి రాముఁడుదైత్యుని, కుత్తుక నొక కోలద్రుంచి కూర్చుటదొడ్డో?
నెత్తురు గ్రమ్మకమున్నే మొత్తములు గదలలు మరల మెలచుట దొడ్డో?

వ. అని దేవసంఘమ్ములుగొనియాడఁ శ్రీరామచంద్రుడు దైత్య నాయకుని తలలు చేతులుంద్రుంచిత్రుంచి, విసివినంగని, విభీషణుండునరేంద్రున కిట్లనియె.

క. పొలగనాతని నా భీమూలంబుననున్న యమృతమును మొదల నుని
ర్మూలముగా శ్రీ రఘు భూపాలక తెగ ద్రేయు మగ్ని బాణము చేతన్

కన్నడ - త్రిపుట

ప. విన్నవించెద వినుమో రామనా - యన్న చావు రహస్యమునునే ॥విన్న॥
అ.ప. ఉన్నదమృత భాండమాతని - యుదరమున నాభి స్థలంబున ॥విన్న॥
మి. ఉన్నవరకు బ్రహ్మాదులకనిఁ నోర్వగ శక్యముగాదాతని,
పన్నగ శయనా భేదింపుము - పని దీరున్గాంత వరకు నీకున్ ॥విన్న॥
చరణం. కరములిరువది శిరములున్నది - మరల మొలచును నూట తొమ్మిది
మారులన్నింటి దునిమినన్ తుద - ముట్టునతడి దిపరమ గోప్యము
మి. పరమ పురుష తెలిసితి నీ కర - శరములనీతనిదును మాడుము
కరుణ గనుము నాదురితంబుల - సరగననణచి నను రక్షింపుము ॥విన్న॥

వ. అని విన్నవించిన విని రామ భూపాలుండట్లు గావించిన

కం. ఒక తలయుఁ రెండు చేతులు, నకలంక స్థితిని గల్గునట్లితనిన్ నే
డొక తలకు దెచ్చె నౌనని, ప్రకటించిరి సురలు రామభద్రుని నెలమిన్

అంతనమృతంబు దెగిపోవనసుర విభుని, మేనఁ బాహులు, ఁతలలును మిన్నకడగి పోయి కనుపట్టెనప్పుడద్భుతముగాగ, రెండు చేతులు నొక తలగండు మిగుల,

వ. అంత దైత్యేయుండు మనంబున

కం. ఎవ్వరు నెఱుగనిమర్మం, బివ్వి భునకు నెఱుకపఱు పనిటు గావించెన్
మవ్వమున నీ విభీషణు, క్రొవ్వెల్లనడంతునంచు, క్రూర తతోడన్

సీ. తొల్లి వరప్రాప్తిఁ దొరికినయటు వంటి, రక్తాభయను మహా శక్తి దివిచి,
గంధపుష్పాక్షత కలితమై కనుపట్టి, విపుల తేజంబునఁ వెలయుచున్న
దానిఁ ప్రయోగింపఁ దారుణా నలతీవ్ర, శిఖలు దిక్తటుముల జెలఁగుచుండ
ఘన ఘనా రావమై, ఘంటానినాదంబు, శ్రుతిపుటంబులకు నశ్రుతము గాగ

తే.గీ. చండతరముగనటు విభీషణునికైకిఁ జిచ్చులు మియుచుఁ నుగ్రమై వచ్చుదానిఁ
గాంచి రాముఁడు నిశిత మార్గణము చేత, తృణముకైవడి నడిమికి ద్రెంచివైచె

మంజరులు - బాగు

వృథయగు తన శక్తిం గని రాముండెంతయు ఁ క్రోధము మీరఁ
గదాకోదండ భిండివాల ముద్గరయసి పట్టి సక్రూర
పరశుముసలాది సాధనమ్ములన వక్రమ విక్రమ లీల
దుర మొనరింప విభీషణుండుల్కి నరవరుతో ననె చాల
దేవా! రెండు కరంబులతో వీడీ విధి కడు విజృంభించి
చేవన్పొపుచునుండెన్మఱలన్ చేతులు తలలున్ మొల్చి
వచ్చెనేని దుస్సాధ్యంబీతని - రచ్చఁ గెల్చుటటు గాన
జెచ్చెఱ బ్రహ్మాస్త్రమ్ము సంధించి ఛేధింపు మా బిరాన

వ. అని విన్నవించిన

మ. అనఘుండుజ్వల చాప దండమున బ్రహ్మాస్త్రంబు సంధించి, యొ
య్యనఁగర్ణాంతముగా గడు న్దివిచి, ప్రత్యాలీఢ పాదస్థుండై

దను జాధీశ్వరు బాహు మధ్యము వడి న్దాకంగలక్ష్యమ్మగా
గొని బిట్టే సెనదల్చి తీవ్ర తరమౌ కోపంబు దీపింపగన్

కం. ఆప్రేటు వడిగ నాటిన, రావణుడతివి వశుడగుచు వ్రా లెన్ధాత్రిన్
దేవతతి బొగడియప్పుడు, పూవుల వర్షంబు గురిసెఁ భూవరుమీదన్

ఉ. సంగర భూమి రావణుడు సత్వముఁ దూలి ధరిత్రి గూలినన్
క్రుంగె భరంబునన్ధరణి క్రుంగెఁ కులాచల వర్గమెల్ల, వే
గ్రుంగెది శాకరీంద్రములు గ్రుంగెమ హోరగ వంశ నాధుడున్
గుంగెఁడు లీకు లేశ్వరుడుఁ గ్రుంగెవరాహముఁ గ్రుడ్లు దేలగన్

కం. జగములకు నెల్లఁ బాధకుఁడగు రావణుడాజిఁ గూలఁ నంతటి తోడన్
బగదీరెననుచు రాముఁడు, తగఁతన విల్లెక్కుడించి తమ్మునికిచ్చెన్

కల్యాణి - ఆది

ప. అమితానందముఁ జెందెఁ లోకములు - ఆజిలోన రావణుండు గూలగఁ ॥నమి॥

అ.ప. అమరులకంటికి నిద్ర వచ్చెకడు హాయిగమునుల తపంబు ఫలియించె॥నమి॥

మి. సమకూరెన్నంత సముసాధ్యులకు యమరెగుహ్యాకా వళికి సంతోష
మమరెఁ సిద్ధుల తలంపుల్సిద్ధుల నందె దర్వీకరంబుల తల్లడ ముడిగె ॥నమ॥

చ. కిన్నర సంఘము కీడు దొలఁగెఁ గంధర్వ గణములకు క్షేమ మింపారె
ఖేచర గణముల వేద్కలింపలరెఁ భూచర గణముల యానందము మీరెఁ

మి. సన్నుతింప వేనోళ్ల ముని వరులు, పన్నగాది విద్యాధరులు నరులు
మిన్ను మన్ను నన్గల జంతుజాల - మెల్ల నూత్న కళలింపు సొంపార ॥నమ॥

ఉ. అంత విభీషణుండు తనయన్న పదంబుల మీద వ్రాలి, య
త్యంత విషాదదుఃఖ జనితాశ్రుకణంబులు రాలనేడ్చె, తో
కాంతకుడైన రావణుమ హాద్భుత దుష్ట పరాక్రమంబు, భూ
కాంతునిమున్గలన్డవిగద్గదకంఠకషాయ నేత్రుడై

వ. అట్టి సమయంబున, మందోదరి మొదలైన యంతఃపుర సుందరీ సందోహంబు లేతెంచి, తమ ప్రాణేశ్వరుండైన రాక్షసకుల సార్వ భౌమునీఁగని వక్షంబులు శిరంబులు మోదుకొను చు, బహు విధముల ప్రలవించుచు, బరివేష్టించి కొనియుండ, భూకాంతుండు కాంతాలాపంబులననునయించి,

విభీషణునింగని నీవు దుఃఖించుడిగి, మీ యన్నకు అగ్ని సంస్కార విధుల నా చరింపు మనిన, నతండట్లు గావించిన, యనంతరంబ విభీషణుని లంకా నగరంబునకుం బట్టంబు గట్టించిన, నతండు సుగంధ ద్రవ్యంబులను నవ రత్న ఖచితంబు లైన భూషణంబులును, చీని చీనాంబరములును, కానుకగా నిచ్చినంబరి గ్రహించియవి ఎల్లను మాతలికిచ్చి, ప్రియోక్తులందనిపి పనిచిన నతండుఁ స్వర్గంబునకుంజనియె, నయ్యవసరంబున

వంజరులు - కల్యాణి

అంత రాఘవుండావిభీషణుని యాదరంబునన్గాంచి,
సంతసమున బిల్చి పల్కె నిట్టుల సత్వరమీవేతెంచి
దశకంఠుని పరిమార్చిన వార్తను ధరణీ సుతకెరిగించి,
శశి వదనన్నీదేవి మొదలుగా సఖీ జనంబులఁబంచి
జనక జనలంకరించి తెమ్మనగఁ చయ్యనవాతఁడు వచ్చి
వనిత సరమలకు జెప్పి సఖులతో నొనరఁసీతఁగొని తెచ్చి
అంగనామణిన్జలక మాడించి, బంగరు చేలముఁగట్టి
రంగు మీరి పొల్పొందు జలతారు రవికను దొడంగ బెట్టి
కందర్పనిభుడు శ్రీరామచంద్రుఁ కడకున్వేగమె జేర్చి

వ. రామ భూపాలుని సమ్ముఖమ్మనను నిచిన నద్ధరాతనూజ పతికి భక్తి తాత్పర్యంబులు వెలయ ప్రణమిల్లిన నతండు వనితా రత్నంబగు సీతన్గనుంగొని ఇట్లనియె.

క. కులసతి జెరగొని పోయిన, యలశాత్రపు వెలువనోపడను పలుకులకుఁ
గెలిచితిఁ బగ జంపితిఁ నికఁ నెలఁ తానీయిచ్చుఁ జనుమునేనిన్నొల్లన్

ఆ. వె. అనుచుఁబల్కు పల్కుల వనీత నూజాతకర్ణములకు వాడిఁ గలిగినట్టి
నారసములు సోఁకి నాటిన యట్లైన, సరసి జాక్షి మూర్ఛఁ జాలనొంది.

చ. నరవరనాదు చిత్తము మనంబున నీవ ఎఱింగియుండియున్
పరుషములాడనేమిటికి? బాపము నా యెడలేదు కాదుపో
సురలు నుతింపఁమేటి సొదఁజొచ్చెద మెచ్చుఁడటన్నఁ రామ భూ
వరుని మనంబొడంబడినఁ వారి జలోచన సీత యాతరిన్

కం. హృదయేశుడలరఁనప్పుడ సోదఁ జొచ్చెను భూమిపుత్రిసురలు నుతింపన్
ముదమంది పద్మభవుఁడా యదనునఁ ప్రత్యక్ష మయ్యెఁ నౌనౌ ననుచున్

మంజరులు - శ్రీరాగం

శ్రీ రామా! ఎలోపంబులేదు సీతవలననిక్కమ్ము
ఈ రామామణి మహాపతివ్రత నీమె నాదరణఁ గనుము
అని పల్క పద్మ సంభవుని మాటలందరున్నాలకించి
మనములందలరపావకుండు యమ్మానినిన్ యప్పగించి,
పరమపతివ్రత నీ మహాసాధ్వి పరిగ్రహింపుము రామా
స్థిర లక్ష్మీ యుతముగ వర్ధిల్లుమ శ్రీ రఘువంశోద్ధామా
అని యప్పగింప దశరథుండవే యమర లోకంబునుండి
జని సీత రాముని లక్ష్మణునిన్ గనియాశీర్వచనములిడి

వ. స్వర్గమునకు జనినంత, సకల దేవతలు రామునింగని ఇట్లనిరి

బంధువీరాళి ఖండగీత

అ.ప. పుట్టితివి మా కొఱకు, పురుషోత్తమా ఖలుల, మట్టు పెట్టగధరన్మానవుడవైదేవ

అ. ప కొట్టితివిదనుజునిన్ - ఘోరదురిత కళంకు, కట్టిడిని ఖలునిలంకా
పట్టణాధిపుని ॥కొట్టి॥

మి. జెట్టివిజగములకున్ చుట్టంబవు సాధుల, కిట్టినీ పదంబుల కివె గొనుమా
బోతలు ॥పుట్టి॥

మంజరులు - మాండ్

అనివినుతి జేసి దేవతలందరు జనిరి తమ లోకమునకు
చనిపోయిన కపులందరిఁ బ్రతుకగఁ సత్కృప వర మిడి కొనకు
భానుపుత్రాది వానరుల తోడ - ఘన విభీషణుని తోడఁ
జానకి తో లక్ష్మణుని తోడ పుష్పకమున దనుజులుఁ గూడఁ

వ. ఇట్లు పుష్పకారూఢుండై చనుచుండి రామభూకాంతుండు, కాంతా రత్నంబునకు చేయెత్తి చూపుచు, సంగ్రామ స్థలంబిదె, రావణకుంభకర్ణాదులయిన రాక్షసబలంబులను, మర్దించిన తావిదె, సువేలా చలంబిదె, సంద్రమ్మునన్బంధించిన సేతు బంధనమ్మిదె, విభీషణుండు మమ్ముఁ శరణుజొచ్చిన ప్రదేశంబిదె,

సుగ్రీవునికిష్కింధా నగరంబిదె, వాలిని గూల నేసినచోటిదె, భానునందనుండు మమ్ముఁ బొడగన్న స్థలంబిదె, ఋష్యమూకా చలంబిదె, వాయుతనూభవుండు మమ్ములఁ బొడగన్న, పంపా సరోవరంబిదె, కబంధుడను దానవుని వధించిన ప్రదేశం బిదె, జటావువనుపక్షీంద్రుడు, నిన్ను గొనిపోవునపుడు రావణాసురుని తోడంబోరి మడసి నస్థానమిదె, దశ వదనుండు నిన్ను చెఱంగొని పోయిన చోటిదె, మాయామృగంబును బడవేసిన చోటిదెఁ ఖర దూషణాదులు నాతోడంబోరి పొలచిన చోటిదె, శూర్పణఖయను దాని ముక్కు పెవులు జెక్కిన ఇక్కయిదె, సుతీక్ష్ణుండను మునీంద్రుండు వర్తించునాశ్రమంబిదె, యగస్త్యాశ్రమంబిదె అత్రి మహాముని పత్ని యనసూయాదేవి, యంగరాగంబులు నీకిచ్చిన చక్కిదె, విరాధుండను రాక్షసుండు నిన్ను బట్టుకొని పోవుచుండ విడిపించిన చోటిదె, గంగానది యల్లదె, కనుంగొను మని చెప్పుచు భరద్వాజాశ్రమంబునకు జనియచ్చటు పుష్పకంబుడిగ్గి, యమ్మునీంద్రునకు నమస్కరించిన నతండు రాముని దీవించి, మహానందమ్ము నొంది నినసంభవా! వేవేగ నేగినంది గ్రామముననున్న భరతునకు మారాక నెరింగించి రమ్మని యనిపిన

కం. అరుదెంచి చూచెఁ పావని, సురుచిర సౌభాగ్యుఁ భరతుశోభనచరితున్
విరచితపుణ్యస్ఫూర్తిన్, నిరుపమసత్కీర్తి నిత్య నిరతున్భరతున్

వ. కనుంగొని వందనంబు జేసి, కరంబుల మోడ్చి వినయంబున

అభేరి - ఆది

ప. భరతా, శుభ చరితా, వినుమా మనవి ||భర||

అ. శ్రీ రఘురాముడు - శ్రితజనవంద్యుడు
పరమ పురుషుడు భక్త జనావనుడు ||భర||

మి. అరుదెంచి యున్న వాడు భర - ద్వాజాశ్రమంబునం
దున్నాడు నేడు సరగనన్నంపె నీ వార్త జెప్పి - సంతసింప జేయుగ నిన్నీ
నాడు ||భరతా||

మంజరులు - ఆరభి

అనవిని భరతుడు మహదానందము - నందియంజనాసుతుని
వినయమునకు మెచ్చుకొనుచు నాతని, వేడుకన్గౌగలించి,

జేరిచి యగ్రజు సేమమ్ము నడిగి చెప్పఁబంపె తల్లులకు
మీరిన కుతుకమ్మున శత్రుఘ్నుని, జేరి సాకేతపురికి

వ. అటు భరద్వాజాశ్రమంబున మజ్జన భోజనాదులాచరించి, నాటి రాత్రి నిలిచి, మరు నాడమ్మునీంద్రుని వీడ్కొని, శ్రీరామచంద్రుండు పుష్పకారూఢుండై చనుదెంచుచున్న యప్పుడన్నకు భరతుఁడు సకల సేనాసమేతుఁడై, తల్లులుందమ్ముండును నెదురేగి, రాఘవేశ్వరుపాదారవిందంబులకు వందనంబాచరించిన, నాతండను జున్మలఁ గౌగలించుకొని, లక్ష్మణ సహితుండై జనకరాజనందనంగూడి, తల్లుల మువ్వురకుం బ్రమణమిల్లి, వారలతిస్నేహంబున నిండు కౌగిళ్ల నొత్తుచు, దీవింపఁ దమలో దాము పెద్ద పిన్నయంతరువుల వందనంబులు జేసుకొని, మరలినంది గ్రామంబునకేగి, యచ్చట పుష్పకంబుడిగ్గి, దాని కర్పన లిచ్చి, కుబేరుని వీటికి బొమ్మని యనిపి, భరతు మందిరముఁ బ్రవేశించెనట్టి శుభ సమయంబున,

కం. దానంబులిచ్చి భద్ర స్నానంబులు సేసి భూషణంబులు పూతన్
చీనాంబరములు పరిమళ, సూనంబులు; దాల్చి రధిక శోభనలీలన్

వ. ఇట్లు రామాది సోదర చతుష్టయంబును, భూమి నండనయును, దపోవేషంబుజ్జగించి, రాజ చిహ్నంబులుగైకొని, దానవ వానర బలంబులం గూడుకొని షడ్రసోపేతంబులయిన భోజనంబులంబరితృప్తులై యా రాత్రి గడపి మఱునాడు గజ, తురగ,స్యందనాది వాహనంబు లెక్కి, ఛత్ర చామరంబులు మెఱయు, శంఖ, భేరీ భాంకారవములుల్లసిల్ల, వందిమాగధు లుబికుడు కైవారములెజెలంగ, వశిష్ఠాను మతమ్మున, శుభ ముహూర్తమ్మున సింహాసనమ్మున పట్టభద్రుండై రామచంద్రుడు భూసురులకు దానంబులొసంగి, యర్థార్థులకి ష్టార్థంబులిచ్చి, విభీషణ, సుగ్రీవాంగద జాంబవత్హనుమదాదులు ప్రియ వచనంబులందనిపి, వారి వారికిందగిన పగిదిని గట్నంబులిచ్చి వీడ్కొలిపిన వారుని జాస్థానంబులకు జనిరంత మహానందంబున

మంజరులు - కల్యాణి

అశ్వమేధ యాగంబునొనరించె నమరులెల్ల మెచ్చంగఁ
విశ్వశాంతికై, పదునొకండు వేలేండ్లు ప్రజలు మెచ్చంగ

రాజ్య పాలనమ్మొనరించె ప్రజారంజకముగ రాముండు.

పూజ్యు డైకన్నతంద్రిరీతిఁ - బ్రోచె జనుల కాముండు

సీ. సకలౌషధక్రియా, సంజీవ కరణిచే, వెలఁగి దిక్కులను రక్షింపజాలు

బంధు కోన్నత శస్త్రసంధాన రకణిచే - కుటిలారులను రంభగూర్పజాలు

సంతతోత్పాదనా సౌవర్ణరకణిచే - నర్థుల దారిద్ర్యమడఁపజాలు

ననువిన సంధాన మనుశల్యకరణిచే - పురుషార్థ నికరంబు బ్రోవజాలు

తే.గీ. సిద్ధ విద్యానురాగ ప్రసిద్ధుడైన, రాజ చంద్రుండితండని రాజులెల్లఁ

సమ్మతింపగ విలసిల్లె జగతియందు, భాగ్య విస్తారి రామభూపాల శౌరి

సీ. కుటిలతనదులందుఁగుంతలంబులయందు, బొంకుజూదములందు

బూతులందు

లేమివైరుల యందు లేమల నడుమందు, భంగ మంబుధులందు

బరులయందు

కోపంబుఖలులందుఁ క్రూర వర్తనమందుఁ, వడకు వీణలయందు, ఁ

వ్యసనులందు

బంధంబురతులందుఁబటుశిరోజములందుఁ మోహంబు ధనమందు

ముదితలందు

తే.గీ. చింతకవులందుఁ తపసుల చిత్తమందు, వర్ణ మిశితంబు చిత్తరు వందు

యవను

లందు నసెగాని యొండెదఁ జెందకుండ, లీల ధరఁ యేలెఁ రామ భూపాల వరుడు

కం. ఈరామచరితమెప్పుడు; వారక విన్నట్టి వారు వ్రాసిన వారున్

కోరి పఠించిన వారును, శ్రీ రాముని కరుణమేలు జెందె దరెలమిన్.

కం. జలజాక్ష భక్తవత్సల! జలజాసన వినుత పాద! జలజాత సుధా!

జల రాసి భవ్యమందిర, జలజాకర చారు హంస! జానకి రామా!

మాలిని కువలయదళనేత్రా! కోమల స్నిగ్ధగాత్రా!

భవముఖ నుతిపాత్రా! భక్త వృక్షార్థి జైత్రా,

రవి శశి సమధామా! రక్షితాక్షాంఘ్రి భామా!

కవి జననుతనామా! కావుమామమ్ము రామా!

## ఆరభి - ఆది

ప. శ్రీ రఘు నందన మంగళం - సీతారమణా మంగళం, కాంచన చేలా మంగళం, కల్యాణ రామా మంగళం

గద్యము : ఇది శ్రీ గౌరీశ్వర వర ప్రసాద లబ్ధ, గురు జంగమార్చన వినోద, సూరి జన వినుత, కవిచమత్కారాతుకూరి, కేసన శెట్టి తనయ మొల్ల నామధేయ విరచితంబైన శ్రీ రామాయణ మహా కావ్యంబునందు యుద్ధకాండము తృతీయాశ్వాసము నందు, హరికథా కేసరి, హరికథా సుధానిధి సత్కథాధుర్య, గాన కళా ప్రపూర్ణ, పద్య పఠనా ప్రవీణ, ఇత్యాది బిరుదాంకితులును, గజారోహణాది సమ్మానితులు, శ్రీ రామాయణ, మహాభారత, భాగవతాది హరికథా కథకులు,

ఆకాశవాణిగాయకులు, నిరంతర శ్రీ రాధాకృష్ణ దివ్య పాదారవింద సేవాదురంధరులును శ్రీ తాళ్లూరు నరసార్య వెంకటాంబా ప్రథమ తనూజుడు తాళ్లూరు శంకరయ్య భాగవతారుచే పాటలు మంజరుల కూర్పుతో (రచన) సర్వము సంపూర్ణము.

ఓం సర్వే జనాస్సుఖినో భవంతు - ఓంతత్సత్

మొల్ల రామాయణము - హరికథానువాదము

వెల : రూ.50/-



తాళ్ళూరు శంకరయ్య భాగవతార్,

స్టూడెంట్స్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, తిరుపతి. ఫోన్: 29253